# శ్రీ సుందర హనుమద్వైభవము

## (సుందరకాండ మూలము 68 సర్గలు పారాయణ విధులు సహా)




గ్రంథకర్త

మంత్రశాస్త్ర ప్రవీణ, హనుమదుపాసక

బ్రహ్మశ్రీ శిష్ట్లా చంద్రమౌళి శాస్త్రి



ప్రకాశకులు

బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమత్ శాస్త్రి

హనుమదుపాసకులు

వెల :105 = 00 రు.

తృతీయ ముద్రణ 1993




"This book is published with the financial assistance of TIRUMALA TIRUPATI DAVASTANAMS under their scheme AID TO PUBLISH RELIGIOUS BOOKS"

ముద్రణ : ప్రసన్న ఆర్ట్ ప్రింటర్స్, ఏలూరు. ✆ 24153
ముఖ చిత్రం : శశి ఆర్ట్స్, వెంకట్రావు.



"మంత్రశాస్త్ర ప్రవీణ" "హనుమదుపాసక"

" ప్రశాంతి విద్వత్ మహాసభ కేంద్ర మండలి "

బ్రహ్మశ్రీ శిష్ట్లా ఉమామహేశ్వర శాస్త్రి, పెదపాడు.(ప॥గో॥జిల్లా)

# పండిత ప్రశంసా

I

బ్రహ్మశ్రీ శిష్ట్లా చంద్రమౌళి శాస్త్రి గారు ఆంధ్ర, మైసూరు, కేరళ రాష్ట్రములయందుఁ బ్రసిద్ధిఁగాంచిన మంత్ర శాస్త్రవేత్తలు

వీరు ప్రస్తుతము సుందర హనుమద్వైభవ మను గ్రంథరాజమును భక్తుల కొఱకు రచించినారు

వీరి యీ గ్రంథ రచనయందు బహు సంహితాగత విషయములను వ్రాయుటయేగాక బహు వేదాంత విషయములను గూడ పాఠకులయు, భక్తులయు క్షేమమును వాంఛించి వ్రాసినారు. వీరిగ్రంథముసర్వభక్తజనోద్ధారకముగానుండు ననుటలో సందియములేదు.

శ్రీమద్రామాయణస్థ సుందరకాండమున కాపేరు వచ్చుట హనుమంతునకు సుందరుఁడన్న పేరు గలిగి యుండుటవలన నని తత్ర తత్ర పండితులు చెప్పుదురు. సంహితలోఁగూడ నమ్మవారితో నీశ్వరుడు హనుమంతునకు సుందరుఁడన్న పేరు కూడఁ గలదని చెప్పినట్లు కలదు

ఆ భాగ మీ గ్రంథమునం దుద్ధృతమై యున్నది

సుందరహనుమన్మంత్ర మని యొకటి కలదు ఆ మంత్రము గూడ ఈ గ్రంథమునందు గలదు.

బ్రహ్మ పదార్థము సత్యం శివం సుందరం అనిచెప్పఁబడు చున్నది

కనుక సుందర శబ్దము బ్రహ్మ పదార్థమునకుఁ బ్రతీకగా జెప్ప వచ్చును

అట్లుకూడా ఈ సుందరకాండము మహాతత్త్వ బోధకమని చెప్ప గును.

'అశోచ్యా నన్వశోచస్త్వం' అన్న మాటలు తొలుత చెప్పినది ఆంజనేయులు వాలి కొఱకు దుఃఖించు తారకు హనుమ యీ ఉపదేశమును జేసెను భగవంతుడు తన గీతలను దీనితోఁ బ్రారంభించెను. హనుమ పరమయోగి,

సాక్షాత్ బ్రహ్మ పదార్థము వంటివాడు అయనకు బ్రహ్మ పదార్థమునకు భేదములేదు ఈ విషయము పలుచోట్ల నిరూపింపబడి యున్నది.

శ్రీ శాస్త్రిగారు సుందర హనుమద్వైభవ మన్న పేరుతో నిట్టి గ్రంథమును వ్రాసి భక్తుల కందిచ్చుట యన్నది తెలుగువారు మఱువరాని మహోపకారము

ఈ గ్రంథమును జదివి భక్తులు తరింతురుగాక

ఆంధ్ర ఆస్థానకవి
విశ్వనాథ సత్యనారాయణ

II

మంత్రశాస్త్ర ప్రవీణులును, శ్రీ హనుమదుపాసకులును అయిన బ్రహ్మశ్రీ వేదమూర్తులు శ్రీ శిష్ట్లా చంద్రమౌళిశాస్త్రిగారిచే రచింపబడిన "శ్రీ సుందర హనుమద్వైభవము" అను గ్రంథరాజమును ఆవిష్కరించు మహాద్భాగ్యము భగవత్ప్రేరణచే నాకు కలిగింపబడినది అందు వలన నా జన్మధన్యత నొందినట్లు భావించుచున్నాను ఈ గ్రంథమున మాచితిని చాలా ముఖ్యములైన విషయములు శ్రుతిస్మృతి పురాణాంతర్గతములగు వానిని శ్రీ శాస్త్రిగారు వారు పాండిత్య ప్రకర్షవలన సులభమైన శైలిలో చదువరులకు అందచేసి యున్నారు

శ్రీ శాస్త్రిగారి జీవితము శ్రీ హనుదుపాసనకు, హనుమత్సేవకు అంకితము హనుమత్సాక్షాత్కారము వారియందు పూర్తిగా గలదు వారి వంశమందే ఈ ఉపాసన పారంపర్యముగా వచ్చుచున్నది అట్టి నిష్ఠాతులు వ్రాసిన గ్రంథరాజము ఉత్తమోత్తమమని వేరే చెప్పనక్కరలేదు.

హనుమంతునికి సుందరుడు అని పేరు ఎటులవచ్చినదో నిరూపించుటకు శ్రీ శాస్త్రిగారు అనేక విశిష్టమైన నిదర్శనములను చూపియున్నారు. సుందరకాండ విశిష్టతను అనేకచోట్ల సప్రమాణముగా వివరించిరి. ఒకచో వారు ఈ క్రింది విధముగా వ్రాసిరి.

"రామాయణసారము సుందరకాండము
భారతసారము భగవద్గీత కనుకనే
అవి రెండును మనకు నిత్యపారాయణ
యోగ్యములు అయినవి, భగవద్గీత
మోక్షసాధనముకాగా, సుందరకాండ
మైహికాముష్మిక సాధన మగుచున్నది"

శితికంఠ రావణ కథను వివరించునపుడు శ్రీ శాస్త్రిగారు హనుమంతుడు పరబ్రహ్మ స్వరూపుడని సప్రమాణముగా నిరూపించిరి సాక్షాత్ భగవాన్ శివుడే హనుమంతుడాయెను గదా!

సుందరకాండ మహా మంత్రమనియు, అట్టి మహామంత్రాను ష్టానక్రమమును, సుందరకాండ పారాయణ రీతిని, ఆంజనేయ పూజా దిక్రమమును, సప్తసర్గ పారాయణ విధియు, పంచముఖీ సప్తముఖీ హనుమత్ ప్రార్థనలను, సంతాన హనుమత్ మంత్రమును, అనేక చికిత్సా విధానములను, గ్రహదోష శాంతులను, శ్రీ సీతారామాంజనేయ అష్టోత్తర నామావళులను, ఆంజనేయ సహస్ర నామమును, శ్రీ రామోత్తర తాప నిషత్తులోని ముఖ్యాంశములను, వాల్మీకి రచిత సుందరకాండ మూలమును ఈ గ్రంథమునందు పొందుపరచిరి. శ్రీ హనుమదుపాసకులకు, సుందరకాండ పారాయణా పారిణులకు ఈ గ్రంథము హనుమత్ జలధి అయి అనేక ముఖ్యాంశములకు నిధి అయి వెలుగొందుచున్నది.

రామాయణ గాథ శతకోటి ప్రవిస్తరము. అందులోని ప్రతి అక్షరమును మహా పాతకనాశమని ఆర్యోక్తి. అట్టి పవిత్ర గ్రంథములోని భాగమే ఈ గ్రంథరాజము. శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథ రచనకు పూనుకొననిచో ఇట్టి మహదవకాశమును చదువరులు కోల్పోయెడివారు ఈ గ్రంథము అచ్చునకు
ప్రచురణకు దోహదకారులైన వారు ధన్యులు
పండిత పామరులను ఈ గ్రంథరాజము తృప్తిపరచుననుటలో

సందియములేదు. భక్తాగ్రేసరు లెల్లరు ఈ గ్రంథమును చదివి తరింతురు గాక!

ఇట్లు,
గొల్లపూడి వెంకటరామశాస్త్రి,
29-4-76
(రిటైర్డు జడ్జి, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు,
హైదరాబాదు)

III

I have gone through the book '**SUNDARA HANUMATH VAI BHAVAM**' written by Sri Sistla Chandramouli Sastry who is well known for his proficiency in Mantra Sastra. This book is bound to be welcomed by orthodox devotees of Sri Rama and Sita and Bhaktas of Hanuman. It Contains all that they would like to have in a compendious form the original verses of Sundarakanda, the parayana vidhi, the pooja vidhanam, stories of Sri Anjaneya, Ashtottarams etc. I hope this book will read and made use of by a large number of Asthikas and will serve to spread the gospel of Ramayana and the incomparable devotion of Sri Anjaneya, throughout the length and breadth of Andhra Pradesh.

*Alladi Kuppuswami*
20-4-1976
JUDGE HIGH COURT OF
ANDHRA PRADESH
HYDERABAD

ఓమ్

శ్రీ సీతారామాంజనేయాయ నమః

ఓమ్ శ్రీ సాయిరామ్

## తృతీయ ముద్రణ

"శ్రీ సుందరహనుమద్వైభవము" 1962 సంవత్సరంలో ప్రథమ ముద్రణ. 1976 సంవత్సరంలో ద్వితీయ ముద్రణ పొంది భక్తుల హృదయములలో ముద్రవేసి యున్నదనుటలో ఎట్టి అతిశయోక్తి లేదు. ఈ గ్రంథము సుందరకాండ పారాయణాపరులకు ప్రామాణిక గ్రంథమై అలరారుచున్నది ఆంధ్రదేశము నలుమూలలా వ్యాప్తి చెంది భక్తులకుపయుక్తముగా నున్నది. ఇటువంటి ఆధ్యాత్మిక గ్రంథము హనుమద్భక్తుల ఒత్తిడి, ప్రోత్సాహముతో యిప్పుడు తృతీయ ముద్రణ చేయవలసిన అవశ్యకత వచ్చినదంటే దానిలోని విశిష్టత చెప్పనవసరంలేదు. మా తాతగారైన కీ॥శే॥ బ్ర॥శ్రీ॥ శిష్ట్లా చంద్రమౌళి శాస్త్రిగారు సాక్షాత్తు హనుమ వ్వరూపులగుటచే వారు రచించిన ఈ సుందర హనుమద్వైభవము ఇంత బహుళ ప్రచారమయి, ఆస్తికులకుపయుక్తముగా నున్నది

ఈ గ్రంథము అచ్చు విషయములో నాకు అన్ని విధాలా సలహాలతో సహకరించిన మిత్రులు, శ్రేయోభిలాషులు అందరూ అభినందనీయులు. ముఖ్యముగా నా బాల్య స్నేహితుడు శ్రీ గూడపాటి రామమోహనరావు మరియు నా ప్రాణ స్నేహితుడు శ్రీ కాకరాల రాజేంద్రవరప్రసాదరావు గారు అభినందనీయులు. ఈ గ్రంథమును సకాలము లో చక్కగా సర్వాంగ సుందరముగా అచ్చు వేయించి ఇచ్చిన శ్రీ ప్రసన్న ఆర్ట్ ప్రింటర్స్, ఏలూరు వారు ఎంతయో అభినందనీయులు.

ఈ గ్రంథములో ఏమైనా తప్పులున్నచో పెద్దలు, మహనీయులు నన్ను ఆశీర్వదించి తెలియచేసినచో తరువాత ముద్రణలో సరిచేసి అంద చేయగలను.

ఇట్లు
గ్రంథప్రకాశకులు

పెదపాడు,
13-10-1993

జైసాయిరామ్

శిష్ట్లా హనుమత్ శాస్త్రి

# శ్రీ హనుమద్గ్రంథరత్నమాల

బ్రా॥ శ్రీ శిష్టా చంద్రమౌళి శాస్త్రి గారిచే రచించబడిన
ఇతర గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ హనుమన్మంత్రానుష్ఠాన ప్రకాశిక | 25–00 రు. |
| 2. | శ్రీ హనుమద్వ్రతజయంతీ ప్రదక్షిణ కల్పము | 25–00 రు. |
| 3. | శ్రీ హనుమద్విలాసము | 25–00 రు. |
| 4. | శ్రీ హనుమత్ప్రతిష్ఠాకల్పము | 25–00 రు. |

గ్రంథములు లభించు ప్రదేశము

బ్రా॥ శ్రీ శిష్టా హనుమత్ శాస్త్రి
పెదపాడు (పోస్టు)
పశ్చిమగోదావరి జిల్లా (ఆం.ప్ర.) 534 437
✆ (85)507

# విషయసూచిక

## ప్రథమాధ్యాయము



## ద్వితీయాధ్యాయము



## తృతీయాధ్యాయము

## చతుర్థాధ్యాయము



## పంచమాధ్యాయము

గమనిక :

111 పుటలో రామాష్టోత్తర శతనామపూజయైన తరువాత 180 పుటలో చెప్పబడిన సీతాదేవి అంగపూజయు, సీతాష్టోత్తరశతనామ పూజయు అనుసంధానముచేసి తరువాత ధూపదీపాదులనుజేసి పూజా పరిసమాప్తి చేయవలయును.

## ఉపాసనా ప్రాశస్త్యము

శ్లో॥ అమల కనకవర్ణం ప్రజ్వలత్పావకాక్షం
సరసిజ నిభవక్త్రం సర్వదా సుప్రసన్నం
పటుతర ఘనగాత్రం కుండలాలంకృతాంగం
రణజయ కరవాలం రామదూతం నమామి.

ఉపాసనం నామ యథాశాస్త్ర ముపాస్య అస్యార్థస్య విషయీకరణేన సామీప్య ముపాగమ్య తైలధారావత్ సమాన ప్రత్యయ ప్రవాహేణ దీర్ఘకాలం యదాసనం తదుపాసన మాచక్షతే-

ఆ వృత్తి రసకృ దుపదేశాత్ - బ్ర సూ.

శ్లో॥ ఉపాసనా ఫలా న్ముక్తి భోగాన్ కర్మఫలాన్ సదా
భుంక్తే విష్ణోః సమీపస్థః సర్వదోష వివర్జితః

తా॥ ఉపాసనా వల్ల భక్తుడు ముక్తుడగును ఐహికములైన భోగములను సత్కర్మఫలముల ననుభవించును పాపము లన్నియు నడగి పోవుటచే విష్ణువునకు సామీప్య భావము నొంది సామీప్యసిద్ధి బొందును

శ్లో॥ యోగ్యోపాసనాం వినా నైవ ముక్తిః కస్యాపి సేత్స్యతి
అయోగ్యోపాసనా కర్తు రనర్థశ్చ భవిష్యతి.

తా॥ యోగ్యమైన ఉపాసన, అనగా సత్త్వ గుణ ప్రధానమైన యుపాసన లేనిచో ఎన్నటికిని ముక్తుడు గాడు అయోగ్యమైన, అనగా తామస గుణముతోగూడిన ఉపాసకునకు తప్పక అనర్థము (హాని) కలుగును

శ్లో॥ తస్మాద్యోగ్యతాం జ్ఞాత్వా హరేః కార్య ముపాసనమ్
కర్మణామనసా వాచా సర్వావస్థాసు సర్వదా.

తా॥ అందువల్ల యోగ్యతను బట్టి, దాని మంచి చెడ్డలను దెలిసికొని శ్రీ హరి యొక్క ఉపాసనము సర్వకాల సర్వావస్థల యందును త్రికరణశుద్ధిగా చేయవలెను

శ్లో॥ భక్తిరూపాపన్నమే వోపాసనం సంరాధనమ్
దేవో భూత్వా యజేత్ దేవం-

తా॥ భక్తి రూపము పొందిన ఉపాసనమే సంరాధన మనబడును తాను దేవుడై దేవుని ఉపాసింపవలెను నారుద్రో రుద్ర మర్చయేత్' అన్నట్లు

శ్లో॥ గవాం సర్పిః శరీరస్థం నకరో త్యంగపోషణం
నిస్సృతం కర్మ సంయుక్తం పున స్తాసాం తదౌషధం-

తా॥ ఆవుల నెయి శరీరమునకు పోషణ నియ్యదు కర్మవల్ల అనగా పాలనుండి పితికిన అమృతము మూడువిధములైన శరీరములకు ఔషధముగా పనిచేయును

శ్లో॥ ఏవం సహి శరీరస్థం సర్పివ త్పరమేశ్వరః
వినా చోపాసనా దేవ న కరోతి హితం నృషు.

తా॥ ఇట్లు శరీరము నందు పరమేశ్వరుడు ఆవు శరీరము నందు నేయివలె సూక్ష్మ శరీరుడై యుండును ఉపాసన లేనిదే ఆయన నరులకు హితము చేయలేడు

మహాశయులారా! సమస్త ప్రాణిజాలమును ఇహమునందును పరమునందును సుఖమునే యభిలషించును అట్టిసుఖమును విహితకర్మాన

ష్ఠానముచేతను నిషిద్ధకర్మ పరిత్యాగముచేతను సంభవించును. విహిత కర్మానుష్ఠాన మనునది కాయిక వాచిక మానసిక దోషరాహిత్యముగ అనుష్ఠింపబడిననే సఫలమగును సామాన్యముగ కాయిక మానసిక దోషములనబడు ఆధివ్యాధులచే పీడింపబడనివారరుదు అట్టి ఆధి వ్యాధులు విహితకర్మానుష్ఠానమునకు ప్రతిబంధకములు, గాన ఆధివ్యాధులు కలవారలు సత్కర్మానుష్ఠానాసమర్థులు గనుక తత్ఫలమగు ఐహికాముష్మిక సుఖములను పొందజాలరు ఆధివ్యాధులను తొలగించుకొనినచో సత్కర్మల నాచరించి తత్ఫలమగు సుఖమును బడయగలరు ఆధివ్యాధులన్ననో సామాన్యమైనవి కావు ఆధియన మనోవికారము అయ్యది భూతప్రేత పిశాచాది దుష్టగ్రహావేశమువలన గాని ఇష్టవస్తువు యొక్క అప్రాప్తి వలనగాని భ్రాంత్యాదులవలన గాని సంభవించును అట్టి చిత్తవికారమును ఉపాయాంతరములచే పోగొట్టుకొనుట దుర్లభము యోగాభ్యాసరూపమగు ఉపాయమున్నను అయ్యది సంప్రదాయ పరిభ్రష్ట మగుటచే సులభముగ ననుష్ఠించుటకు శక్యమైనదికాదు వ్యాధులన్ననో శరీరమునకు వికృతిని సంపాదించి తద్ద్వారా దుఃఖకరములు గాన కాయికము లనబడును అట్టి వ్యాధులు కుష్ఠాప స్మారాధులని తద్భేదములు చరక సంహితాది గ్రంథముల యందు విపులముగవర్ణింపబడినవి ఆ వ్యాధులు సామాన్యముగ నూటికి తొంబదివంతులు అసాధ్యము లనియే చరకసంహితయందు వర్ణింపబడినవి ఐనను తాత్కాలికోపశాంతి కొరకు చికిత్సలును చెప్పబడినవి అట్టిచికిత్సలు ఓషధీసంప్రదాయము ననుసరించియు రసాదిసంప్రదాయము ననుసరించియు ద్వివిధములుగ నున్నవి అందు ఓషధులు హిమవద్వింధ్యాది మహా పర్వత ప్రాంతములయందు ఉత్పన్నము లైనవియే వ్యాధి నివారకములనియు, ఆ యోషధులను సంప్రదాయానుసారముగ గుర్తించి కాలవిశేషము నందు సంగ్రహించవలసిన దనియు వర్ణించబడినది

ఎల్లనిన మూలికోద్ధరణ మిట్లు చెప్పబడి యున్నది పూర్వోక్త శుభవిధౌ, భానువాసరయుక్త అమావాస్యా పుణ్యదివసే - పుష్యమీ నక్షత్రయుక్త భానువాసర పుణ్యా దివసే, ఇత్యాది పర్వకాల ముచ్చరేత్, సర్వ కార్యసిద్ధ్యర్థం మూలికా గ్రహణం, కరిష్యే ఇతి సంకల్ప్య॥

**విధి మంత్ర సమాయుక్తం, ఔషధం సఫలంభవేత్,**

**విధిమంత్ర విహీనంతు, కాష్ఠవద్భేషజం భవేత్॥**

రహస్య స్థలమందును మంచి అరణ్యమందును ఉన్న మూలికలు ప్రశస్తమయినవి మరియు పైన వ్రాయబడిన ప్రకారము మంత్ర విధానముతో తేబడినవియు ప్రశస్తములు॥

పుట్ట, భావి, మార్గం, చెట్టుమీదను దేవాలయంమీదను స్మశానమందును, మంత్ర పూరితముగా తీయనివి ప్రశస్తములుకావు పర్వము రేపు అనగా, మూలికను చూచుకొని, శుచితో వుండి భగవంతుని ప్రార్థించి, ఇష్టదైవమును ప్రార్థించి మూలికకు యినుము తగలకుండా, జాగ్రత్తగా త్రవ్వి వ్రేళ్ళకు భూమిపట్టు కొంచెము వుండేలాగున చూచుకుని: ఆ త్రవ్వినదానినిండా వుదకమువుంచి, మూలికకు సాంబ్రాణి పొగవేసి, విధిప్రకారం, ఓ ఓషధీ! నిన్ను నేను గ్రహించినానని చెప్పి పసుపు పూసిన దారం, ఆవృక్షముకు కట్టవలెను ఉదయముపూట ముందుగా భూత ప్రేతాదులు చేరకుండా దిగ్బంధన మొనరించి వృక్షమూలము దగ్గరకు వెళ్ళి "ఓం నమో భేతాళాశ్చ పిశాశాశ్చరాక్షశాశ్చ సరీసృపా॥ అప సర్పంతు తే సర్వే వృక్షా దస్మా చ్ఛివాజ్ఞ యా॥ యీ మంత్రంవల్ల అభి మంత్రించి యీ క్రింది శ్లోకముచే నమస్కారము చేయవలమును

నమస్తేమృత సంభూతే బల వీర్యవివర్ధనీ బల మాయుశ్చ మే దేహి, పాపా న్మేత్రాహి దూరతః॥ యీ ప్రకారం నమస్కారం చేసి,

చంద్రకోయ్యలో చేసిన మేకుపల్లి, యీాదిగువ మంత్రం పఠించుచు.త్రవ్వవలెను యేనత్వాం ఖనతే బ్రహ్మ యేన త్వాం ఖనతే భృగుః యేన ఇంద్రోథవరుణో యే నత్వాసముపచక్రమే తేనాహం ఖనయిష్యామి। మంత్రపూతేన పాణినా మాతే, పాతే మానిపాతే। మాతేతేభ్యోన్యధాభవత్। అత్రైవ తిష్ఠ కల్యాణి మమకార్యకరీ భవ॥ యీ ప్రకారం పఠింపుచు సాధ్యమైనంతవరకు ప్రేళ్ళు తెగకుండా తీయవలయును-

ఓం హ్రీం హ్రూం ఫట్ స్వాహా॥ యీ మంత్రం పఠించుచూ తీయవలయును

పరీక్షలుమన్నవో మనకు అట్టి ఓషధులే దొరుకుటలేదు "కాకోల్యాదిగణము, జీవంతికాదిగణము సోమలత,జ్యోతిష్మలత,రుదంతీలత" మొదలగు ఓషధీరాజములు మహాపర్వత ప్రాంతములయందును దృష్టిగోచరములగుటలేదు యధాసంభవమగు స్వల్పౌషధులైనను దేశకాలనియమము లేక సంగ్రహించబడిన వగుటవలన నిస్సారములుగనున్నవి రససంప్రదాయ మన్నవో రసవిషగంధకములు అష్టాదశసంస్కారములచే సంస్కరింపబడిననే గాని నిర్దుష్టములై ఫలజనకములు కానేరవు అట్లుగాక పోవుటయే గాక అపరిశుద్ధత వలన నితర వికారములను కూడా కలిగించుచున్నవి కనుక ఆధివ్యాధులకు చెప్పబడిన ఉపాయములచే ఆత్యంతిక నివృత్తి దుర్లభము, అట్టి ఆధివ్యాధులను సుకరముగ అత్యంతము నశింప జేయుటకు సాధనమును అన్వేషించుటకు యత్నము చేయవలసి యున్నది ఈనాచే ఉపదేశించబడు సాధనము ప్రతి గ్రామమునందును ప్రతి మఠమునందును ఆబాలగోపాలమునకు విదితము అట్టి సాధనమేమనగా! శ్రీ హనుమత్

మంత్రానుష్ఠాన, ప్రదక్షిణపూజానమస్కారములు మొదలగునవి సామాన్యముగా ఆస్తిక దేశమగు మన భరత ఖండమందు ఆంజనేయాలయము రామాలయములేని గ్రామమేలేదు. ప్రతి గ్రామమునందును చిన్నదియో పెద్దదియో ఆలయమును నిర్మించి యందు శిలావిగ్రహమును గాని పటమును గాని ప్రతిష్ఠించి భక్తిపూర్వకముగా ఆచండాలాంతము ఐకమత్యముతో ఆస్తిక బుద్ధితో శ్రేయస్సు నభిలషించి సేవించుచున్నారు ఆంజనేయ విగ్రహము గాని పటముగాని ఆంజనేయ స్మరణగాని లేని ప్రతి గ్రామమునందును శ్రీ రామాజ్ఞచే రాక్షసులు భూత ప్రేతపిశాచాద్యావేశ రూపములుగా మానవులను భక్షించుచుందురనియు, శ్రీ ఆంజనేయ పూజాదులచే గాని స్మరణమాత్రముచే గాని భక్తితో ఆంజనేయు నుపాసించువారలకు అట్టిబాధలు తొలగి పోవుననియు అనేక ప్రమాణములు కలవు వానిలోకొన్నిటి నుదాహరించుచున్నాను శిలసంహిత యందు ఈ క్రింది విధముగ చెప్ప బడియున్నది:-

శ్లో॥ మమ పార్శ్వ గతా వీరా రాక్షసాః పిశితాశనాః ।
యాచంతే జానకీనాథం నరభోజనమేవ చ ॥
ఇతి శ్రుత్వా రామచంద్రః అబ్రవీజ్జానకీ పతిః ।
ఆంజనేయం వినా యత్ర తత్ర భక్షంతు మానవాన్ ॥

తా॥ మాంసభక్షణ యందు ఆసక్తి గల రాక్షసులు, తమకు నర భోజనము కావలెనని శ్రీ రామచంద్రుని కోరగా ఆ సమయమునందు రామచంద్రమూర్తి ఆ రాక్షసులను జూచి ఆంజనేయ విగ్రహము గాని తత్స్మరణము గాని యే గ్రామము నందు గాని యే గృహము నందు కాని లేదో అచ్చటి మనుష్యలను భక్షింపుమని ఆజ్ఞయిచ్చెను ఇట్లు ఆజ్ఞ యిచ్చి తక్షణమే హనుమంతునితో ఇట్లు పలికెను

శ్లో॥ గచ్ఛ శీఘ్రం మహాభాగ కురు రక్షోవిదారణం।
రక్ష విశ్వం కపిశ్రేష్ఠ రక్షోగణవిదారణ ॥

తా॥ ఓ ఆంజనేయా! నీవు శీఘ్రముగా గ్రామముల యందు నివసించి రాక్షసులను నశింపజేయుము. నేను రాక్షసులకు పూర్వోక్తప్రకారముగా వరము నిచ్చియుంటిని నీవు లేనిచో రాక్షసులు మనుష్యులను బాధింతురు గనుక విశ్వమును రక్షింపుము అనిన-

శ్లో॥ ఇత్యేతద్వచనం శ్రుత్వా రామదూత స్సుబుద్ధి మాన్।
తదారభ్య దివారాత్రం రక్షన్ సర్వం చ రాష్ట్రకమ్ ॥

తా॥ ఈప్రకారముగా పలికిన రామచంద్రుని యొక్క వాక్యములను విని సర్వభూత దయాపరుడగు హనుమంతుడు అప్పటినుండియు దివారాత్రములయందు తన ధ్యానాదికము చేయు భక్తులను సంరక్షించుచు సర్వరాష్ట్రముల యందు నిండియుండెను ఇట్లు అనేకములగు ప్రమాణములు తాళపత్రాదులయందును సుదర్శన సంహిత, శౌనక సంహిత, హనుమచ్చాబర చింతామణి యను గ్రంథములయందు ననేకము లున్నను గ్రంథవిస్తర భీతిచే సంగ్రహముగా నుదాహరించిరి సామాన్యముగా పూజావిధాన మని సమిష్టి రూపముగ చెప్పబడు పూజావిధానము సాంగోపాంగముగా కల్పోక్త ప్రకారముగా నాచరించబడిన యెడల ఆధివ్యాధిరూపము లగు సమస్త దుఃఖములు నివర్తించును చిత్తస్వాస్థ్యము కలుగును స్వస్థచిత్తులై సత్కార్మానుష్ఠానముచే ఐహి కాముష్మిక సుఖములను బడయగలరు. ఇందుకు 'హనుమచ్చాబర చింతామణి' యను తాళపత్రగ్రంథమునందుగల ప్రమాణవచనముల నుదాహరించు చున్నాను

శ్లో॥ ఆంజనేయమను శ్లోకే శంకరేణ ప్రకాశితః।
భూత ప్రేత పిశాచాద్యా శ్శాకినీ బ్రహ్మరాక్షసాః ॥
దృష్ట్వైవ ప్రపలాయంతే మంత్రానుష్ఠానతత్పరమ్ ॥

తా॥ ఆంజనేయ మంత్రము శంకరునిచే ప్రకాశింపచేయ బడినది అట్టి మంత్రము నుపాసించువానిని చూచుటతోడనే భూతప్రేతపిశాచాదు పారిపోవును

శ్రీ హనుమత్పూజఫలననే, సకలవ్యాధులు సర్వదుష్టగ్రహముల బాధలు,నివర్తించు నసుటకు, ఆనంద రామాయణములో మనోహర కాండయందుఁ గల కథను వ్రాయు చున్నాను

శ్లో॥ యదా రామ స్త్రికూటాద్రౌ । నాగపాశైస్తు పీడితః ।
నారదస్య వచః శ్రుత్వా, సస్మార వినతాసుతం ।
తదాసౌ కాశ్యపీవీర స్సమాగత్య రణాంగణే ।
ప్రణామ మకరో త్తస్మై రామాయామితతేజసే ।
నివార్య పన్నగాస్త్రం, తన్మేఘనాద నమీరితం ।
తుష్టావ రఘువీరం తం స సైన్యంచ సలక్ష్మణం ।
ఉవాచ. ప్రణిపత్యాథ రామభద్రం, ఖగేశ్వరః ।

గరుడ ఉవాచ :

ఆశ్చర్య మిద మత్యంతం । యద్భవానస్మరద్ధిమాం ।
సతివీరే మహారుద్రే । సగణే శ్రీ హనూమతి ।
సుగ్రీవే సతి నీలేచ । సుషేణే జాంబవత్యపి ।
అంగదే దధివక్త్రేచ । తారేచ తరళే తథా ।
మైందే సతి మహావీర్యే । కిమత్రాస్తి ప్రయోజనం—

శ్రీ రామ ఉవాచ :

భవద్భీతి ముపాగమ్య । విద్రుతాశ్చ భుజంగమాః
ఏతేషు సత్సు వీర్యేషు । కిము సైన్య మపీడయన్ ।.

గరుడ ఉవాచ ః

రామదేవ మహామాబాహో । కపీనాం చరితం శృణు ।
ఆత్మనోఽపి సమాదిష్టా న్మాకురుష్వాత్ర గహనం ।
సాక్షాత్త్వం భగవాన్ విష్ణు లక్ష్మీస్తుజనకాత్మజా ।
సౌమిత్రిః ఫణిరాజో ఽ యంరుద్రాశ్చకపయః స్మృతాః ।
సుగ్రీవో వీరభద్రోఽయం శంభురేష స్మృతో నలః ।
విద్ధి దాశరథే నూనం గిరిశో నీల ఏవచ ।
మహాయశా స్సుషేణోఽయం జాంబవాం శ్చాప్యజై కపిః ।
అహిర్బుధ్న్యస్త్వంగ దోఽత్ర దధివక్త్రః పినాకధృత్ ।
శ్లో అయుతా జిష్ణ్వయంతారః స్థాణుశ్చ తరళో మతః ।
మైందో భర్గ స్తనుస్సాక్షాత్ హనుమాన్ భగవాన్ స్మృతః ।
అవతీర్ణా మహా రుద్రాస్త్వం దధానం రఘునందన ।
అవసన్ సర్వ దేశేషు నానాపర్వత మధ్యతః ।
ధృత్వాచ కపి రూపాణి అవతేరు ర్మహీతలే ।
సర్వే ఽకపితాంప్రాప్తా కారణం తద్బ్రవీమి తే ॥
పురా దేవా స్సురై స్సింధో ర్మథితా ద్వ్యాధయోఽ భవన్ ।
నానాపీడాకరా స్సర్వా లూతా విస్ఫోటకాదయః ।
తైరేవ వ్యాధిభి స్సర్వం పీడితం జగతీతలం ।
ఋషయోఽపి నృపాలాశ్చ బ్రహ్మాణం శరణం యయుః ।
ఊచుశ్చ జగతాం నాథం బ్రహ్మాణం కమలోద్భవం ।
త్రాహిత్రాహి జగన్నాథ వ్యాధిభ్యో జగతీ మిమాం ।
పీడితాం దారుణైర్ఘోరై ర్వైద్యై రద్యైశ్చ విశేషతః ।
త్రిదోషైర్ జ్వరభూతాం విభ్రమైర్వ్యా కులీకృతాం ।
ఔషధాని నసిద్ధ్యంతి మంత్ర యంత్రాణిచైవహి ।

పీడయంతి మహారోగా మానవాన్నాశకారిణః ।
ఏతత్తే కథితం సర్వం బ్రహ్మన్ త్వత్పురత స్సృధీః ।
తత్తేషాం వచనం శ్రుత్వా రుదన్ సంప్రార్థయ ద్విధిః ॥
తేపి శ్రుత్వా బ్రహ్మ వాక్యం రుద్రా ఏకాదశామలాః ।
సమాశ్వాస విరంచింతే వీరభద్రాదయ స్సురాః ।
సంభూయ వానరేష్వేవ సుగ్రీవ ప్రముఖా ఇమే ।
పర్యటన్ పర్వతాగ్రాణి మండలానిచ సర్వశః ।
నాదయంతో జగత్సర్వం బభుక్కార్త్రైః సుదారుణైః ।
క్ష్వేడితైః క్రీడనైస్తేషాం వ్యాధయో నాశ మాప్నుయుః ॥
తతస్తు సకలాం దృష్ట్వా వానరై ర్వేష్టితాం భువం ।
తుతోష భగవాన్ బ్రహ్మ దదౌ తేభ్యో వరాన్ బహూన్ ॥

బ్రహ్మోవాచ

శ్లో॥ యుష్మాస్వపిచ ముద్రాస్తు మృత సంజీవినీకిలా ।
ఆజ్ఞాస్తు సర్వజగతి వేగోఽ స్తు మనసస్సమః ॥
యుష్మాన్ స్మరంతి యేమర్త్యాః పూజయంతి భవత్తనూః ।
పతాకా వివిధాః కృత్వా చిత్రతోరణ సంయుతాః ॥
భక్ష్య భోజ్యాని ఖాద్యాని లేహ్యం పేయంచ సర్వశః ।
యుష్మా నుద్దిశ్య యేమర్త్యాః జుహ్వంతిహి హుతాశనే ॥
హవిః పుణ్యతమం రుద్రాస్తేషాం సిద్ధిర్న సంశయః ।
పాయసేనైవ సాజ్యేన తథైవ తిల సర్పిషా ॥
యజంతి భవతాం వృందం తే యాంతి పరమంపదం ।
ఏవంవై రుద్రమఖిలం గాథా వైశ్వానరీ స్తథా ॥
మానస్తో కేతివా మంత్రో మనోజ్యోతి రథాపివా ।
భవతాం యజనం చాత్ర గాయత్ర్యా వా ప్రకీర్తితం ॥

ఏవం యే మానవాలోకే విధానం పరికుర్వతే ।
వ్యాధిం ముక్త్వా సుఖాసీనా స్త్వంతే యాం త్యక్షయంపదం ॥

గరుడ ఉవాచ ః

శ్లో॥ ఇతిరామ పరావృత్తం కపీనాం కథితం మయా ।
ఏషు రుద్రేషు సర్వేషు హనుమాన్ భద్రనాయకః ॥
విధానం తత్రకర్తవ్యం యత్రాస్తే హనుమత్తనుః ।
గోపురే హనుమన్మూర్తి శ్శిలాయాంచ ప్రతిష్ఠితా ॥
తత్ర సర్వం ప్రకర్తవ్యం విధానం పరసత్తమ ॥

తాత్పర్యము- శ్రీరాముడు త్రికూటాచలంబున నాగపాశముచే పీడింపఁబడుచున్నప్పుడు నారదముని యేతెంచి చెప్పినట్లు గరుడుని స్మరించెను అంతనావైనతేయుడు రణాంగమునకువచ్చి శ్రీరామమూర్తిని వందించి మేఘనాధుని పన్నగాస్త్రము నుపసంహరించి యక్కాలమున సకలసేనలతోడ లక్ష్మణసమేతుడైన శ్రీరామునికినమస్కరించి"స్వామీ' ఇక్కడ ప్రమథగణముతోడ శ్రీ రుద్రుడగు హనుమంతుడు సుగ్రీవ నల నీల సుషేణ జాంబవదంగద దధివక్త్ర తారతరల మైందులుండగా నీవు నన్ను స్మరించితివి గదా? ఇది మిక్కిలి ఆశ్చర్యముగా నున్నది నావలన ఏమి ప్రయోజనమి స్చట గలదు? " అని అడిగెను అందుకు శ్రీరాముడు నీవలన భీతి నొందిగదా పాములు పరుగిడినవి? మహావీరులందరుండినను అవి సైన్యమును పీడించినవి గదా? "అని పలుకగా, నంత నా గరుడుడు- మహాత్ముడగు శ్రీరామమూర్తీ' కపులయొక్క చరిత్రమును వినుము; పరమాత్మ వలనను సమాపిమ్పలగు వీరిని నీవు నిందించవలదు సాక్షాద్భగవంతుడగు శ్రీమన్నారాయణుండవు నీవు, లక్ష్మియే సీత ఈ లక్ష్మణుఁడు ఆదిశేషుడు, రుద్రులందరును కపులై యున్నారు, ఎట్లనిన, ఈ సుగ్రీవుడే వీరభద్రుడుగ, ఈ నలుడు శంభుడుని,ఈ నీలుఁడు

గిరీశుండు౩, ఈ సుషేణుడు మహాయశుఁడు ౪, జాంబవంతుడు అజైక పాద్దేవత ౫, అంగదుడు ఇచ్చట పహిర్బుధ్న్యుఁడు ౬, దధివక్త్రుండు పినాకధారి ౭, తారుఁడయుతాజిత్తు ౮, తరలుడు స్థాణుడు, ౯ మైందుడు భర్గుండు ౧౦, శ్రీ హనుమంతుడే సాక్షాద్రుద్రావతారుఁడు ౧౧ ఇట్లు ఏకాదశ మహారుద్రులు శ్రీ రామా! నీ కొరకై యవతరించిరి వివిధ పర్వతంబుల నడుమ దేశంబుల యందంతట వీరు వసించిరి వీరు కపులగుటకు కారణం బేమనిన, మునుపు దేవతలు సముద్రమును మధించినపుడు లూతావిస్ఫోటకాదులు బహుపీడాకరంబులగు రోగంబులు గల్గినవి వాటిచే లోకంబు పీడింపబడె ఋషులును, రాజులును బ్రహ్మను శరణుజొచ్చిరి "జగంబంతయు త్రిదోష సంకలితంబులగు మహాజ్వరాది వ్యాధులచే విభ్రాంతి నందె మంత్ర యంత్రౌషధంబులు నిష్ఫలదాయకంబులైనవి, "రక్షింపుము, రక్షింపుము," అను వీరి మొరనాలకించి నీ యెదుట బ్రహ్మదేవుండు రుద్రులను సంప్రార్థించెను ఏకాదశ రుద్రులును బ్రహ్మవాక్యమును విని వెంటనే వీరభద్రాదులగు తాము సుగ్రీవాది కపులుగా దేవగణంబులతోడ నవతరించి, అంతట పర్వతాగ్రంబులలో చరించుచు గర్జించుచు క్రీడించుచు వచ్చిరి అంత నా వ్యాధులుపశాంతంబులయ్యె అంత వానరవేష్టితంబగు భూమండలమును చూచి సంతోషించిన బ్రహ్మదేవుండు వారి కిట్లు వరంబులనొసగె "మీ యందు మృత సంజీవినీ కల ముద్రగా నుండుత మీ యాజ్ఞ సర్వ జగంబున గల్గునుగాక మీ వేగంబు మనోవేగముగునుగాక వరులెవ్వరు చిత్రతోరణ పతాకలతోడ మీ రూపంబులను పూజించి మిమ్ము నుద్దేశించి యగ్నిలో హోమము చేయుదురో, వారికి రుద్రులు ప్రసన్నులై సిద్ధిప్రదులగు చుందురు గాక తిలహోయసాజ్యంబులచే యజించినవారు పరమపదము నందెదరు ఇట్లేగదా మహారుద్రంబును, అట్టే వైశ్వానరీ

గాథయును, మానస్తోకే, మనోజ్యోతి ర్గాయత్రీ మంత్రంబులలో దేని చేతనై నను యజనము జేయదగు ఇట్లు యజించిన నరులు మహా వ్యాధి విముక్తి నంది యంతమున నక్షయ పద మందెదరు" అని బ్రహ్మ వరము కలదు కావున శ్రీరామా! ఆ రుద్రమూర్తులలో నందరిలో హనుమంతుడు భద్రనాయకుండు, ఇవ్విధానంబున హనుమన్మూర్తి గల చోట చేయందగు గోపురములయందు హనుమన్మూర్తి యున్న వచ్చట వీ క్రమము ననుసరింపనగునని గరుడుడు శ్రీరాములువారితో విన్నవించెను

శ్లో॥ భూతిం జలం మూలికాం చ హనుమన్మనునా ప్రియే।
మంత్రయిత్వాతు దాతవ్యం రోగశాంత్యర్థమేవ చ॥

తా॥ ఆంజనేయమంత్రముచే నభిమంత్రించిన విభూతిగాని ఉదకముగాని,ఔషధముగాని సేవించినయెడల తక్షణమేసమస్తవ్యాధులు తొలగిపోవును

శ్లో॥ వజ్రివల్లీం సమాదాయ విదధ్యా ద్వైష్ణవీదినే।
విసృజ్య గ్రంధిదేశం తు సూక్ష్మం చూర్ణం తు లేపయత్॥
బిడాలపదమాత్రం తు మంత్రితం శతశః ప్రియే।
శర్కరాఘృత సంయుక్తం భక్షయేచ్చ ద్విపంచ కమ్॥
అశీతివాతా నశ్యంతి యే యే దారుణసంభవాః।
మాసద్వయేన ముచ్యంతే నాత్ర కార్యా విచారణా॥

తా॥ వజ్రివల్లిని (నల్లేరును) విష్ణుప్రియమగుద్వాదశియందు సంగ్రహించి కణువులను విడచి మిగిలినభాగమును చూర్ణించి హనుమన్మంత్రముచే నూరుపర్యాములు అభిమంత్రించి కొద్దిచూర్ణమును

శరీరమునకు లేపనముజేసి మిగతచూర్ణములో మూడువేళ్లకు వచ్చిన చూర్ణమును పంచదార ఆవునేతులతో కలిపి పదిభాగములు చేసి రోజుకొక్కటి సేవించుపద్ధతిని రెండుమాసములు సేవించినయెడల అతిదారుణములగు అశీతివాతములు నివారించును ఈ ఔషధమును సేవించునపుడు ఆంజనేయుని సభక్తికముగ హృదయము నందు నిలిపి నిత్యము ఆంజనేయ మంత్రము గాని కవచముగాని మాలామంత్రముగాని మొదలైనవి పఠనచేయుచుండిన యెడల నిస్సంశయముగ ఫలము కలుగును ఇట్టి చికిత్సలే ప్రతివ్యాధికిని హనుమన్మంత్ర సంపుటిచే చెప్పబడియున్నవి ఇందు ఇట్టి పరమహంసక్రియలను వెల్లడిచేయుట అశాస్త్రీయము గనుక ఉదాహరణముగ కొన్నిటిని నిరూపించియున్నాను

ఆంజనేయమంత్రోపాసన యనునది ఉత్తమాధికారులకు తన్మంత్ర జపము హోమము తర్పణము మార్జనము ద్విజభోజనము అని కల్పముల యందు చెప్పబడియున్నది శౌనకానంహితయందు - శ్లో॥ జపోహోమస్తర్పణం చ మార్జనం ద్విభోజనం' పంచాగోపాసనం ప్రోక్తం ప్రవదంతి మనీషిభిః ॥ మధ్యమాధికారులకు విగ్రహపూజా ప్రదక్షిణ నమస్కారములు అశక్తులగు మందాధికారులకు తద్దేవతాదర్శన తన్నామస్మరణములు ఇట్లు నియమముగ సభక్తికముగ ఆంజనేయదేవు నుపాసించుటచే ఆది వ్యాధులు నశించుటయే గాక సమస్తాభీష్టకార్యసిద్ధులు కలుగును ఇందుకు పరాశరసంహిత యందు గల ప్రమాణవచనము వ్రాయుచుంటిని "శ్లో॥ యద్య ద్విషతమం లోకే తత్తత్సిద్ధి ర్న సంశయః॥" ఇట్టి భక్తకల్పతరువగు ఆంజనేయదేవుని మంత్రా నుష్ఠానము మొదలైనవాని యందు దైవగురుభక్తి కలిగిన బ్రాహ్మ క్షత్రియ వైశ్యశూద్రులగు చాతుర్వర్ణ్య స్త్రీపురుషులకు బాలవృద్ధులకు అజ్ఞవిజ్ఞులకు తత్తద్వర్ణవిహిత రీతిని అర్చనాదికమును గాని కాలశుద్ధినిగాని విచారింపకయే శ్రేయోభిలాషులగు వారు తన్మంత్రానుష్ఠానమునుగాని తద్విగ్రహ

పూజనమునుగాని ప్రదక్షిణములనుగాని తద్ధ్యానమునుగాని, చేయుటకుఅర్హతకలిగియున్నారు ఇందుకు ప్రమాణవచనములుగలవు గాలుడను కిరాతుడు కుష్టువ్యాధిచే పీడింపబడి పుష్కరుడను మహర్షి నాశ్రయింపగా నామహర్షి హనుమన్మంత్రమును కిరాతునకు ఉపదేశించు విషయంలో సందేహము కలవాడై తదిష్టదైవమగు ఆంజనేయమూర్తి వలన తనకుగల సందియము బాపుకొనదలచి హనుమంతుని ధ్యానించి ప్రత్యక్షము చేసికొని తనకు గలిగిన సందేహమును బాపుకొని· ఆంజనేయాజ్ఞచే తన్మంత్రమును కిరాతున కుపదేశించి అతని కుష్ఠ వ్యాధిని నశింపజేసెను ఈ అర్థమును ప్రతిపాదించు హనుమదాజ్ఞా వాక్యముల నుదహరించుచున్నాను॥ శ్లో॥గాలో'యమ్న్యగయుర్నీచః కథం మంత్రస్య తే ప్రభో॥యోగ్యోయమితిసందేహాబాధతేమా మహర్నిశమ్॥ హనుమద్వాక్యము:- శ్లో॥ కపీంద్ర స్తు మువాచాథ మాకురుష్వేత్ర సంశయమ్। మన్మంత్రజాల విషయే మద్భక్తామయ్యపిద్విజ॥ ఉపదేశగురౌ చాపి భక్తి రేవాత్ర కారణమ్ శూద్రోవావిప్రకీర్ణో వా వై శ్యో వా క్షత్రియో ఽపివా మన్మంత్రవిషయే సర్వే పాత్రాణ్యేవనసంశయః॥

ఈ ప్రకారము పరాశరసంహితయందుచెప్పబడియున్నది కనుక హనుమన్మంత్రము నుపాసించుటకుసర్వులు అర్హతకలవారై యున్నారు ఈ హనుమదుపాసనచే అగస్త్యులు పరాశరులు మైత్రేయులు భీముడు అర్జునుడు గాలుడు పుష్కరుడు ధ్వజదత్తుడు సోమదత్తుడు యవనాశ్వుడు విశ్వామిత్రుడు భరతుడు దేవేంద్రుడు హరిశర్మ యను విప్రపుంగవుడు సీతాదేవి ద్రౌపది మొదలుగా గలవారలు వారివారి అభీష్టములను పొందిరి గావున సుందరకాండ యనునది ఒక హనుమన్మహా మంత్రముగాన, భక్తులెల్లరు గ్రంథము నందు నియమించిన విధమున పారాయణమొనర్చి శ్రీ హనుమత్కృపకు పాత్రులగుదురు గాక-

**శుభం భూయాత్**

## పాఠకులకు విజ్ఞప్తి

శ్లో॥ "సుఖార్థా సర్వభూతానాం మతా స్సర్వాః ప్రవృత్తయః
సుఖంచ న వినా ధర్మాత్తస్మా ద్ధర్మపరో భవ"

అను నార్ష వాక్యముచే జీవులందరు సుఖమునే గోరి చరించు చున్నారనియు, సుఖము ధర్మపరాయణులకు లభించుననియు, ధర్మము నాచరింపనివారికి సుఖము లభింపదనియు, తెలియుచున్నది ధర్మమనగా వేదాదులందు విధింపబడుకర్మోపాసనాదుల నాచరించుటచే జనించు పుణ్యావిశేషము కర్మమార్గము బహువ్యయ ప్రయాసాది సాధ్యమగుటంజేసి యుపాసనా మార్గమే పురుషార్థసాధనములలో ముఖ్యోపాయము అట్టి"ఉపాసన" శ్రుతి స్మృతులందు, చతుష్షష్టి తంత్ర గ్రంధములందు విపులముగా ప్రదర్శింపబడి యున్నవి ఉదాత్తానుదాత్త స్వరితాది స్వర విశేషములలో నిబద్ధమగు వైదిక మంత్రాదులలోదేవతోపాసన భ్రమ ప్రమాదాదులులేని యుత్తమాధికారికి గాని సాధ్యముకాదు తంత్రమార్గోక్త మగు మంత్రములలో నుపాసన యుత్తమాధికారులకు మధ్యాధమాధి కారులకు గూడ సాధ్యమై చాతుర్వర్ణ్యమునకు తారకమగు చున్నది

తన్నిమిత్తమై నాచే సమకూర్చబడిన శ్రీ సుందర హనుమద్వైభవ మందుగల విషయములు-

మా పూర్వులచే సంపాదదింపబడిన తాళపత్రాది గ్రంధముల యందును తదితర గ్రంధములయందును మా గురుకటాక్షము చేతను శ్రీ హనుమత్కటాక్షము చేతను శ్రీ రామాయణాంతర్గతమగు సుందర కాండము నే యే కార్యమున కేయే విధానములతో పారాయణము చేయు మార్గములు కలవో వాని ఫలములు, సంతియేగాక హనుమద్భక్త చరిత్రములు, అనేకస్తోత్రములు నీ గ్రంధమునందు చేర్చబడినవి గాన

శ్రీ హనుమద్భక్తులెల్లరు పారాయణ చేయు విధానములు చక్కగా గుర్తించి గురూపదేశముతో పారాయణ మొనరించ వలయును గురు లక్షణాదులు వివరించబడుచున్నవి

శ్లో॥ గు శబ్దస్త్వన్ధకార స్స్యాత్ రు శబ్దస్తన్నివర్తకః
అంధకార నిరాసత్వాద్గురు రిత్యభిధీయతే,

తా॥ "గు" యన నంధకారము "రు"యన దానిని బాఱఁద్రోలు వాడని యర్థము మరియు "గు" యన గుహ్యమగు (రహస్యము) ఆత్మతత్వము నావరించు నంధకారమును, "రు"యిద్రాది దేవతాస్వరూపుడై రోధనము (అరికట్టుట) చేయువాడని తంత్రసమ్మతమగు నర్థము గురువునకే దేశికుడనియు నామము

"దేవతారూపధారిత్వా చ్ఛిష్యాను గ్రహకారణాత్
కరుణామయమూర్తిత్వా ద్దేశికః కథితః ప్రియే"

"కులార్ణవే" "దే" దేవతారూపమును ధరించినవాడు "శి" శిష్యుల ననుగ్రహించువాడు, "క" కరుణామయమూర్తి యని యర్థము

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షా త్పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః

యను ధ్యాన శ్లోకము గురునకు సర్వదేవతా రూపత్వమును దెల్పుచున్నది

లిఖితపాఠనిషేధము

శ్లో॥ పుస్తకే లిఖితా న్మంత్రాన్, దృష్ట్వా యేషాం జపోభవేత్
బ్రహ్మహత్యాస మం తేషాం పాతకం పరికీర్తితమ్

తా॥ పుస్తకమందు వ్రాయబడిన, లేదా ముద్రింపఁబడిన మంత్రములఁజూచి జపించినవారికి బ్రహ్మహత్యా సమానపాతకము సంభవించును

## గురు వవసరము

శ్లో॥ గురుం వినాఽన్యశాస్త్రేఽస్మిన్నాధికారః కులేశ్వరి.

తా॥గురువును సంపాదింపకున్నవానికి తంత్రశాస్త్రమం దధికారము లేదు

## గురులక్షణము

శ్లో॥ సుందర స్సుముఖ స్స్వచ్ఛ స్సులభో బహుతంత్రవిత్
అసంశయ స్సంశయచ్ఛి న్నిరపేక్షో గురుర్మతః

తా॥ నిర్దుష్టదేహము కలవాడు, నవ్వుచు మాట్లాడువాడు, కపటవృత్తి లేనివాడు, తుష్టికలవాడు, బహుతంత్రములఁదెలిసినవాడు తత్వమును జెప్పి సందియము తీర్చువాడు, ధనాసక్తి లేనివాడుసద్గురు వనంబడును

## గురుసంతోష ప్రాధాన్యము

శ్లో॥ యద్యదిష్టతమం లోకే గురవే తన్నివేదయేత్
గురవే దక్షిణాం దద్యా త్ప్రత్యక్షాయ శివాత్మనే
సర్వస్వం వా తదర్ధం వా తదర్ధం తదాజ్ఞయా
న చే త్సంచారిణీ శక్తిః కథ మస్య భవిష్యతి
గురుసంతోషమాత్రేణ దుష్టమంత్రోఽపి సిధ్యతి

తా॥ గురువు తన యాశయమును దెలుపకున్నను దానే యభీష్టమును గుర్తించి ప్రత్యక్షశివుడగు గురువునకు తన

సర్వస్వమును గాని దానిలో సగముగాని, యందు సగముగాని గురు వంగీకరించిన సమర్పించవలయు అటుకాకుండిన గురువు నుండి శిష్యునకు మంత్రదేవతాను గ్రహరూపమైన సంచార శీలమగు శక్తి లభింపదు మఱియు గురువు సంతోసించిననే దుష్టమంత్రములు గూడ ఫలించును కాన గురు సంతోషము ముఖ్యము

శ్లో॥ ఆచార్యా దనభిప్రాప్త మంత్రశ్చాదత్త దక్షిణః
అభ్యస్తోఽపి సదా మంత్రః శ్రేయసే నావకల్పతే.

తా॥ గురువు నుండి మంత్రము గ్రహింపకగాని, దక్షిణ నీయక యభ్యసింపబడిన మంత్రముశ్రేయోదాయకము కాదు గాన, ఈ సుందరకాండ మహా మంత్రమును గురూపదేశమువడసి కల్పోక్తరీత్యా యాచరించి శ్రీ హనుమత్కటాక్షమునకు పాల్పడుదురుగాక

అదియుగాక తాళపత్రాది గ్రంధములయందు ఆది శంకరులు మండనమిశ్రునితో చర్చకు బయలుదేరుటకు ముందు శ్రీ హనుమద్విజయమును స్తుతించినట్లు కనబడుచున్నది

శ్లో॥ తీర్త్వాక్షారపయోధిం క్షణ మథో గత్వా శ్రియస్సన్నిధిం
దత్వా రఘువమ్ముద్రికా మపశుచం కృత్వా ప్రవిశ్యాటవీం
భజ్క్వాఽనేకతరూ న్నిహత్యబహుళా రక్షోగణాం స్తత్పురీం
దగ్ధ్వాఽదాయ మణిం రఘూత్తమ మగా ద్వీరో హనూమాన్కపిః

శ్రీ వీరాంజనేయుడు లవణ సముద్రమును దాటి సీతా మహాదేవి సన్నిధి కేగి రామముద్రిక నిచ్చి దుఃఖ రహితురాలినిగఁ జేసి వనమునఁ బ్రవేశించి యనేకములయిన వృక్షములను బెకలించి రాక్షస గణములను మర్దించి లంకను దహించి చూడామణిని దీసికొని రామచంద్రమూర్తిని దిరిగి కలసి కొనెను ఇదియే సుందరకాండ సారాంశము

శ్లో॥ తరుణారుణ ముఖకమలం కరుణారసపూరపూరితాపాంగం
సంజీవన మాశాసే మంజుల మహిమాన మంజనాభాగ్యం.

శ్లో॥ శంబరవైరిశరాతిగ మంబుదళ విపులలోచనోదారం
కంబుగల మనిలదిష్టం బింబజ్వలితోష్ఠ మేక మవలంబే ।

శ్లో॥ దూరీకృత సీతార్తిః ప్రకటీకృత రామవైభవస్ఫూర్తిః ।
దారితదశముఖకీర్తిః పురతో మమ భాతు హనుమతోమూర్తిః।

శ్లో॥ వానరనికరాధ్యక్షం దానవకుల కుముద రవికర సదృక్షం ।
దీనజనావనదీక్షం పవనతపః పాకపుంజ.మద్రాక్షం. ।

శ్లో॥ ఏతాఖిల విషయేచ్ఛం జాతానందాశ్రుపులక మత్యచ్ఛం ।
సీతాపతి దూతాద్యం వాతాత్మజ మద్య భావయే హృద్యం।

శ్లో॥ ఏ తత్పవనసుతస్య స్తోత్రం యః పఠతి పంచరత్నా ఖ్యం ।
చిర మిహ నిఖిలాన్ భోగాన్ భుక్త్వా శ్రీరామభక్తిభా గ్భవతి ।

ఇట్లు
భక్తజన విధేయుడు,
గ్రంధకర్త.



ఓమ్

శ్రీర్భూయాత్

శ్రీ సువర్చలా సహితాంజనేయనమః

# శ్రీ సుందర హనుమ ద్వైభవము

## గణేశ ప్రార్థన

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే

## ఇష్టదేవతా ప్రార్థన

శ్లో॥ సీతారాఘవరత్న మౌక్తిక లసత్హారావళీ శోభితం
హస్తాంభోజ వరాభయాంకిత మనే కాకల్పరత్నోజ్జ్వలం
వాలావేష్టిత మౌళి మీశ్వరతనుం భక్తానుకల్పద్రుమం
రాజన్మౌంజ్యజినోపవీత మనిశం శ్రీ ఆంజనేయం భజే॥

## గురు ధ్యానము

శ్లో॥ విజ్ఞాత సర్వాగమ తత్వమూర్తిం
నివారితాంఘ్రిప్రణతాఽఖిలార్తిం
బంధ్యాల వంశోద్భవ మానమామి
శ్రీ సూర్యనారాయణ దేశికేంద్రమ్ ।

# గురుంపరంపరా స్తోత్రము

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు
ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరంబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ జ్ఞానానందమయం దేవం
నిర్మలస్ఫటికాకృతిం
ఆధారం సర్వ విద్యానాం
హయగ్రీవ ముపాస్మహే ॥

శ్లో॥ నారాయణం పద్మభువం వశిష్ఠం
శక్తించ తత్పుత్ర పరాశరం చ
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం
గోవిందయోగీన్ద్ర మథాఽస్య శిష్యం
శ్రీ శంకరాచార్య మథాఽస్య పద్మ
పాదం చ హస్తామలకం చ శిష్యం
తం త్రోటకం వార్తికకార మన్యా
నస్మద్గురూ న్సన్తత మానతోస్మి॥

శ్లో॥ శ్రుతి స్మృతి పురాణానా
మాలయం కరుణాలయం
నమామి భగవత్పాద
శంకరం లోకశంకరమ్

శ్లో॥ శంకరం శంకరాచార్యం
కేశవం బాదరాయణమ్

స్మ్రుత భాష్య కృతౌ వందే
భగవన్తౌ పునః పునః ।

శ్లో॥ నారాయణ సమారంభాం
విద్యాశంకర మధ్యమామ్
కుమారస్వామి పర్యంతాం
వందే గురుపరంపరాం ।

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యోవంశ ఋషిభ్యో నమో గురుభ్యః ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

మాతా పితృ ధ్యానము

శ్లో॥ శ్రుత్యుక్త కర్మాచరణ ప్రవృత్తం
విద్యోపదేశోద్ధృతశిష్యవర్గమ్
ప్రసిద్ధ శిష్టాన్వయ రత్నదీపం
గోపాలకృష్ణం పితరం ప్రపద్యే॥

శ్లో॥ తా మాదిలక్ష్మీ పదకీర్తనీయాం
పతివ్రతానాం పురతోఽభిధేయాం
లక్ష్మీసమానాం సుగుణావదాతాం
వందే మదీయాం జననీం శుభాప్త్యై ।

## పితామహాది ధ్యానము

శ్లో॥ అష్టాదశా ష్యనుపమాన్ ప్రథితాగ్రహారాన్
సంపాద్య పూర్వ మిహ మంత్రజపప్రభావాత్
కీర్తిం నిజా మకలయ ల్కిల య స్సమర్థం
తత్పాధు మత్పితృపితామహవర్గ మీడే ।

# శ్రీ ఆంజనేయ సుప్రభాతము

శ్లో॥ అమల కనక వర్ణం ప్రజ్వలత్పావకాక్షం
సరసిజనిభవక్త్రం సర్వదా సుప్రసన్నం
పటుతరఘనగాత్రం కుండలాలంకృతాంగం
రణజయకరవాలం రామదూతం నమామి ॥

అంజనా సుప్రజా వీర పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ హరిశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం ॥
ఉత్తిష్ఠోత్తిష్ఠ హనుమన్ ఉత్తిష్ఠ విజయధ్వజ
ఉత్తిష్ఠ రవిజాకాంత త్రైలోక్యం మంగళం కురు ॥

శ్రీ రామచంద్రచరణాంబుజమత్తభృంగ
శ్రీ రామమంత్రజపశీల భవాబ్ధిపోత
శ్రీ జానకీహృదయతాపనివారమూర్తే
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ రామదివ్య చరితామృతపానలోల
శ్రీ రామకింకర గుణాకర దీనబంధో
శ్రీ రామ భక్త జగదేక మహోగ్రశౌర్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

సుగ్రీవమిత్ర కపిశేఖర పుణ్యమూర్తే
సుగ్రీవరాఘవసమాగమ దివ్యకీర్తే
సుగ్రీవమంత్రివర శూరకులాగ్రగణ్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

భక్తార్తి భంజన దయాకర యోగావంద్య
శ్రీ కేసరి ప్రియతనూజ సువర్ణదేహ
శ్రీ భాస్కరాత్మజ మహోంబుజచంచరీక
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ మారుతప్రియతనూజ మహాబలాఢ్య
మైనాకవందితపదాంబుజ దండితారిన్
శ్రీ ఉష్ట్రివాహన సులక్షణ లక్షితాంగ
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

పంచననాస్య భవభీతిహరస్య రామ
పాదాబ్జసేవనపరస్య పరాత్పరస్య
శ్రీ అంజనాప్రియసుతస్య సువిగ్రహస్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

గంధర్వ యక్ష భుజగాధిప కిన్నరాశ్చ
ఆదిత్య విశ్వ వసురుద్ర సురర్షిసంఘాః
సంకీర్తయంతి తవ దివ్యసునామపంక్తిం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ గౌతమ చ్యవన తుంబుర నారదాత్రి
మైత్రేయ కృష్ణజనకాది మహర్షి సంఘాః
గాయంతి హర్షభరితా స్తవ దివ్యకీర్తిం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

భృంగావళీ చ మకరందరసం పిబేత్ త్వై
కూజం త్యృతార్ధమధురం చరణాయుధాశ్చ
దేవాలయే ఘన గభీర సుశంఖ ఘోషా
నిర్యాంతి వీర హనుమంస్తవ సుప్రభాతమ్ ॥

పంపాసరోవర సుపుణ్య పవిత్ర తీర్థ
మాదాయ హేమకలశైశ్చ మహర్షిసంఘాః
తిష్ఠంతి శ్రీ చరణపంకజ సేవనార్థం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ సూర్యపుత్రి ప్రియనాథ మనోజ్ఞమూర్తే
వాతాత్మజాత కపివీర సుపింగళాక్ష
సంజీవరాయ రఘువీరసుభక్తవర్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

౭౨ ౭౨ ౭౨ ౭౨

ఓమ్
శ్రీ సీతారామాంజనేయాయ నమః

గురుభ్యోనమః



## శ్రీ రామాయణ ప్రశంస – సుందరకాండ విశిష్టత

శ్లో॥ అమల కనకవర్ణం ప్రజ్వల త్పావకాక్షం।
వరసిజనిభవక్త్రం। సర్వదా సుప్రసన్నం।
పటుతర ఘనగాత్రం కుండలాలంకృతాంగం।
రణ జయ కరవాలం। రామదూతం నమామి।

శ్లో॥ కాలాంభోధరకాంతికాయ మనిశం వీరాసనాధ్యాసితం।
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజం జానుని
సీతాం పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం మకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే।

"ఇత్యార్షే శ్రీమద్రామాయణే- ఆదికావ్యే" అనుటచేతనే ప్రాచీనవాఙ్మయములో రామాయణమునకు ఆదికావ్యమను ప్రశస్తి ఉన్నది రామాయణము ప్రపంచ సాహిత్యములో ఉత్తమోత్తమముగా పరిగణింపబడుచున్నది అయితే భారతీయేతరులు ఇందులోని కవిత్వ సంపత్తి మాత్రమే గుర్తింపగలిగిరి కాని మనకో రామాయణము కావ్యం మాత్రమే కాదు; ఏమన

శ్లో॥ శృణ్వా రామాయణం భక్త్యా ।
యః పాదం పదమేవ వా
స యాతి బ్రహ్మణస్థానం
బ్రహ్మణా పూజ్యతే సదా ।

ఇదం పవిత్రం పాపఘ్నం । పుణ్యం వేదైశ్చ సమ్మితం ।
యః పఠే ద్రామచరితం । సర్వపాపైః ప్రముచ్యతే ॥

తా॥ రామాయణములోని ఒక శ్లోకపాదము గాని, ఒక పదము గాని భక్తితో పఠించినవారు విన్నవారు బ్రహ్మలోకమును పొంది యెల్లకాలము బ్రహ్మచేత పూజలందుకొనుచుందురనియు, యీ రామాయణము వేదసమ్మితమై సకల వేదరహస్యములను తెలియజేయునదియై సర్వపాపములనుండి విముక్తులను జేయునదియు అని స్పష్టమగుచున్నది రామాయణమంతయు పవిత్రమే యనినప్పుడు సుందరకాండను గురించిన విశిష్టత యెందుకన; రామాయణ సారము సుందరకాండము; భారతసారము భగవద్గీత కనుకనే అవి రెండును మనకు నిత్యపారాయణ యోగ్యములు అయినవి భగవద్గీత మోక్షసాధనముకాగా, సుందరకాండ యైహికాముష్మిక సాధన మగుచున్నది ఎట్లన, వినుడు॥

శ్లో॥ యథా సర్వేషు దేవేషు శ్రీరామః పరమో మతః ।
తథా రామాయణే శ్రీమాన్ సుందరః కాండ ఉత్తమః ।

శ్లో॥ బీజకాండ మితి ప్రోక్తం సర్వరామాయణేష్వపి ।
తస్మా త్పారాయణం కృత్వా ధన్యా భవత తత్త్వతః ॥

తా॥ దేవతలందరిలోను శ్రీరాముడు ఉత్తముడైనట్లు శ్రీ రామాయణ నందలి కాండములలో సుందరకాండము ఉత్తమమైనదని యు బీజకాండమనియు స్పష్టీకరింపపడియున్నది అదిగాక దీనికి

సుందరకాండమను పేరు ఎలా సార్థకమౌతున్నది? ఇందులోనున్న సౌందర్యమెటువంటిది? అనే జిజ్ఞాసకూడ కలుగుచున్నది ఈ ప్రశ్నలకు సమాధానములు తెలుసుకొనుటకు ముందు భారతీయ కవితావైశిష్ట్యమెటువంటిదో అవగాహన చేసికొనవలయును 'కవయతీతి కవిః' అనుటచేత వర్ణించి చెప్పువాడు కవి అని అందరికీ తెలుసును అయితే దేనిని వర్ణించటమని ప్రశ్న కలుగును వక్తవ్యాంశమునే కదా? అని జవాబు చెప్పవచ్చు నిజమునకు మన పెద్దల తాత్పర్య మంతియే కాదు పరబ్రహ్మ లీలా విలాసముల నెఱి వర్ణించుటయే కవిత్వము కనుకనే ప్రాచీనకవితాకాంత "వేదాంతామృతలోచని" అని, 'కావ్యారవిందానన' అని చెప్పు కుంటున్నాము ఉపనిషద్బోధితమైన పరబ్రహ్మ స్వరూపమును లక్ష్యముగా చేసికొన్న సరస్వతి కావ్యముఖంతో ప్రకాశిస్తున్నది అని మనపెద్దలు చెప్పుచున్నారు కాబట్టి కావ్యము వలన పాఠకునకు భగవత్సందర్శనాసక్తి జనించవలయు, దాని వలన నతడు ఇహబంధాల నుండి విముక్తుడై పునరావృత్తి రహితమైన శాశ్వత బ్రహ్మలోక నివాస సౌఖ్యాన్ని చూఱగొనాలి పాఠకులను ఇందుకుసన్నద్ధపరచేదే ఉత్తమమైన కవిత్వం "నానృషిః కురుతే కావ్యం" అనటంలో మన పెద్దల అభిప్రాయం ఇదే ఋషికానివాడు కావ్యనిర్మాత కాలేడు అన్నారంటే ఏదో అవక తవక కవిత చేసిన వాడల్లా ఋషి అవుతాడని కాదు జితేంద్రియత్వం, పరబ్రహ్మానుసంధానం అనుభూతిలో వున్నవాడే ఋషి అట్టి సంపత్తి ఉన్నవాడు మాత్రమే నిజమైన కవి మంత్రద్రష్టలు మహర్షులనే నిర్వచనం మనం తరుచూ వింటూ ఉంటాముకాదా' అనగా ఆయా మహామంత్రాలన్నీ ఎప్పుడూ ఉండేవే అనీ వాటిని తమ అతీంద్రియదృష్టిచేత కనుగొన్నవారు ఋషులని మనకు తెలుసు సామాన్య ప్రజల వాఙ్మనశ్చక్షురాది విషయాలకు అందని పరమసత్యాలను తమ అతీంద్రియదృష్టిచేత

చూచి లోకం శ్రేయస్సు కోసం బహిరంగ పరచినవారు ఋషులు. వారికి ఒక వర్గం పట్ల అభిమానము, మరొక వర్గంపట్ల ద్వేషమూ ఉండదు. "లోకాస్సమస్తా స్సుఖినో భవంతు" అని మాత్రమే వారు కాంక్షిస్తారు కవులు ఇటువంటివారు అయితేనే వారికావ్యాలు ఆచంద్రార్కముగా నిలుస్తాయి కాగితములు, కలములు, అచ్చుయంత్రములు లేని అతిప్రాచీనకాలంలో వాల్మీకి రామాయణము రచిస్తే అది యీనాటికీ మనకు పారాయణగ్రంథముగా ఉండటమే ఇందుకు తార్కాణము ఈ మహాకావ్యం మనలోకంలోనేకాదు దేవలోకంలోకూడా అర్చింప బడు చున్నదట వినుడు

శ్లో॥ శ్రీరామాయణ మాదికావ్య మృషిణా వాల్మీకినా నిర్మితం
వేదాంతార్థవిశారదై రనుదినం స్తుత్యం సురైరర్చితమ్ ।
శ్రోతౄణా మఘనాశనం సురతరో స్తుల్యంచ ముక్తిప్రదం ।
యేశృణ్వంతి పఠంతి రామచరితంతేయాంతి విష్ణోఃపదమ్

అని అంటున్నాము రామాయణము కల్పవృక్షసమమని, మోక్షమును కూడా ఇవ్వగలదని ఈశ్లోకములోని ముఖ్యవిశేషము కాబట్టి రామాయణ మీనాటికీ పల్లెపల్లెలలో వీధి యరుగులమీద ప్రజానీకమునకు పెద్దలు చదివి వినిపించటము జరుగుచున్నది చదివినవారికి, విన్నవారికి, పుణ్యము కలుగుతుందని మనము విశ్వసించుచున్నాము ఈనాటికీన్నీ ఈ పుణ్యకావ్యములోని మహిమ, అనుభూతి గోచరము చేసికొన్న మహానుభావు లున్నారు

అయితే సుందరకాండమునకు ప్రత్యేకత మాటయేమిటి? అను దానికి ఇంతవరకు జవాబులేదు ముందు రామాయణ గౌరవము తేటతెల్లమైతే, ఈ ప్రశ్నకు జవాబు చెప్పవచ్చును ఇంతవరకు చెప్పినదానివి

బట్టి వాల్మీకి ఏ ఆశయముతో రామాయణము రచించినాడో దానిచే లోకమెల్ల ఇహపరముల రెంటిని సాధింప గలుగుచున్నారో సుస్పష్టమౌ చున్నది ఇప్పుడు సుందరకాండమునకు ఏప్రైదము అసలు రామాయణమంతయు నొక మహామంత్రము దానిలో నొక ప్రత్యేక మహామంత్రము సుందరకాండము

శ్లో॥ శ్రీమ త్సుందర కాండస్థ హనుమద్విక్రమాదికమ్ ।
పఠన్ శృణ్వన్ సదా భక్త్యా సకలేష్టార్థసిద్ధిభాక్ ।
సప్తసర్గ క్రమేణైవ నిత్యం యః పఠతే ముదా ।
షట్సప్తవేద సంఖ్యేషు ఫలం మశ్నుతే ।

శ్లో॥ ప్రత్యహం సర్గ మేకం వా పఠే త్కాండం సమాహితః ।
నిత్యం పారాయణం కుర్యాత్ శ్లోకం శ్లోకార్థమేవ వా ।
పాదం వా వాక్యమాత్రం వా పదం వా ప్యక్షరం ద్విజ
యద్య త్సంకల్పితం చిత్తే సుకరం దుష్కరం చ వా
లభతే సుందరాఖ్యస్య కాండస్య పఠనా న్నరః ।

హనుమద్విక్రమాదికమగు సుందరాకాండము నిత్యము ఒక శ్లోకము చొప్పునగాని, సప్త సర్గ క్రమముతోగాని, యొక సర్గచొప్పున గాని చేసెడివారు చాలగనున్నారు ఇట్లు పారాయణము చేయుటచేత నిత్య జీవితములో నెదురయ్యేడి క్లిష్టపరిస్థితులను అధిగమించగలిగి, సౌఖ్యమును పొందగలుగుచున్నారు, సుందరకాండ పారాయణము వలన నెటువంటి కష్టమైనను తీరిపోతుందని, అనుభవమువలన తెలిసికొనుచున్నాము స్వయముగా పఠనము చేయలేనివారు అందుకు సమర్థులైనవారి చేత చదివించి విని యిక్కట్లు తొలగించుకొన్నవారు చాలగనున్నారు కనుక

ఈకాండ పఠితలకు, శ్రోతలకు, సుందరమైన జీవితము నొసగూర్చు చున్నది అంత మాత్రముచేతనే సుందరకాండ మను పేరెట్లు వచ్చెను? అనుదానికి శ్రీ శ్రీ హనుమత్ప్రభావమును బోధించు గ్రంధములయందు ఈ క్రింద వివరింపబడిన విధమున చెప్పబడినది

సుందర హనుమాన్ అనుట లోకప్రసిద్ధము పరాశరసంహితయను మంత్రశాస్త్రములో పరాశర మైత్రేయమహర్షి సంవాదములో చెప్పబడిన కధలో సుందరహనుమన్మంత్రము పేర్కొనబడినది, చూడుడు

మైత్రేయః :

శ్లో॥ పరాశర మహాయోగిన్సారుతేః పరమాద్భుతం ।
వరమంత్రప్రభావంమే శ్రోతుమిచ్ఛామి తత్త్వతః ॥

పరాశర :–
పురావాల్మీకినా ప్రోక్తం హనుమన్మంత్ర ముత్తమం ।
సంక్షేపతః ప్రవక్ష్యామి శృణు నాన్యమనా మునే॥
పురా కాంభోజనగరే యవనాశ్వ ఇతి శ్రుతః ।
బ్రాహ్మణో జటిలో నిత్యం శివపూజాపరాయణః॥
ఉపవాసమిషేణైవ మోహయామాస లౌకికాన్ ।
శక్తిక్షేత్రం సమాగమ్య చోవాస బహువత్సరమ్॥
అర్పితం కుసుమం చాపి పంచగవ్య ఫలాని చ
కేనాపి నైవ భోజ్యాని తాని కూపే వ్యనిక్షిపత్॥
షణ్మాసం సఫలాని క్షీరాజ్యమధు సేవకః
అపస్మారీ సమజని తస్మి న్దన్మని స ద్విజః
తేనార్పితం తు యద్వస్తు తద్దివ్యం వస్తు భక్షయేత్
య స్సంత్యజే త్ప్రసాదంత మపస్మారీ సజాయతే
ఏవం గతే బహుదినే బ్రహ్మర్షిం గాధినందనం ।
ప్రణమ్య స్వస్యవృత్తాంతం స్వదేహస్థితి మేవచ ॥

విజ్ఞాపయామాస తదా యవనాశ్వో ద్విజోత్తమః ।
శ్రుత్వా ద్విజస్య వృత్తాంత మశేషంచ తపోనిధిః ।
దయార్ద్రీమానసో భూత్వా విశ్వామిత్రో మహామునిః ।
ధ్యాత్వా చోపదిశాస్త్రై సుందరం హనుమ న్మనుమ్ ।

తా॥ పరాశరమహర్షీ ! హనుమంతుని అద్భుత ప్రభావము మరియొకటి చెప్పుమని మైత్రేయుడు అడుగగా పరాశరుడు వాని కిట్లనియె :- పూర్వకాలమున వాల్మీకిచే చెప్ప బడిన సుందర హనుమ న్మంత్ర ప్రభావము ను సంక్షేపముగా నీకు చెప్పెదను పూర్వము కాంభోజ నగరమున యవనాశ్వుడను ఒక బ్రాహ్మణోత్తముడు కలడు అతడు శివ పూజా ధురంధరుడు సర్వదాఉపవాసము చేయువాడు అతడు శక్తి క్షేత్రమున అనేకవత్సరములు నివసించి భగవన్నివేదితములైన కుసుమములను, పంచగవ్యాదికమును, ఫలములను, నైవేద్యమును తాను ముట్టుకొనక కూపమున పారవేయుచుండెడివాడు ఆరుమాసములు ఫలములును, క్షీరమును, ఘృతమును, తేనెయును, పుచ్చుకొనుచుండెడివాడు ఇట్లుండగా అతడు ఆజన్మమునందే అపస్మారరోగము కలవాడాయెను ఈశ్వరారాధన చేయుచు, ఈశ్వర ప్రసాదమును స్వీకరింపక పోవుటచే అతనికి అపస్మారరోగము కలిగెను ఇట్లుండగా కొంతకాలమునకు యవనాశ్వుడు విశ్వామిత్రుని కడకేగి తన దేహస్థితిని విన్నవించెను అంతట విశ్వామిత్రుడు, ఆర్ద్రీహృదయుడై అతనికి సుందర హనుమ న్మంత్రము నుపదేశించెను

మంత్రము:-

అస్య శ్రీ సుందర హనుమ న్మహామంత్రస్య వాల్మీకి ఋషిః । అనుష్టుప్ ఛందః । శ్రీ ఆంజనేయో దేవతా । మారుతాత్మజ ఇతిబీజం అంజనాసూను వాయుపుత్రేతి కీలకం । మమ సర్వారిష్ట నివారణార్థం జపే వినియోగహ । హ్రాం మిత్యాది కర హృదయాది న్యాసః ॥

ధ్యానః

శ్లో॥ బాలార్కాయుత తేజసం త్రిభువన ప్రక్షోభకం సుందరం ।
సుగ్రీవాది సమస్త వానరగణై స్సంసేవ్యపాదాంబుజం ।
నాదేనైవ సమస్త రాక్షసగణా న్సంత్రాసయంతం ప్రభుం ।
శ్రీమద్రామపదాంబుజస్మృతిరతం ధ్యాయామి వాతాత్మజం ॥

మంత్రః —

శ్లో॥ హనుమా నంజనాసూను ర్వాయుపుత్రో మహాబలః ।
కపీంద్రః పింగలాక్షశ్చ లంకాద్వీప భయంకరః ॥
ప్రభంజనసుతో వీరః సీతాశోక వినాశకః ।
అక్షహంతా రామసఖో రామకార్య ధురంధరః ।
మహౌషధిగిరేర్హారీ వానర ప్రాణదాయకః ॥
వారీశ తారకశ్చైవ మైనాకగిరి భంజనః ।
నిరంజనో జితక్రోధః కదళీవనసంవృతః ॥
ఊర్ధ్వరేతా మహాసత్త్వ స్సర్వమంత్ర ప్రవర్తకః ।
మహాలింగ ప్రతిష్ఠాతా భాష్యకృ జ్జపతాం వరః ॥
శివధ్యానపరో నిత్యం శివపూజాపరాయణః ।
సప్తవింశతి సంఖ్యాకా న్యేతాని శ్రీ హనూమతః ॥
నతమ్నామా న్యసౌ విప్రో నియమేనా వ్యతంద్రితః ।
తేన శాంతి ప్సముభవ ధనస్మారస్య ధీమతః ।
బహుకాలం హనూమంతం ధ్యానం కుర్వ న్సుపూజయన్
యవనాశ్వో మహాబిప్ర శ్లాఘ్య కాంభోజపట్టణే ॥
పుత్ర మిత్ర కళత్రాద్యై సరిచారక బంధుభిః ।
ఇహ భుక్త్వాఖిలా న్భోగా న్సుాఖ్యా పుణ్యఫలార్జితాన్ ।

ఆంజనేయ ప్రభావేన విష్ణులోక మవాప్నుః ।

అపస్మారరోగము గలవారెల్లరు పైప్రవాయబడిన మంత్రపఠనము చేత విముక్తు లగుదురని మైత్రేయుల వారికి పరాశరులు చెప్పిన కథ ఇది పరాశరసంహిత నుండి గ్రహించబడినది. ఆ సందర్భమునవే హనుమచ్చ్రద్ధ్యానములో.

శ్లో॥ హార కంకణ కేయూర కాంచీ వలయ శోభితం ।
మణి స్వర్ణమయానేక భూషణస్ఫూర్తి భాసురం
సర్వాంగ సుందరం దివ్యమూర్తిం భక్తాభీష్టప్రదాకరం ।

అని వున్నది. హనుమంతుని నివాస స్థానములలో సుందర నగరము వర్ణించబడినది

శ్లో॥ కుండినం నామ నగరం శ్రీభద్రం కుశతర్పణం ।
పంపాతీరం చంద్రకోణం కాంభోజం గంధమాదనం ।
బ్రహ్మావర్తపురంచైవ త్రైశాఖ్య మేవ చ ।
మందరం నగరం చైవ రమ్యం శ్రీహనుమత్పురం ।
ఏతాని వాయుపుత్రస్య పుణ్యస్థానాని నిత్యశః
య స్మరే త్ప్రాత రుత్థాయ భుక్తిం ముక్తించ విందతి॥

పరాశర సంహిత

కైలాసాగ్రే సుఖాసీనం గౌరి సప్రచ్ఛ శంకరం
దేవదేవ జగన్నాథ సర్వభూతదయాకర
దేవ త్వయా ఖలే న్యూనాం భూషణం వివిధాపదాం
మంత్రసాంశ్చ మహాపుణ్యం పవిత్రం పాపనాశనం
శ్రోతు మిచ్ఛామి దేవేశ వద మే కరుణానిధే ।

ఈశ్వర ఉవాచ :

శృణు గుహ్యతమం దేవి భక్తానుయ వివాశివి
సర్వ సంపత్కరం గౌరి గోపనీయం ప్రయత్నతః
మదంశజో మహాతేజా మహాబలపరాక్రమః
సుభగః సుందర శ్శూర శ్శంకరో భక్త వత్సలః
విజయీ విఘ్నభక్తార్ధ్యో రామదూతః కపీశ్వరః
ఏవం ప్లవంగరూపేణ జాతోహం శృణు పార్వతి
అజోహం లోకరక్షార్థం రామదూతోస్మి చాదరాత్ ॥

తా॥ ఒకానొకప్పుడు సుఖాసీనుడై యున్న శంకరుని గౌరీ గౌరిదేవి క్రింది విధముగ ప్రశ్నించెను : ఓ దేవదేవా! సర్వభూతవశంకర! జగన్నాథా! మానవులకు సర్వభూతములకు సర్వాపదల నుండి దేని వలన రక్షణము గలుగునో, అట్టి మహాపుణ్యప్రదమైనదియును, పాపనాశన కరమును, పవిత్రమునగు విషయమును వినవలయునని కోరుచున్నాను కాన దయానిధీ! అట్టి సంగతిని నాకుఁ జెప్పుమని యడిగెను

ఈశ్వరుడు పార్వతితో, నిటులఁ జెప్ప నారంభించెను దేవి! భక్తపాలని! సర్వసంపత్కరముగు రహస్యవిషయమొకటి గలదు చెప్పెదను వినుము; నేను జెప్పెడి విషయము ప్రయత్న పూర్వకముగ రహస్యముగ నుంచదగినది నా యంశముచేనొక వానరోత్తముడు జన్మించెను అతడు మహాతేజస్వి మహా బలపరాక్రమము గలవాడు సౌభాగ్యవంతుడు, సుందరుడు, శూరుడు, భక్తవత్సలుడు, విజయముగలవాడు, విఘ్నభక్తుడు,రామదూతయునగును ఈ ప్రకారముగ నేను వానర రూపముతో జన్మించితినని తెలిసికొనుము లోకరక్షార్థమై నేను వానర

రూపమున జన్మించి రామదూతనయితినని తెలిసికొనుమని పరమేశ్వరుడు పార్వతికిఁ జెప్పెను ఈ సందర్భమున కూడా సుందరుడని చెప్పబడినది

ఆయన నివసించునది సుందరపురము, సుందరహనుమంతుడను పేరుగలవాడు సర్వాంగసుందరుడనే ఖ్యాతి గలవాడు అయితే ఆయన చరిత్రయందు సుందర మున్నదా యన్న లోకానందకరుడు గనుకనే, వాల్మీకి మహర్షి రామాయణమనే మహామాలకు రత్నమువంటివాడనిన అది ఎంత అందము! అనేక మతములవారున్నను సర్వులు హనుమంతుని ప్రేమింతు వారేకదా' అంతకన్న సుందరత్వ మేమున్నది ప్రథమమున నర వానరులకు చెలిమి సమకూర్చుట అందము కాదా' రామలక్ష్మణులకు అభిమానపాత్రుడై, యిహాముత్ర ఫలవిరాగియునై తన శక్తికి మించిన పనులున్నవా అనినట్లు, సీతాన్వేషణము కొరకు సర్వదేశములు తిరిగి కడకు సముద్ర తీరమున జేరి శతయోజన విస్తీర్ణమైన సముద్రము దాటుటకు ఒక్కరైనను శక్తిలేనివారై ప్రాయోపవేశమే శరణ్యమని నిశ్చయించినంతనే యా స్థితియంతయు జాంబవంతుడు చూచి సర్వకార్యసాధకుడు హనుమంతుడనే జ్ఞానముకలిగి, ఓ వీరాగ్రేసరా' చూచితివా వానరులసంగతి; మాఅందరి ప్రాణములు నిలుప నీవే సమర్థుడవు; లెమ్ము నీ పరాక్రమము చూప సమయ మనినంతనే ఆయన క్రియాశూన్యములు కాని శపథములు వానరులకు తీరని ఆనందము కలిగించినవి దీసి నేమనవచ్చు'

ఆంజనేయునియందు ప్రధానమైన రుద్రాంశము, శ్రీరామా వేశము, శ్రీ రామ భక్తులయిన సర్వవానరులయొక్క మహిమావేశము, సాగరమైనాక నాగమాతృసురస దేవతలయొక్క సంపూర్ణశక్త్యావేశము కలుగుటవలననే ఈ దేవతకు సుందరత్వము నిరూఢమైనది సుందర మైన కథ, సుందరమైన నాయికా నాయకులు, సుందరమైన ప్రబోధము,

సుందరమైన పఠన శ్రవణఫలము కలిగినది. గనుకనే యీకాండముకు వాల్మీకి సుందరకాండమని పేరు పెట్టినాడు. యిక పై వారి మాటలు:-

మరియు ఈ క్రింది ప్రమాణములు చూడుడు :

## సుందర శబ్దార్థము

సత్యం శివం సుందరం- అనునవి సచ్చిదానందాత్మకమైన పర బ్రహ్మమునకు పర్యాయపదములు 'హనుమంతుడు' పరబ్రహ్మ స్వరూపుడగుట వలన నాయన యెడల సుందరశబ్దము సార్థకమైనది ఈ క్రింది ప్రమాణములను చదువరులు గ్రహింతురు గాక

## సుందర శబ్దార్థము

'కాదినవ, టాదినవ,పాదిపంచ, యాద్యష్ట' అను సాంకేతిక సూత్రమును బట్టి $సు=7$, $ద=8$, $ర=2=17$ అను సంఖ్యను సుందర శబ్దము బోధించుచున్నది

శ్రుతిః యో వై సప్తదశం ప్రజాపతిం యజ్ఞ మన్వాయత్తం వేద ప్రతి యజ్ఞేన తిష్ఠతి నయజ్ఞాద్భ్రంశతి ఆశ్రావయేతిచతురక్షరమ్ అస్తు శ్రౌషడితి చతురక్షరమ్, యజేతి ద్వ్యక్షరమ్ యేయజామహ ఇతి పంచాక్షరమ్, ద్వ్యక్షరో వషట్కారః ఏషవై సప్తదశః ప్రజాపతిః (యజుస్సంహిత, ౧కాం ౩ ప్ర)

దర్శ పూర్ణమాసయాగములలో హోమముచేయు క్రియాకలాపమున జెప్పిన 'ఆశ్రావయ' అను నాలుగక్షరములు 'అస్తుశ్రౌషట్' అను నాలుగక్షరములు, 'యజ' అను రెండక్షరములు, 'యేయజామహే' అనునైదక్షరములు 'వషట్' అను రెండక్షరములు- ఇవి యన్నిగలసిన పదునేడక్షరములగును అందుచే ప్రజాపతి సప్తదశ సంఖ్యాకుడు అందు వలనపైన జెప్పినట్లు సప్తదశసంఖ్యాబోధకమగు సుందరశబ్దము

బ్రహ్మవాచకము కావున సుందరకాండ మనుదానికి బ్రహ్మప్రస్తావకమగు కాండమనివిష్పృష్టార్థము -

రామాయణమునగలకాండములన్నిటికి వాల్మీకి సార్థకములగు నామములను బెట్టినాడు ఎల్లన రామచంద్రాది బాలకులజననాది వృత్తాంతములను బోధించునది గనుక బాలకాండమని, అయోధ్యా రాజ్యపాలన విషయమును బోధించునది కావున అయోధ్యా కాండమని శ్రీరాముని యరణ్యవాసవృత్తాంతమును వివరించునది కావున అరణ్య కాండమని, కిష్కింధావాసులగు వాలి సుగ్రీవాదుల వృత్తాంతమును దెలుపు కాండము కావున కిష్కింధాకాండమని, రామరావణాదుల యుద్ధమును వివరించు కాండము గనుక యుద్ధకాండమని పేరులు పెట్టుట యర్థవంతముగా నున్నది కాని సుందరకాండమను పేరుమాత్ర మట్లర్థవంతముగా లేదు అందమైన లేక అందముతో గూడిన విషయముల వర్ణించిన కాండము అను నర్థము పొసగదు ఏలయన ఇతరకాండములలో నింతకంటె నందములైన విషయములు నింతకంటె నందముగా వర్ణించిన పట్టు లనేకములు కలవు, అందుచేత సుందరకాండమని పేరుపెట్టిన వాల్మీకితాత్పర్యమును బరిశీలింపగా 'సుందర' శబ్దమునకు హనుమంతుడను నర్థమే యుక్తమని, సుందరుని (హనుమంతుని) బలపరాక్రమాది విషయములను బ్రహ్మస్వరూపత్వమును బ్రతిపాదించు కాండము గనుక దీనికి సుందరకాండమని వాల్మీకి పేరు పెట్టినాడని తెలియదగును

మఱియు సుందర శబ్దమునకు హనుమద్బ్రహ్మ మను నర్థమెట్లు వచ్చినదో వివరింతును, లంక కేగుచున్న హనుమంతుని మేధాశక్తిని బలపరాక్రమాదులను బ్రహ్మస్వరూపత్వమును వివరించుటకై సుందరకాండమున ప్రథమ సర్గలో హనుమంతుని పరీక్షించుటకై దేవతలచే బంపబడిన సురసా వృత్తాంతమున నిట్లు చెప్పబడినది

"తద్దృష్ట్వావ్యాదితం త్వాస్యం వాయు పుత్ర స్సుబుద్ధిమాన్
దీర్ఘ జిహ్వం సురసయా సుఘోరం నరకోపమం
సుసంక్షిప్యాత్మనః కాయం బభూవాంగుష్ఠ మాత్రకః
అంతరిక్షే స్థితశ్శ్రీమా నిదం వచన మబ్రవీత్
ప్రవిష్టో స్మి హితే వక్త్రం దాక్షాయణి నమోస్తు తే
గమిష్యే యత్ర వైదేహీ సత్యం చాసీ ద్వరం తవ
తం దృష్ట్వా వదనాన్ముక్తం చంద్రం రాహుముఖాదివ
అబ్రవీ త్సురసాదేవీ స్వేనరూపేణ వానరమ్
అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ! గచ్ఛసౌమ్య యథాసుఖమ్."

ఇందు హనుమంతుని అంగుష్ఠ మాత్రునిగా వర్ణించుటచే 'అంగుష్ఠ మాత్రః పురుషః' అను శ్రుతిలో వర్ణింపబడిన పరబ్రహ్మ స్వరూపుడు హనుమంతుడని వాల్మీకి వ్యంగ్య ధోరణిలో దెల్పినాడు

మఱియును లంకాదాహకుడగు హనుమంతుని గూర్చి లంకలోని రాక్షసు లిట్లు తలపోసిరి

'కింవైష్ణవం వా కపిరూప మేత్య రక్షోవినాశాయ పరం సుతేజః
అనంత మవ్యక్త మచింత్య మేకం స్వమాయయా సాంప్రత మాగతంవా!
(సుందరకాండ, 54వ సర్గ)

నాశములేనిది, మనోగ్రాహ్యముకానిది, అద్వితీయమునగు నట్టి పరమాత్మ తన మాయచే రాక్షససంహారమునకై వానరరూపముదాల్చి వచ్చినాడా యని తలపోసిరి కావున స్పష్టముగ రాక్షసవాక్కుల ద్వారా వాల్మీకి మహర్షియే, హనుమంతునకు పరబ్రహ్మ స్వరూపమును ఉపసంహార న్యాయముతో వివరించినాడు

మఱియును హనుమంతుని జూచి రావణుడిట్లు తలంచెనని రామాయణమున గలదు.

**'కిం బ్రహ్మణ స్సర్వసితా మహస్య సర్వస్య ధాతు శ్చతురాననస్య**
**ఇహాగతో వానర రూపధారీ రక్షోప సంహారకరః ప్రకోపః**
**కిం వైష్ణవం వా కపిరూప మేత్య రక్షోవినాశాయ పరం సుతేజః**
**అనన్త మవ్యక్త మచిన్త్యమేకం స్వమాయయా సాంప్రత**
**మాగతం వా'**

ఇది బ్రహ్మ యొక్క ప్రకోపమా లేక విష్ణువు యొక్క మాయా రూపమా యని రావణుడు సందేహపడెను అనంతము, అవ్యక్తము, అచింత్యము ఏకము అనునవి బ్రహ్మకుఁ జెప్పదగిన విశేషణములు హనుమంతులవారు సాక్షాద్బ్రహ్మ స్వరూపులని చెప్పుటకీ విశేషణములే ప్రమాణములు

హనుమంతుని బ్రహ్మస్వరూపమును నిర్ణయించుట కనేక ప్రమాణములు కలవు హనుమత్సహస్రనామ స్తోత్రము నందు

**'ఓంకార నమోరూప మోం నమోరూప పాలకః**
**ఓంకారమయ ఓంకార ఓంకారాత్మా సనాతనః'**
**'త్రివిక్రమ స్త్రిపాదూర్ధ్వ స్తరణి స్తారణి స్తమః'**
**'బ్రహ్మపుచ్ఛో బ్రహ్మపరః వానరో వానరేశ్వరః'**

అను నామములు కలవు ఓంకారమయు డనగా ప్రణవ స్వరూపుడని యర్థము త్రిపాదూర్ధ్వః అనుటవలన త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః అను పురుషసూక్త ప్రమాణమువలన బ్రహ్మమని తెలుచున్నది బ్రహ్మ పుచ్ఛః అనుటలో 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' అను తైత్తిరీయ వచనము వ్యాఖ్యాత మగుచున్నది; ఈ విశేషణము స్వామి పుచ్ఛమున కను భ్రాంతి కలుగునేమో యని బ్రహ్మపరః అని స్పష్టప్రతిపత్తిగా నిర్వచింపఁబడినది మఱియును,

విశ్వంభరో విశ్వమూర్తి ర్విశ్వాకారోథ విశ్వదృక్
విశ్వాత్మా విశ్వసేవ్యోఽథ విశ్వో విశ్వేశ్వరో విభుః

అను నామములు గూడ రుద్రయామళము నందలి హనుమ త్సహస్రనామ రీత్యా హనుమంతుని విరాడ్బ్రహ్మ స్వరూపమును రూఢి యొనర్చుచున్నవి

హనుమంతుల వారి విశ్వరూపత్వమునుసుందరకాండములోని యీ క్రింది ఘట్టము రూఢి చేయుచున్నది హనుమంతుడు సీతాదేవిని తన పృష్ఠమున మోసికొని పోయి రాముని జేర్తుననును నీవింత చిన్నవాడవు, నన్నెట్లు మోసికొని పోవుదువని సీత మందహాసముతో ననును. ఆ సందర్భములో

సీతాయావచనం శ్రుత్వా హనుమాన్మారుతాత్మజః
చింతయామాస లక్ష్మీవా న్నవం పరిభవం కృతం
న మే జానాతి సత్త్వం వా ప్రభావం వాఽసితేక్షణా
తస్మా త్పశ్యతు వైదేహీ య ద్రూపం మమ కామతః
ఇతి సంచిత్య హనుమాం స్తదా ప్లవగసత్తమః
దర్శయామాస వైదేహ్యా స్స్వరూప మరిమర్దనః
స తస్మా త్పాదపా ద్ధీమా నాప్లుత్య ప్లవగర్షభః
తతో వర్ధితు మారేభే సీతాప్రత్యయ కారణాత్
మేరుమందర సంకాశో బభౌ దీప్తానలప్రభః
అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః
హరిః పర్వత సంకాశ స్తామ్రవక్త్రో మహాబలః
వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీ మిద మబ్రవీత్
సపర్వతవనోద్దేశాం సాట్టప్రాకార తోరణాం
లఙ్కా మిమాం సనాథాం వా నయితుం శక్తిరస్తి మే.

సీతవలన దనకు క్రొత్తగా పరాభవము కలిగినదని హనుమంతుడు తలచెను ఆమెకు తన బలముగాని ప్రభావముగాని తెలియదు తన కామరూపము నామెకు జూపవలయునని హనుమంతుడు చెట్టుమీది నుండి దూకి తన రూపమును బెంప నారంభించెను ఆయన మేరుమందర పర్వతములంతవాడై యగ్నిహోత్రుని వలె వెలిగిపోవు చుండెను పర్వతాకారుడై ఎఱ్ఱనిమొగముతో, మహాబలముతో, వజ్రముల వంటి కోఱలు, గోళ్ళను గలవాడై తాను తలచుకొన్నచో లంకాపట్టణమును బురుజాలు గోపురములతో, పర్వతవనములతో, రావణునితో సహా నా భుజములపై బెట్టుకొని పోగలుగుదునని చెప్పెను

ఈ పై వృత్తాంతమును బట్టి హనుమంతుడు విశ్వాకృతియైన పరమేశ్వరుడని మనము నిశ్చయించు కొనవచ్చును

ఇది గాక హనుమంతుని పరబ్రహ్మత్వమును నిశ్చయించుటకై పరాశర సంహిత యందలి యీ శతానన రావణవధ వృత్తాంతమును స్మరించుకొన వచ్చును

రావణ సంహారానంతరము సంతోష నిమగ్నుడైన రామచంద్రునితో ఆకాశవాణి, దశకంఠుని సంహరించుటలో గొప్పలేదు శతకంఠుని సంహరించినచో నీ ప్రతిష్ఠ శాశ్వతముగునని హెచ్చరించెను శతకంఠుని పట్టణ మక్కడికి ( లంకాపురమునకు ) మూఱామడల దూరమున నున్నది. అది భూమి మీద లేదు అంతరిక్షమున గలదు రాముడు దానిని సాధించుటెట్లా యని చింతపడసాగెను అప్పుడు హనుమంతుడు

శ్లో॥ తదాహనుమాన్ దుర్ధర్ష ప్రాకారాగ్నిం నరిత్వరా
క్షిప్త్వా తత్పుర పర్యంతం స్వలాంగూల మవర్ధయత్.

శతకంఠ రావణుని యంతరిక్షపురమునకు అగ్ని ప్రాకారము కలదు దానిని హనుమంతుడు తన వాలములో సముద్రమున బడవైచి యాపురము పెఱకు తన తోకను వ్యాపింపజేసెను.

అప్పుడు వానరులకు శతకంఠుని భటులకు యుద్ధము జరిగినది శతకంఠుని తలలను రాముడు తటిగిపోసెను కాని వాని తలలు పుట్టుచునే యుండెను నెత్తురు చుక్కలు పడినచోటులందెల్ల శతకంఠ రావణులు పుట్టుచుండిరి ఇంతలో రామచంద్రుడు తమ్మునితో సహా మూర్ఛిల్లెను సీతాదేవి రణమునకు బూనుకొనెను గర్గ మహర్షి వచ్చి సీతకు హనుమన్మంత్ర ముపదేశించెను ఆ మంత్రప్రభావము వలన,

తస్మై త్రపసన్నో హనుమా నభవ ద్విశ్వ రూపధృత్
వానరం ముఖ మేకంతు ద్వితీయం సింహవక్త్ర కం
తృతీయం గారుడం వక్త్రం చతుర్థం సౌకరం ముఖం
హయాననం పంచమం చా ప్యేకైకం నయనై స్త్రి భిః
దశబాహుసమోపేతం దశాయుధ సమన్వితం
తదాప్రభృతి కథితం పంచాస్యో హనుమా నితి
రూపం తస్య బభౌ యద్వ ద్రుద్రస్య పురఘాతినః

హనుమంతుడు పంచముఖాంజనేయుడై ప్రకాశించెను మొదటిది వానరముఖము రెండవది సింహముఖము, మూడవది గారుడము, నాల్గవది సౌకరము, ఐదవది హయానన ముఖము నాటినుండియు హనుమంతునకు పంచాస్య హనుమంతు డని ఖ్యాతి కలిగినది

అప్పుడు హనుమంతుడు సీతాదేవిని భుజములపై నెక్కించుకొని యెందరు, శతకంఠులుండిరో అన్నిరూపములను దాను గూడ

ధరించి యుద్ధము సాగించెను తన లాంగూలమును విస్తరింపజేసి శతకంఠుని రక్తము భూమిపై బడకుండ కప్పివేసెను దానితో మిగిలి పోయిన శతకంఠు నొక్కని సీతాదేవి కాళీరూపము ధరించి హత మార్చెను

దీనినిబట్టి హనుమంతుడు పరబ్రహ్మస్వరూపుడని రూఢియగు చున్నది

మఱియు నీ క్రింది యంశములను భక్తులనుసంధానము చేసికొనవలయును పైననుదాహరించిన శ్లోకములలో 'రూపం తస్య బభౌ యద్వ ద్రుద్రస్య పురఘాతినః' అని యున్నది అనగా శతకంఠ రావణునితో యుద్ధము చేయుచున్న హనుమంతుని రూపము త్రిపుర సంహారము చేయుచున్న రుద్రునివలెఁ గానిపించెను ఇది వట్టి యుపమానముకాదు హనుమంతుడు సాక్షాద్రుద్రుడే

తారసారోపనిషత్తు నందీ రహస్యము కలదు 'ఓం నమో నారాయణాయ' అనునది తారకము ఈ అష్టాక్షరిలో ఓం అనునది పరమాత్మ నమ అను ద్వ్యక్షరము ప్రకృతి నారాయణాయ అను అయిదక్షరములు పరబ్రహ్మ - ఇది యొక విభాగము దీనికి రెండవ విభాగము కలదు ఓం బ్రహ్మ సకారము విష్ణువు మకారము రుద్రుడు సకారము ఈశ్వరుడు రకారము విరాట్టు యకారము పరమాత్మ, ఇక మూడవ విభాగము కలదు, అకార ఉకార మకారములు వరుసగా ప్రథమ ద్వితాయ తృతీయాక్షరములు నాల్గవది బిందువు, అయిదవ అక్షరము నాదము ఆఱవ అక్షరము కల, ఏడవ అక్షరము కలాతీతము, ఎనిమిదవ అక్షరము పరమాత్మ, అదియే తారకము అకారము జాంబవంతుడు ఉకారము ఉపేంద్రుడు, విష్ణువు, అనగా సుగ్రీవుడు, మకారము రుద్రుడు- అనగా

హనుమంతుడు నాల్గవది (బిందువు) శత్రుఘ్నుడు- ఇంద్రుడు నాదము (ఆఱవది) భరతుడు ఏడవది కల- లక్ష్మణుడు- శేషుడు ఎనిమిదియది సీత- (యకార స్వరూపిణి) పైని తారకము శ్రీరామచంద్రుడు

ఇందు ముఖ్యముగాఁ దెలిసికొనదగిన యంశము మకారము రుద్రాంశ కలిగిన హనుమంతునకు ప్రతీక యని. కావున హనుమంతుడు సాక్షాత్పరమేశ్వరుడు గ్రంథాంతరమందు

శ్లో॥ నాదబిందు కలాతీతం ఉత్పత్తిస్థితి వర్జితం
సాక్షదీశ్వరరూపంచ, హనుమంతం నమామ్యహం।

అనివున్నది!
రుద్రయామిళములో శివుడు పార్వతితో నిట్లుచెప్పు చున్నాడు

శ్లో॥ దశవిష్ణు ర్ద్వాదశార్కా స్త్వేకాదశ సంస్కృతా
రుద్రః పరమచండశ్చ లోకేస్మిన్ భుక్తి ముక్తిదః
హనూమాన మహాదేవః కాలకాల స్సదాశివః
భుక్తిదో ముక్తికైవల్య ముక్తిదః సర్వకామదః.

విష్ణువు పదిమంది సూర్యులు పంద్రెండుగురు రుద్రులు పదునొకండుగురు. హనుమంతుడు కాలకాలుడైన సదాశివుడు అతడు పంచాస్యుడు, శివునకు గూడపంచముఖములు కలవు. అవి 1 సద్యోజాతము 2 వామదేవము, 3. అఘోరము,4. తత్పురుషము, 5 ఈశానము ఇవి యైదును హనుమంతుని పంచాస్యములైనవి తెలియవలయును ఇది మంత్రరహస్యము.

ఆనంద రామాయణమున నీ యైతిహ్యము కలదు.

శ్లో॥ పురాత్రిపుర సంహారే స్వబాణత్వ ముపేయుషే
విష్ణవే రామరూపాయ కరిష్యన్ ప్రత్యుపక్రియాం
అఖిలైః ప్రమథైః శ్శంభుః హనూమద్రూప మాయయౌ
తథా ప్రత్యుపకారం స విధాయాలిక్రుతజ్ఞతాం
శివఏవ హరి స్సాక్షాత్ హరిరేవ శివస్స్వయం
ఉభయో రంతరం నాస్తి భేదకృ త్పాప మశ్నుతే
విజ్ఞాత మనయో ర్యత్తు రూపం తదుభయాత్మకం
ఉపాస్య హనుమత్సర్వజ్ఞం భోగమోక్షప్రదం నృణాం.

త్రిపురాసుర సంహారమున విష్ణువు శివుని ధనస్సున (మేరుపర్వతము) బాణముగా వెలిసెను. ఆ యుపకారమును మనస్సులో నిడుకొని కృతజ్ఞుడైన శివుడు రామావతారము నెత్తిన విష్ణువునకు హనుమదవతారమునెత్తి సాయముచేసెను ఇంకొక విశేష మేమనగా హనుమంతుడు భయాత్మకుడు అనగా శివవిష్ణ్వాత్మకుడు కావున భోగమోక్షములు రెండు వీయగల్గినవాడు ఐశ్వర్యమును గోరినవారు శివుని, మోక్షమును గోరినవారు జనార్ధనుని, గొలుచు సంప్రదాయము మనదేశమున గలదు ఈ క్రింది ప్రమాణమును వినుడు,

యత్రాస్తి మోక్షో నహి తత్ర భోగః
యత్రాస్తి భోగో నహితత్ర మోక్షః।
శ్రీ మారుతే స్సేవన తత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ।

మఱియును ఇంద్రజిన్నాగబంధము వదలించుటకు వచ్చిన గరుడుడు రామునిలో విల్లనుచున్నాడు

శ్లో॥ సాక్షాత్త్వం భగవాన్ విష్ణు లక్ష్మీస్తు జనకాత్మజా
సౌమిత్రిః ఫణిరాజోయం రుద్రాశ్చ కపయ స్స్మృతాః

నీవు సాక్షాత్తు విష్ణువవు సీత లక్ష్మి-లక్ష్మణుడు శేషుడు కపులందరు రుద్రులని గరుడుడు చెప్పెను, పైగా వతడు ఏ యే రుద్రులు ఏయే వానరులెవరో వివరించి చెప్పెను, సుగ్రీవుడు = వీరభద్రుడు; నలుడు = శంభువు; నీలుడు = గిరీశుడు; సుషేణుడు = మహాయశుడు; జాంబవంతుడు = అజై కపాదుడు

అంగదుడు = అహిర్బుధ్న్యుడు; దధివక్త్రుడు = పినాకధృత్; తారుడు = అయుతాజి; తరళుడు = స్థాణువు; మైందుడు = భర్గుడు; హనుమంతుడు = భగవాన్

పై నుదహరించిన వరుసగా ఆ యా రుద్రులు ఆ యా వానరులుగా అవతరించిరని గరుత్మందుడు చెప్పెను హనుమంతుడు భగవాన్ అనగా సాక్షాత్తు శివుడే హనుమంత డయ్యెనని భావము

## భీమ గర్వభంగము

హనుమత్కోటాక్షమున పురుష మృగానయనము ఈ క్రింది నుదహరింపబడిన కథాక్రమము వలన హనుమంతుడు సాక్షాత్పరమేశ్వరుడని నిర్ధారణ మగుచున్నది ఆ కథయందలి శ్రీ ఆంజనేయస్వామి స్వయముగా భీమునకు చెప్పిన రెండు అవతారముల గురించి గ్రహింతురు గాక

ఈ వుదహరించిన వురుషమృగ కథ ననుసరించి మన పూర్వాచార్యులలో భారతీయ సాంప్రదాయకము గలవారు రాత్రులందు భోజనశాలలు పరిశుద్ధి నిమిత్తం ధర్మరాజుల వారి యాగశాలకు పురుషమృగం

వచ్చినది పాపజాతి యెంగిలులారా పారిపొండని అను అలవాటున్నా స్త్రీలలో కలదు-

ఈ వుదహరింపబడిన విషయము లన్నియు విచారించగా పరబ్రహ్మస్వరూపుడనుట కెట్టి సందియములేదని నా నిశ్చయము

శ్రీ పరాశర సంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే పురుష మృగహరణోపాయ కథనం నామ పంచషష్ఠిః పటలః

# భీమ గర్వభంగము

హనుమత్కటాక్షమునపురుష మృగానయనము

శ్రీ పరాశరః

శ్లో॥ మైత్రేయః శ్రుణు వక్ష్యామి భూయోఽపి హనుమత్కథాం
శ్రోత్రామృతాం మహానందకరాం కామ్యప్రదాం శుభాం.

తా॥ ఓ మైత్రేయ మునీంద్రా! వినుట కమృతమువలె రుచికర మైనట్టియు, మిక్కిలి సంతోషమును కలిగించునట్టియు, సకల కామ్యముల నొసంగునట్టియు శుభమైన శ్రీహనుమంతుని చరిత్రము చెప్పెదను వినుము

శ్లో॥ ఆసీ త్కశ్చి న్మహారాజో విజితారాతిమండలః
ధర్మరాజ ఇతిఖ్యాతో ధర్మరాశి రివాపరః

శ్లో॥ చతుర్భి రనుజైశ్శూరైర్భీ మార్జున పురోగమైః
రేజే పరివృతో నిత్యం చతుర్భుజ ఇవాచ్యుతః

తా॥ ధర్మరాజను మహారాజొకడు కలడు అతడు శత్రురాజులను జయించి, యవతరించిన ధర్మసముదాయమువలె విరాజిల్లు చుండెను

నాలుగు భుజములు కల శ్రీవిష్ణుమూర్తి వలె మిక్కిలి శూరులగు భీముడు, అర్జునుడును నకులుఁడు, సహదేవుఁడు అను నలుగురు తమ్ములలోఁ గలసిమెలసి సంచరించు చుండెను

శ్లో॥ హస్తినాఖ్యే పురేఽతిష్ఠ ద్యుగే ద్వాపరనామని
గుణైర్మనాంసి నిర్ధోషైః ప్రజానా మనురంజయా

శ్లో॥ పిత్రా నివేదితః పూర్వం పాండురాజేన ధీమతా
శశాస సకలాం పృథ్వీం పృథాయాః ప్రథమ స్సుతః

తా॥ పూర్వము ద్వాపరయుగమందు మంచి గుణముల చేతఁ బ్రజలను బ్రేమించుచుఁ బృథాదేవికిఁ బ్రథమ పుత్త్రుండగు ధర్మరాజు, తండ్రియగు పాండురాజువల్ల సర్వరాజ్యమును బొంది హస్తినా పట్టణమును రాజధానిగాఁ జేసికొని రాజ్యమును బరిపాలించు చుండెను

శ్లో॥ స కదాచి న్మహారాజో రాజసూయేన వీర్యవాన్
యష్టుం సముపచక్రామ విక్రమాక్రాంత భూమిపః

శ్లో॥ తత్ర సత్రే మహాధర్మ్యే ధౌమ్యప్రముఖకారితే
అభుంజ్యంతాతిశుభ్రాణి శాలీయాన్నాని మానవైః

తా॥ ఆ ధర్మరాజు ఒకానొకప్పుడు తనపరాక్రమముచేత సకల భూపతులను జయించి రాజసూయయజ్ఞమును జేసినాఁడు ధౌమ్యుఁడు మొదలగు మహామునులు మంచి నియమము ప్రకారము యజ్ఞమును జేయించు చుండగా నందు సర్వప్రజలు పరిశుభ్రమగు వరియన్నమును సమృద్ధిగా భుజించుచుండిరి

శ్లో॥ మృదూని స్వాదు సూపాని నానాశాకాంకితాన్యపి
సంపూర్ణానిచ భక్ష్యాణి భోజ్యాని వివిధానిచ

అసంఖ్యాకాని చోష్యాణి లేహ్యాని మధురాణి
పాఠభాణిచ రుచ్యాణి గోఘృతాని నవాని
క్షీరాణ్యపి మహార్హాణి సుధాస్పర్థిరసానిచ
శారదేందువశక్షాణి సంపూతాని దధీన్యపి
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాస్సంకీర్ణజా రపి
పురంధ్రీభిః పురస్త్రాభి రాగతాభి స్తతస్తతః.

తా॥ మృదువులగు మంచి సూపములు నానావిధములగు కూరలు అన్ని రకములగు పిండివంటలు, భోజ్యములు అనేక విధములగు చారులు, లేహములు, తేనె, మిక్కిలి పరిమళము కల రుచికల అప్పుడే కాచిన ఆవునేయి, మిక్కిలి రుచికల విలువకల క్షీరములు, అమృతము కంటె మిక్కిలి రుచిగల పాలు పెరుగులు మంచి వెన్నెలవలె దెల్లనైనదధి మొదలగు నన్ని విధముల రసములతోఁ గూడినవన్నియు బ్రాహ్మణులు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, నానాజాతులవారు-స్త్రీలు, అక్కడ నున్నవారు ఎక్కడి నుండియో వచ్చుచుండువారు బహుప్రజలు భుజించు చుండిరి

శ్లో॥ యథారుచి యథేష్టంచ భుక్తాని బ్రాహ్మణోత్తమైః
అగణ్యాస్తత్రభోక్తారః బ్రాహ్మణా వేదపారగాః
ఇతరే కింపున ర్మర్త్యా అసంఖ్యా స్సికతాఇవ
ఏవం ధర్మతనూజేన క్రియమాణే మహాక్రతౌ.

తా॥ సర్వ ప్రజలునూ యథేచ్ఛగా, దమకు రుచి గలుగునట్టి పదార్థములు సమృద్ధిగా భుజించినారు వేదవేదాంతములు చదువుకొన్న పండితులు లెక్కకు మించియున్నారు ఇసుకరేణువుల వలెనే, ఆ

యజ్ఞమునందుఁగల ప్రజలు మితిమీఱి యున్నారు ఇట్లు ధర్మరాజు మిక్కిలి గొప్పయజ్ఞము చేయుచుండెను

శ్లో॥ సర్వస్వదనుజో భీమః కింవిధేయం మమాధునా
రత్నగర్భాపతే రస్య సరత్నం దానమర్హతి

శ్లో॥ సర్వకామదుఘా ధేను స్స్వరాణాం భువి దుర్లభా
ఉపధీకరణీయాఽపి న రాజ్ఞః కీర్తి మావహేత్

తా॥ ఆసమయములో నా సార్వభౌముని తమ్ముండు భీముండు తన మనస్సులో నిట్లు తలంచెను ఈ మహామహుండు మంచి ఘనకార్యము చేయుచున్నాఁడు ఈ రాజరత్నమునకు రత్నమువంటి పారితోషికము సమర్పించుట మంచిది కామధేనువు భూలోకములో దుర్లభము దేవ లోకములో సులభముగా దొరుకునుగాని యట్లు చేయుట మన రాజేంద్రున కంత కీర్తికరముకాదు

శ్లో॥ కింతు యద్దుర్లభం భూమౌ యచ్చ రాజ్ఞో యశస్కరః
బలాదాహృత్య తద్దేయం మయా తస్యైతు సాంప్రతం

తా॥ భూలోకములో దొరకనట్టిదియు రాజునకు యశస్సును వృద్ధి చేయునట్టిదియు మహాపదార్థ మెయ్యెడ నున్నను బలవంతముగాఁదీసికొని వచ్చి యీమహారాజునకు సమర్పించుటయే యిప్పుడు మిక్కిలి మంచిది

శ్లో॥ సంచారా త్పురుషమృగస్య భుక్త శాలా
స్సమ్మృష్టి స్త్రిదివని కేతనస్య కుర్యాం
ఆనేతుం తమితి విభావ్య భీమ సేనః
నిష్క్రాంతస్య వనగృహో ద్యయౌ సుధర్మాం

తా॥ స్వర్గము నుండి పురుషమృగమును దీసికొని వచ్చి భోజనశాలలను పవిత్రవంతములనుగా జేయుదును ఆ పురుషమృగము సంచరించుచుండినచో దుర్గంధ మంతయును దొలగిపోవును సుగంధము పరిమళించుచుండును కావున దానిని దప్పక తీసుకొని వత్తునని నిశ్చయించుకొని భీమసేనుండు యజ్ఞశాలనుండి బయలుదేరి దేవేంద్ర సభయగు సుధర్మకు ప్రయాణమైనాడు

శ్లో॥ ఆజ్ఞా యస్య బలమదాంధ దృష్టిపాతః
తద్వేగం జితమనసం స్వఘాతుకంవా
అజ్ఞాత స్వగత విశేషబంధులోకః
స్వస్థావా త్వపది చచాల భీమసేనః

తా॥ ఎవ్వనియొక్క యాజ్ఞ బలమదాంధుల దృష్టికి గోచరించినంతనే గర్వభంగముగునో యట్టి మనోవేగమును గాంచి తన స్వభావమునుగాని ప్రచండత్వమునుగాని తెలిసికొనుటకు వీలుకానీక తన ప్రయాణ పరిస్థితులు బంధువుల కెవ్వరికిని దెలుపక భీమసేనుండు వెంటనే యచ్చటనుండి కదలినాడు

శ్లో॥ ఏవం వ్యవసితే తస్మిన్ సర్వభూతదయాపరః
సాహాయ్య మనుజే కర్తుం హనుమానైచ్ఛదగ్రజః

శ్లో॥ గచ్ఛత స్తస్య వేగేన భీమ సేన స్య పద్మని
కపీంద్రోఽజగరాకారః క్షణా త్ప్రాదు రభూ త్పురః

తా॥ ఇట్లు భీముండు ప్రయాణమై వెళ్లుచుండగా, సకలజంతువుల యందును దయకలిగి నట్టియు భీముని కన్నగారైనట్టియు శ్రీ హనుమంతుడు తమ్మునకు సహాయమును జేయవలె నని యెంచి యా

భీమసేనుండు వెళ్లు త్రోవలో మిక్కిలి తొందరగా ముందుగా వెళ్లి కొండచిలువవంటి యాకారమును ధరించి యుండెను

శ్లో॥ వాలే నావృత్య పంథానం శివలింగమయాత్మవా
దూరా దత్యధ్వనా క్రాంతః నిశ్వసన్ శ్వసనాత్మజః

తా॥ తన మనస్సునందలి ప్రతియణువు శివలింగమే యనునట్టి ధ్యానముకలవాఁడై దారియంతయును దోకచే నావరింపఁజేసి మిక్కిలి యలసినవాఁడువలెఁ జాలదూరము వినబడునట్లు హనుమంతుఁడు నిట్టూర్పు విడుచుచుండెను

శ్లో॥ తం తథావిధ మాలోక్య నిరుద్ధసరణిం కపిం
భీమో జగాద భీమాత్మా మృగానయనసత్వరః

శ్లో॥ జరత్కా పే సముత్క్షిప్య వాలం చాలయ వర్త్మనః
గంతవ్యంతు మయా క్షిప్రం మితో౽పసర సత్వరం

తా॥ అట్లు త్రోవను అడ్డగించి పరుండిన హనుమంతునిఁజూచి పురుషమృగమును దీసికొని రావలయునని తొందరపడుచున్న భీముండు భయంకరముగు స్వభావము కలవాఁడై యిట్లు పలికెను ఓ ముసలికోతీ! నీవు వెంటనే త్రోవలో నుండి తోకను పైకిఁదీయుము నేను తొందరగా వెళ్ళవలెను నీవు ఇక్కడినుండి వెంటనే తప్పుకొని పొమ్ము

శ్లో॥ మర్కటప్రకృతిం మానం స్థవిరో౽పి న ముంచసి
యద్గంతవ్యపథం కృత్స్నం వాలేనావృత్య తిష్ఠసి.

శ్లో॥ కింతవాస్తి మరౌ దేశే వన్యాహారవివర్జితే
గచ్ఛ సారస్వతం దేశం మధురం సలిలం పిబ

తా॥ నీవు ఎంత ముసలి వాఁడవైననూ నీకోతి స్వభావమును మానినావుకావు నీవు పలువురు నడుచు త్రోవలో దారి అంతయును దోకతో నావరించుకొనియున్నావు అడవి దుంపలుగాని పళ్ళుగాని యేమియును దినుటకు దిండి పదార్థములు దొరకని యీ పెట్ట నేలలో నిర్జల భూమిలో నీకుఁ బనియేమి? లే, మంచి పెఱువులు గల యింకొకచోటికిఁ బొమ్ము, మంచిరుచికల నీరు త్రాగుము

శ్లో॥ భక్షయ్యామ్రఫలా న్యద్య పక్వాని మధురాణ్యపి
ఇతి సంచోద్యమానోఽపి భీమే నావరజేన షః

శ్లో॥ న చచాల తతో దేశా ద్వ్యంజయన్ వృద్ధచేష్టితం
అథాబ్రవీ త్ప్రియం వాక్యం తద్వపత్తివివర్ధకం

శ్లో॥ జిజ్ఞాసు ర్విక్రమంతస్య భీమం భీమాగ్రజః కపిః
రాజన్ జీర్ణశరీరోఽహం వన్యాహారవివర్జితః

తా॥ బాగుగా పండి తయారైనట్టి మంచిరుచి గలిగిన తియ్యని మామిడి పళ్ళు తిను మని తమ్ముఁడగు భీము డెంత చెప్పుచున్నను ముసలి తనమునందలి యశక్తత గనబరచుచు నచ్చటినుండి కదలక భీమునకు ఇబ్బందిలేని రీతిని లతని బలపరాక్రమములు తెలిసికొనవలెనని కోరికతో మిక్కిలి ప్రియముగా నిట్లు పలికెను ఓ రాజా! నేను మిక్కిలి ముసలివాడను, నా శరీరము చాల శిధిలమై యున్నది కదలలేను అడవిలోని యాహారము నాకేమియు దొరకనందువల్ల మిక్కిలి కృశించినాను

శ్లో॥ పిపాసయార్దితో నిత్యం నజానే ప్రదినం పయః
భవాదృశో మహాధన్యో మాసా త్పూర్వ మిహాగతః

శ్లో॥ మహ్యం వితీర్య వన్యాని ఫలాని వివిధానిచ
అశక్తం మాం సముద్ధార్య నిర్యయా వముపా పథా.

తా॥ ప్రతిరోజును దాహముచే బాధపడుచున్నాను మూడురోజుల నుండి నీరు దొరకలేదు ఒకనెలకుఁబూర్వము నీవంటి మహానుభావుఁడొకఁడిక్కడకు వచ్చి అడవిలోనుండి మంచి మంచి రుచికల పళ్ళు చాల తెచ్చి నాకిచ్చి అశక్తుండనగు నన్ను బ్రదికించి ఈ త్రోవనుండియే వెళ్ళినాడు

శ్లో॥ వృద్ధస్యాతురస్య బాలస్య స్త్రీణాంచైవ విశేషతః
హృతభావస్యవై పంథా ఇతి శాస్త్రవిదో విదుః

శ్లో॥ తస్మాయా రాజశార్దూల! జలం దేయం పిపాసతే
పాహి మా మీదృశం దీనం గమిష్యం త్యసవో మమ

తా॥ ముసలివానికిని, బాలునకును, గష్టములోనున్నవానికిని, స్త్రీలకును, మనస్సు చెడిపోయిన వానికిని త్రోవయే యాధారమని శాస్త్రవేత్తలు పలుకుచుందురు అందువల్ల నీ త్రోవలో నున్నాను ఓ రాజసింహమా! నన్ను దాహము బాధించుచున్నది కొంచెము నీరు తెచ్చి పెట్టుము ప్రాణము పోవుచున్నది దీనుఁడను, ఈ స్థితిలో నున్నాను నన్నుఁగనిపెట్టుము

శ్లో॥ పాయయిత్వా పయఃపానం జీవనం చావధార్య మే
తత్కాలేబర ముల్లంఘ్య గచ్ఛ రాజన్ యథోచితం

శ్లో॥ అథవా దీర్ఘ రోమాణం వృథా స్థూలంచ వాలధిం
అంగుష్ఠేన సముత్థాప్య శ్వదీయే నావ్యతః క్షిప.

తా॥ నన్ను నీరు త్రావించితివేని నా జీవము నిలుచును తరువాత నన్ను అవతలకు దప్పించి నీవు వెళ్ళుము లేదా వృధా కష్ట మెందుకు? మిక్కిలి రోమములతో నిండిన యీ పెద్దతోకను నీచేతితో పైకెత్తి అవతలకు వెళ్ళుము

శ్లో॥ యద్వా పుచ్ఛం పరిభ్రామ్య తుచ్ఛం స్వచ్ఛమనా ప్రజ
సరవధా న సముత్థాతుం శక్తః కంఠగతాసుగః

శ్లో॥ అద్యైవ ప్రాణా గచ్ఛంతి మమ త్రాణ మపశ్యతః
కింతు సంస్థాపితం ధైర్యం ధర్మాత్మన్ భవదీక్షయా.

తా॥ లేదా బలములేని యీ తోకను తొలగించి యవతలకు బొమ్ము అన్ని విధములచేతను నేను అశక్తుండనై యున్నాను నా ప్రాణములు కంఠగతములై యున్న యవి అసలు నీవు చూచుచుండగా నిప్పుడే ప్రాణముపోయి యుండవలసినది, నీవు కనబడుటచేత ఓ ధర్మస్వభావుడా కొంత ధైర్యము వచ్చినది

శ్లో॥ సమర్థోఽసి మహారాజ! మయి దీనే దయాం కురు
దీనదుఃఖాసహా స్సంతో నశక్తాహి విమత్సరాః

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచస్తస్య కరుణం కరుణానిధిః
తం వృద్ధం మన్యతే కర్తు మియేష సఫలోదకే ॥

తా॥ ఓ మహారాజా! యీ దీనుడనగు నన్ను రక్షించుటకు నీవు మిక్కిలి సమర్థుడవు. దయయుంచుము. సత్పురుషులు దీనుల యొక్క దుఃఖములను చూచుచు సహించి యుండలేరు భేద భావము గల వారీ పని చేయజాలరు. అని జాలిగా బలుకుచున్న హనుమంతుని

మాటలు విని దయానిధి యగు భీముఁడు ముసలికోతిని జాగ్రత్తగాఁ దీసికొని వెళ్ళి నీరు త్రాగించవలెనని యనుకొన్నాఁడు

శ్లో॥ అస్పృష్ట్వైవ కపి మస్పృశ్యం దండేనోద్ధాటయన్ తతః
స నోత్పాటయితుం శక్తః భగ్నముద్గర విహ్వలః

శ్లో॥ సరణిప్రతిరోధేన దీర్ఘముష్ణం వినిశ్వసన్
ఈప్సితార్థ విలంబేన కృతామర్షో౽ భవ త్కపౌ.

తా॥ కాని, కోతి యగుటవల్ల దీనిని దాకకూడదు కనుక తాకక యొక కర్రతో దానిని కదల్పనెంచి కదల్పలేక మిక్కిలి చలించిన మనస్సు కలవాఁడై, దారికి నడ్డముగా నుండుటచేత మిక్కిలి నిట్టూర్పులు విడుచుచు, దనపని కాటంకము కలిగినదని హనుమంతునియందుఁగోపము కలవాఁడైనాఁడు

శ్లో॥ విలంఘ్య ప్లుతగత్యేమం గచ్ఛేయం విగతక్షమః
అనయిష్యే మృగం మార్గా దితి చక్రే మతి ర్నృపః

శ్లో॥ అథ విజ్ఞాయ సర్వజ్ఞః స్వాత్మలఘునని శ్చయం
మారుతిర్వర్ధయాం చక్రే స్వవాలం స్వకళేబరం.

తా॥ ఇప్పు డిట్టి వట్టి ప్రయాసపడుటవల్ల లాభము లేదు ఇతనిని దాటి పోవుటకుఁబోయి యా పురుషమృగమును తెచ్చుటయే మంచిది అట్లు చేసెదనని యనుకొనుచుండెను సర్వజ్ఞుఁడగు హనుమంతుఁడు తనను దాటి వెళ్ళఁదలచుకొన్న భీముని గుర్తెరింగి తన తోకనూ, తన శరీరమునూ మిక్కిలి పెద్దది యగునట్లు పెంచెను

శ్లో॥ తతో వాలంతు లోకానాం విలంఘయితు మాత్మవాన్
పశ్చాదా క్రమ్య వేగేన ధావతిస్మ నృపాత్మజః

శ్లో॥ దూరా దభ్యాశ మభ్యేత్య దృష్ట్వా ప్వం మశకోపమం
అభ్రంకషకపే రగ్రే లజ్జాన(మ్రముఖో౽ భవత్

తా॥ భీముఁడు తోకను దాటవలెనని నిశ్చయించుకొని వెనుకకు వెళ్ళి పరుగెత్తుకొని వచ్చి యా దారిలో నున్న యాకాశమువఱకుఁ పెరిగి యున్న హనుమంతుని, దోమవలె వానిముందుఁ గనఁబడుచున్న తనను చూచి సిగ్గుచే దలవంచుకొని నిలఁబడి యేమియును తోచక యుండెను

శ్లో॥ అథ ధైర్యం పమాలంబ్య నిశ్చికాయ గలో(ద్రి)యః
ఇమం ప్రదక్షిణీకృత్య సాధయిష్యామి సాధ్వితి

శ్లో॥ అథ ప్రదక్షిణీకర్తుం చరః పవనరంహసా
నలేభే వాలధేః పారం న మూర్ధ్నశ్చ కపే ర్నృపః

శ్లో॥ అథ భీమో గదాం త్యక్త్వా ధిక్కృత్య నిజవిక్రమం
కపయే వృద్ధరూపాయ సాష్టాంగం ప్రణతో౽భవత్

తా॥ పిమ్మట ధైర్యముతెచ్చికొని ఇట్లు తనమనంబున నిశ్చయించుకొని వీనికిఁ బ్రదక్షిణముచేసి పని నెరవేర్చుకొందునని యనుకొని ప్రదక్షిణము చేయుటకుఁబూనుకొని వాయువేగముచేఁ బోవుచు హనుమంతుని తోకయొక్క యంతమును కనుగొనలేక పోయినాఁడు పైకెగిరి హనుమంతుని తలయొక్క యంతమునుకూడఁ గనుగొన లేకపోయినాఁడు పిమ్మట భీముండు తనచేతినుండి గదను గ్రిందఁబడవైచి తనపరాక్రమమును నిందించుకొని ముసలికోతి యగు హనుమంతునకు సాష్టాంగనమస్కారముచేసి క్రింద సాగిలి పడియుండెను

శ్లో॥ అబ్రవీచ్చ కపిశ్రేష్ఠం లజ్జాగద్గదయా గిరా
క్షంతవ్యో మేఽపరాధోఽయం త్వా మవాజానిషం కపిం.

శ్లో॥ నాజానిషం మహాత్మానం విశ్వవ్యాపిన మీశ్వరం
ప్రసీద హిమ్యరూపేణ యేన నిర్వృతి మాప్నుయాం

తా॥ సిగ్గుచే శ్రీ హనుమంతునితో నిట్లు పలికెను ఓహనుత్ప్రభూ! నీవు కపీంద్రుండ వనియు, మహాత్ముండవనియు, విశ్వమునందంతటను నిండియున్న యీశ్వరుండవనియు గుర్తెరుంగఁజాలక యపరాధమును జేసినాను క్షమింపవలయును నాకు మేలు కలుగునట్లుగాఁ బ్రసన్నరూపము గై సేయుము అనుగ్రహింపుము

శ్లో॥ బాలభావేన మే మూఢా బుద్ధి రాసీ దసమ్మతా
మమాగ్రజో మహారాజో యజతే ధర్మనందనః

శ్లో॥ సత్యసంధో వృషస్కంధో నిత్యం ధర్మాభిసంధిమాణ్
తత్ర నానాజనాకీర్ణ భుక్త శాలా విశుద్ధయే

శ్లో॥ పుంప్ర్యాగాహరణం కుర్యాం స్వర్గలోకా దతిప్రభం
తదిదం యది యుక్తం స్యాత్సాహాయ్యం కర్తు మర్హ సి

తా॥ నాకు బాల్యచాపలత్వమ్ము వలన నొకయాలోచన కలిగినది అది సమంజస మయినదిగాఁ గనుపడలేదు

మా అన్నగారు ధర్మనందన మహారాజాగారు. ఆయన సత్యసంధుడు, వృషభముయొక్క మూపురము వంటి మూపురము కలవాఁడు. ఎల్లప్పుడు ధర్మముచేయుట యందే మహాభిలాష కలవాఁడు. ఆయన యొక యజ్ఞమును చేయుచుండెను. ఆ యజ్ఞమునందు బహుజనులు భోజనము

చేయుచుండుట వల్ల భుక్తశాల, యపరిశుద్ధముగా నున్నది నేను ఆ భోజనశాలయొక్క పరిశుద్ధికొఱకు స్వర్గలోకమునుండి మహాతేజస్సుకల పురుషమృగమును దీసికొనివచ్చుటకై పూనుకొన్నాను ఆ ప్రయత్నము తమకు యుక్తముగాఁ గనపడినచో సహాయము చేయుడు

శ్లో॥ నచే వ్మా మనుజానీహి పున ర్గంతుం గృహాంగణం
అథవా పురుష్మృగాదానం ప్రతిజ్ఞాయ వినేచ్ఛయా

శ్లో॥ నాలం పురీం పునర్గంతుం వ్యర్థీకృతమనోరథః
కింతు చేతోగదాం త్యక్త్వా గదా మేనాం వృథాశ్రమాం

శ్లో॥ పశ్యత స్తవ నిర్మోహం గమిష్యా మ్యుత్త రాం దిశం
ఎవ ముక్త్వా మహాభాగో ధర్మరాజానుజో బలీ

శ్లో॥ విరరామ రమానాథం ధ్యాయ౯ హృదయపంకజే.

తా॥ నన్ను అనుగ్రహించనిచో వచ్చిన దారినే తిరిగియింటికి వెళ్ళెదను. అయితే నేను పురుష్మృగమును దీసికొని వత్తునని కోరిక కలిగి నిశ్చయించుకొని వచ్చినాను కోరిక నెరవేరనిచోఁ దిరిగి పట్టణమునకు వెళ్ళలేను అయితే మనస్సునకు మిక్కిలి బాధకరమ్మయి నిష్ప్రయోజన మగు గదచేత నాకు లాభములేదు ఈ గదను విడిచెదను. తమరు చూచుచుండఁగనే విష్కాముఁడనై యుత్తర దిక్కునకు బోయెదనని చెప్పి బలవంతుఁడై నట్టియు, ధర్మరాజునకుఁ బెద్దతమ్ముఁడై నట్టియు, భీముండు శ్రీ విష్ణుమూర్తినిఁ దనమనస్సున ధ్యానము చేయుచు నూరకుండెను

శ్లో॥ ఇతి సకల జగన్మయం కపీంద్రం
ప్రియవచనేన విజోన్ముఖం విధాయ

పురుష మృగనిరీక్షణాయ భీమః
వవది వముత్సుక మానసో బభూవ.

తా॥ ఇట్లు సకల జగత్తునందు నిండియున్న హనుమంతుని మంచి మాటలచేతఁ దనకుఁ బ్రియమొనరించువానిఁ గాఁ జేసికొని భీముండు పురుషమృగమును కనుగొనుటకు మిక్కిలి సంతోషించు చుండెను

శ్రీ పరాశరః

శ్లో॥ అథాఽబ్రవీ త్కపిశ్రేష్ఠో భీమం భీమపరాక్రమం
సౌమ్యరూపం సమాస్థాయ ప్రహసన్ముఖపంకజః

శ్లో॥ విద్ధి మా మంజనాపుత్రం హనుమంత మితి శ్రుతం
వాయుపుత్రతయా చాహం భ్రాతా తే నృపనందన।

శ్లో॥ ఇదం తే సాహసంజ్ఞాత్వా పుంమృగాదాన గోచరం
అహ మానం సమాసీనో భ్రాతృ స్నే హేన విక్లబః

తా॥ పిమ్మట హనుమంతుఁడు భయంకరమగు పరాక్రమము కలిగిన భీమునితోఁ దాను సౌమ్యరూపమును బొంది నవ్వుచున్న తామరపూవు వంటి ముఖముకలవాడై యిట్లనెను ఓయి భీమసేనరాజా! నేను అంజనాదేవి కుమారుండనగు హనుమంతుఁడను నీవును నేనును వాయుదేవుని పుత్త్రుల మగుటవలన నేను నీకు సోదరుఁడను కావున నీవు పురుష మృగమును దీసికొని వచ్చుటకు సాహసము చేసితివని తెలిసికొని సోదర ప్రేమచే నిట్లు వచ్చినాను.

శ్లో॥ జితచేతోజవ శ్శూరః పుంమృగః పురుషాశనః
క్షణాత్పరార్థ మధ్వాన మగచ్ఛ త్స్వాంత పూర్వగః

శ్లో॥ కోవాగ్రత స్తస్య తిష్ఠ న్మర్త్యో వా దానవోపివా
ధృతః ప్రాణవియోగాలే స నస్యా దితి మేమతిః

తా॥ ఓయీ! సోదరా! వినుము ఆ పురుషమృగము మనోవేగమును మించిన వేగముకలది మంచి శౌర్యము కలది మనుష్యులను భక్షించుచుండును. ఒక్కక్షణములో లక్షలకొలది యోజనములుకల మార్గమును తా ననుకొనకమునుపే వెళ్లుచుండును ఆ పురుషమృగము యొక్క ముందు మనుష్యులుగాని రాక్షసులుగాని మరెవ్వరును నిలువలేరు నిలిచినచో వెంటనే ప్రాణముల కాశ వదులుకో వలసినదియే సుమా! ఇది నా మనస్సులోఁ గలిగిన యభిప్రాయము

శ్లో॥ తాదృశం మృగమాచేతు మీదృశస్త్వం కథంక్షమః
అగృహీత్వా మహాశూరం పుంమృగం పురుషాశనం

శ్లో॥ నరోచతే పునర్యానం మద్భ్రాతు ర్భీమసేన ! తే
కింతు యోగం తమాదాతు ముప దేక్ష్యామితేఽనుజ!

తా॥ అటువంటి మహాశూరమగు పురుషమృగమును ఇటువంటి నీవెట్లు తీసికొని రాఁగలవు. నీవు పురుషమృగమును వెంటదీసికొనక తిరిగి వెళ్ళుట ఓ భీమసేనా! నాకు దమ్ముఁడ వగు నీకు మంచిది కాదు అయితే దానినిఁదీసికొని వచ్చుటకు వీలుగా మార్గమును నీకుఁ దెలియఁజేసెదను. వినుము

శ్లో॥ స పుంమృగో శుభాచారః శివపూజా పరాయణః
ప్రాణవ్యయేఽపి పురతః సంప్రాప్తే నజహాతి శివార్చనం

శ్లో॥ తత్రాపి పురతః పశ్యే చ్ఛివలింగం శుభాలయం
త న్న సంపూజ్య పూజార్థం పద మేకం నగచ్ఛతి

తా॥ ఆ పురుషమృగము శుభాచారములు కలది శివపూజ చేయుటయందు మిక్కిలి ఆసక్తి కలది ప్రాణము పోవునంతటి విపత్తు వచ్చినను శివపూజ మానదు. మఱియునెట్టి సమయమునందైనను శివలింగముగాని శివాలయముగాని యెదుట గనిపించెనేని ఆ శివలింగమును పూజింపక యొక్క యడుగైనను కదలదు

శ్లో॥ మమ వాలాగ్ర రోమాణి పథి క్షిప్తాని భాగశః
తదాలయ సమం ప్రోక్తం శివలింగం విచక్షణం.

శ్లో॥ అత స్త్వద్గతి విఘ్నోఽయం శివలింగమయాచి మే
గృహాణ వాల రోమాణి సమగ్రాణి నృపోత్తమ!

తా॥ నా తోకయందలి రోమములు అక్కడక్కడ మార్గములో నున్నవి అవి శివాలయమునకూ, శివలింగమునకూ సమాధారములైనవి ఇవి శివలింగ స్వరూపములు ఓ భీమరాజా! ఈ రోమములవల్ల పురుష మృగమునకు నడచుటకు వీలుండదు అందువల్ల వాల రోమములు సంపూర్ణముగా వలయునన్ని తీసికొనుము

శ్లో॥ గృహీత్వేమాని రోమాణి గచ్ఛ తస్యాంతికం ద్రుతం
తం ప్రార్థయ మృగన్యాయా దవధారయ తద్వచః

శ్లో॥ తతో గృహీతపంకేతో గచ్ఛన్ వేగేన తత్పురః
ఏకైకంతు పృథక్కృత్య రోమాణి వినిపాతయ.

తా॥ ఈ రోమములు తీసికొని యా పురుషమృగము దగ్గరకు వెంటనే పొమ్ము దానిని బ్రార్థించుము. మృగభాష ననుసరించి దాని యభిప్రాయమును దెలిసికొని స్థిరచిత్తుడవై యుండుము తరువాత

దానిని బిలచి దాని ముందు నిలిచి సరియగు గుర్తులను దెలిసికొని నడచుచూ వేగముగా నీ రోమములయం దొక్కొక్క రోమమును తీసికొని దానిముందు వేయచుండుము

శ్లో॥ ఏవం సుధర్మా మారభ్య భుక్తశాలావధే ర్ద్రుతం
కర్తవ్య మప్రమాదేన పురతోధావత స్త్వయా.

శ్లో॥ ఏకైకరోమవిన్యాసా ద్యదా లింగోద్భవో భవేత్
తదాతిక్రాంతవర్మానం వ త్వా మభీభవిష్యతి.

తా॥ ఇట్లు దేవేంద్రుని సభయగు సుధర్మ మొదలుకొని ధర్మరాజు యొక్క యజ్ఞశాలయందలి భుక్తశాల వఱకు ముందుబరుగెత్తుకొని పోవుచు నొక్కొక్క రోమమును దానిముందు వేయుచు నప్రమత్తుడవై పోవుచుండుము నీవు ఒక రోమమును వేసినచో నొక శివాలయము కలుగును అది యా శివలింగమునకు బూజ చేయవలసి యుండుటవల్ల నిన్ను సమీపించలేరు

శ్లో॥ ఏవం మదుక్తియోగేన కర్తవ్యం జయమిచ్ఛతా
తవ లభ్యో మృగశ్రేష్ఠనస్యాత్తవ పరాజయః

శ్లో॥ ఇత్యాదిశ్య హితం తస్మై హనుమా నుష్ట్రవాహనః
నిజవాలాగ్ర రోమాణి ప్రదదౌ ముష్టి మాత్రతః.

తా॥ ఇట్లు నేను చెప్పిన రీతిని నీవు చేసితివేని జయమును కోరుకొనుచున్న నీకు ఆ పురుషమృగము లభ్యమగును నీకు పరాజయము కలుగదు అని హనుమంతుడు ఉష్ట్ర వాహనమువనుండి యుపదేశించి భీమసేనునకుం దన తోకయందలి రోమములను ఒక గుప్పెడు ఇచ్చెను

శ్లో॥ భీమో వృపాయలాభేన పరమానంద నిర్భరః
స్తోత్రేణ మహతాస్తుత్వా భ్రాతరం కపి మబ్రవీత్

శ్లో॥ హనుమన్మూర్తిరూపాణి స్థూల సూక్ష్మ సమాని తే
అత్యద్భుతాని లోకేషు సంతీతి బహుధా శ్రుతం

శ్లో॥ తాని దర్శయ సర్వాణి మహ్యం జిజ్ఞాసవే ప్రభో!
ఇతి తద్భ్రాతృవాదం శ్రుత్వా ప్రత్యువాచ కపీశ్వరః

తా॥ భీముఁడును తనకు మంచి యుపాయము కలుగుటచే పరమానందభరితుఁడై హనుమంతుని మిక్కిలి పొగడి స్తోత్రముచేసి యిట్లు పలికెను ఓ హనుమత్ప్రభూ! నీయొక్క యాకారములు స్థూల రూపములు గాని సూక్ష్మరూపములు గాని చాల విచిత్రకరములు గలవి అనేకము లున్నవని చెప్పుచుండఁగా నేను విన్నాను నాకు నీ స్వరూపములు చూడవలెనని కోరికయున్నది వాటి నన్నింటిని నాకుఁ జూపింపుమని ప్రార్థించగా హనుమంతుఁడు తిరిగి యిట్లు చెప్పెను

శ్లో॥ సన్తి రూపా ణ్యనేకాని స్థూల సూక్ష్మ సమాని మే
కిన్తు తాని విశేషేణ దర్శనీయాని నాధునా.

శ్లో॥ సామాన్యేన ప్రవక్ష్యామి తల్లింగాని విబోధయ
యేన రూపేణ మే రాజన్ లాలితా జనకాత్మజా

శ్లో॥ తాదృశం విద్ధి రూపం త్వం సూక్ష్మం సూక్ష్మతరం మమ.

తా॥ ఓ భీమసేనా! నా యొక్క రూపములు స్థూలములు సూక్ష్మములు అనేకము లున్నవి వాని భేదము లిప్పుడు చూపించుటకు వీలులేదు, వాని గుర్తులను మాత్రము చెప్పెదను వినుము నేను ఏ రూపముతో సీతాదేవికి సంతోషమును కలిగించితినో అది సూక్ష్మముకంటెను

మిక్కిలి సూక్ష్మమగు రూపము

శ్లో॥ యాదృశం రూప మాలంబ్య లోకానుగ్రహకారణాత్
అవష్టభ్య పదద్వంద్వ ముదయాస్తాద్రిమూర్ధని

శ్లో॥ అధీతా స్సకలావేదా స్సాంగా స్సవితృసన్నిధౌ
తాదృశం మధ్యమం రూపం మామకం విద్ధి పార్థివ!

తా॥ లోకానుగ్రహమువల్ల నే నే రూపమును బొంది సూర్యోదయ పర్వతము మీదను సూర్యాస్తమయ పర్వతము మీదను పాదములుంచి సూర్యుని సన్నిధానమున అన్ని వేదములును అన్ని వేదాంగములునూ నేర్చినానో అది మధ్యమ మగు నా రూపమని తెలిసికొనుము

శ్లో॥ అపరం మధ్యమం చాస్తి రూపం రూపవతాంవరం
యస్య వాలమయం కృత్వా సేతుం సప్తార్ణవోపరి

శ్లో॥ శతాననమహాదైత్యో బాధితో రామభార్యయా
ఏవ మాదిని రూపాణి మధ్యమాని విబోధయ ।

తా॥ ఇంకొక మధ్యమ రూపమున్నది నేను ఏ రూపముచేత నా లోకలో సప్తార్ణవములకూ సేతువును నిరూపించి శతకంఘ రావణాసురుని జయించినాననో అదియును మధ్యమరూపమే ఇట్టి మధ్యమరూపములు చాల కలవు తెలిసికొనుము

శ్లో॥ యచ్చ విశ్వమయం రూపం విశ్వతోముఖ మద్భుతం
జానక్యై దర్శనం సాక్షాత్ స్థూలం తద్విద్ధి మామకం..

శ్లో॥ తత్తత్కార్యమరోధేన తత్తత్కాలానుసారతః
దర్శనీయాని రూపాణి నచ సర్వత్ర సర్వదా.

తా॥ ఏ రూపముచే సీతాదేవికి నమ్మకము కలిగించితివో, విశ్వము నందంతటను నిండియున్న ఆరూపము సీతాదేవికి నమ్మకము కలిగించుటకుఁగాను చూపింపఁబడినది. అది స్థూల రూపమని చెప్పఁబడును ఆ యా కాలముల ననుసరించి యా యా కార్యములనుబట్టి చాల రూపపములకై కొనఁబడినవి అవి యెల్లప్పుడునూ అంతటను చూపించుటకు వీలులేదు

శ్లో॥ ఇదానీం యది రూపాణి దర్శితానిచ తేఽధునా
భీతోస్తి భవతాత్ సద్యః పీడాచ జగతో భవేత్

శ్లో॥ తథాపి సూక్ష్మరూపం మే దర్శయిష్యామి పాండవ
ఇత్యబ్రువన్నయం సద్యః నీవారాగ్రసమోఽభవత్

తా॥ ఆ రూపములు ఒకవేళ నేను చూపించిన యెడల నీకు మిక్కిలి భయము కలుగును లోకములకు బాధ కలుగును అయిననూ నా యొక్క సూక్ష్మరూపమును నీకుఁ జూపించెదను అని చెప్పుచు నీవారధాన్యము మొక్క యొక్క చివరంత చిన్న రూపును ధరించెను

శ్లో॥ దృష్ట్వా సూక్ష్మతనుం దేవం భీమో విస్మయ మాయయౌ
తావద్రూపాంజనాపుత్రో రూపాంతర మగా న్మహాత్

శ్లో॥ దశయోజనవిస్తీర్ణం త్రింశద్యోజన మాయతం
తేనైవ రూపభేదేన తీర్థోహి సరితాం పతిః

శ్లో॥ తద్రూపదర్శనా త్సద్యో భీమసేనో ముమూర్ఛ హ
తదా తం మూర్ఛితం దృష్ట్వా హనుమాఞ్ భ్రాతృవత్సలః

శ్లో॥ మాభైషీ రిత్యథాభాష్య పాణినా సమతాడయత్

తా॥ ఆ రూపమును జూచి భీమసేనుండు మిక్కిలి ఆశ్చర్యమును పొందెను అంతలోనే శ్రీ హనుమంతుఁడు పది యోజనములు విస్తీర్ణమును ముప్పది యోజనములు వైశాల్యముకల మిక్కిలి గొప్ప యాకారము కలవాఁడై యుండెను ఆ రూపముచేతనే సముద్రమును దాటెను ఆ మహారూపమును చూచి భీమసేనుండు వెంటనే మూర్ఛనందెను అప్పుడు శ్రీ హనుమంతుఁడు తమ్మునిఁ జూచి సోదర ప్రేమకలవాఁడు కనుక భీమసేనుని దేహము చేతితో నిమిరెను భయపడకు మని యోదార్చెను

శ్లో॥ తత్పాణిస్పర్శమాత్రేణ సుప్తోత్థిత ఇవాధ్వని
సంజ్ఞాం లేభే విసంజ్ఞోఽపి ధర్మరాజానుజ స్తదా ।

శ్లో॥ తుష్టావ బహుభి స్తోత్రై రప్రమే యం కపీశ్వరం
ప్రదక్షిణనమస్కారాన్ పంచసంఖ్యాన్ చకార సః

శ్లో॥ హనుమా నపి సర్వాత్మా హిత మాదిశ్య బంధవే
అంతర్దధే దయాసింధు ర్భీమసేనస్య పశ్యతః

తా॥ హనుమంతుని కరస్పర్శము చేత నిద్రించినవాఁడు మేలుకొనినట్లు సంజ్ఞలేక పడియుండియును భీమసేనుండు వెంటనే మేలుకొన్నాఁడు అంత భీముఁడు హనుమంతుని ననేక విధములుగా స్తోత్రముచేసి సంతోష పెట్టినాఁడు పంచముఖాంజనేయస్వామి వారికి అయిదు చొప్పున నమస్కారములు చేసినాడు హనుమంతుఁడు భీమునకు హితవాక్యమును బోధించి యతఁడు చూచుచుండఁగనే వెంటనే అంతర్ధానము నొందినాడు

శ్లో॥ రాజాపి విస్మయావిష్ట హృదయస్త్వతద్వచః
వానరోమాణి సంగృహ్య ప్రవిష్టో దేవతాసభాం.

శ్లో॥ తత్రాపశ్య న్నృగశ్రేష్ఠం మధర్మామధ్యవర్తినం
నవామ దండవత్తస్య కుశలప్రశ్న పూర్వకం.

తా॥ భీముఁడును మిక్కిలి ఆశ్చర్యమునొంది యా హనుమంతుడు చెప్పిన మాటలు మనస్సునం దుంచుకొని శ్రీ హనుమంతుని వాలరోమములు పుచ్చుకొని దేవతాసభయగు సుధర్మసభకు వెళ్ళి యా సుధర్మయొక్క మధ్యలోనున్న పురుష మృగమును సందర్శించి కుశలంబడిగి ప్రదక్షిణము చేసి దండమువలె సాగిలబడి యుండెను

శ్లో॥ తతో విజ్ఞాపయామాస మృగాయ స్వప్రయోజనం
అహం పాండుసుతో భీమః దేవరాజాత్మజాగ్రజః

శ్లో॥ మదగ్రజో మహారాజో ధర్మరాజో జితేంద్రియః
యజతే రాజసూయేన ధర్మసూనుర్హి ధర్మవిత్

తా॥ పిమ్మట పురుషమృగమునకు తన సంగతి విన్నవించుకొనెను, దేవేంద్రుని కుమారుండగు నర్జునునకు నే నగ్రజుండను, పాండురాజు యొక్క కుమారుండను భీముండ నువాఁడను నా యన్నగారు మహారాజయిన యుధిష్ఠిరుడు యమధర్మరాజునకుఁ గుమారుండు, సకల ధర్మములు తెలిసినవాఁడు, ఆ మహామహుండు రాజసూయ యజ్ఞము చేయుచున్నాఁడు

శ్లో॥ తత్ర పుణ్యే మహాసత్త్రే భుక్తశాలాభిశుద్ధయే
త్వ మాగచ్ఛ మృగశ్రేష్ఠ ! పవిత్రీకృతవిష్టప!

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచ స్తస్య పుంమృగో హృష్టమానసః
జగామ వచనం తస్య బుభుత్సుః హృదయం బుధః

తా॥ మిక్కిలి పవిత్రముగునట్టి యీ మహాయజ్ఞమునందు భోజనశాల యొక్క పరిశుద్ధికొఱకు నిన్నుఁ దీసికొని పోవుటకువచ్చినాను నీవు మూడు లోకములను పవిత్రములనుగా జేయఁగలదానవు ఓ పురుషమృగమా! రమ్ము అని చెప్పిన భీమసేనుని మాటలు విని పురుష మృగము సంతసించి తెలివిగలిగిన యా మృగరాజము భీముని మనంబు తెలియఁగోరి యిట్లుపలికెను

శ్లో॥ రాజ్ఞః ప్రీతోఽస్మి భద్రంతే యత్త్వయా సాధుభాషితం
కింత్వహం పురుషాహారః పరుషాక్షరభాషణః

శ్లో॥ సంగచ్ఛేయం యదామార్గే పురద్వారావధే స్స్వయం
తదా త్వాం భక్షయిష్యేఽహం తత్ర సాక్షీ మహాజనః

తా॥ ఓ భీమసేనా! నీవు చక్కఁగాఁ జెప్పిన మాటలువిని సంతసించినాను నీకు మేలు కలుగును అయితే నేను మనుష్యులను తినెదను కఠినము లగు మాటలు మాటలాడుదును బూతులు తిట్టుదును నా త్రోవలో మీపట్టణము వెళ్లువఱకు నాకు ముందు నడచుచు నాకు అందకుండ నుండవలె, లేనిచో నిన్నుఁగూడ భక్షింతును, అక్కడ ప్రజలు అందఱును చూచుచుందురు

శ్లో॥ కృత్వా మాం పృష్ఠతో దూరం యచ్ఛే న్మమ పురస్సర
అపక్రాయ తదా మహ్యం కుతః పురుషభోజనం

శ్లో॥ ఇతి వ్రమత మాచేర్య పుంమృగ శ్శివభక్తిమా-
పురోగచ్ఛేతి రాజాన మాజ్ఞప్యచ స్వయంగతః

తా॥ నన్ను చాల దూరములో వెనుకనుంచి ముందు నీవు నడుచు చుండిన యెడల నాకు పురుష భోజన మెట్లు దొరుకును అని తాన

మనములోని సంగతులు భీమునకుఁజెప్పి యతనిని ముందు నడువుమని చెప్పి శివ భక్తిచే నిండియుండు పురుషమృగము భీముని వెంట వెళ్ళుచుండెను

శ్లో॥ కృత్వా మాం పృష్ఠతో దూరం యచ్ఛ్వమ పురష్సర
వాలరోమనిపాతేన వంచయామాస కించన.

శ్లో॥ తదా ప్రాదురభూ ల్లింగం శైవం లోమనిపాతనాత్
తదద్భుతోద్భవం దృష్ట్వా శివభక్తాగ్రణీః మృగః

శ్లో॥ పూజయామాస పుష్పైస్తై రభిషేచన పూర్వకం
తావదేవ మహాసత్త్వో భీమో భీమపరాక్రమః

శ్లో॥ దూర మధ్వాన మత్యర్థం వ్యతిచక్రామ స క్రమాత్
తతస్సమాప్య విధివత్ శివపూజాం స పుంమృగః

శ్లో॥ అగ్రయాయిన మగ్రణ్యం క్షణాదే వాన్వ పద్యత
తావ దేవ పునర్భీమః పాతయన్ రోమవాలజం

తా॥ అప్పుడు తదేక ధ్యానము గలవాఁడై భీముండు తాను తీసుకొని వచ్చిన హనుమంతుని వాలరోమములచే నొక్కింత మోసము చేయుచుండెను ఒక రోమమును క్రింద వేసిన వెంటనే శివలింగ ముద్భవించినది ఆ చిత్రమును జూచి శివభక్తులలో ముఖ్యమయినట్టి పురుషమృగము పత్రి, పూలుతెచ్చి ముందుగా నా లింగమున కభిషేకము చేసి పూజించుచుండెను ఇంతలో మహాశక్తి గలిగినట్టియు, మంచి బలపరాక్రమములు కలిగినట్టియు భీముండు, మిక్కిలి యెక్కువ దూరము నడచిపోవుచుండెను, పిమ్మట యథావిధిగా నా పుంమృగము శివపూజ సమగ్రముగాఁ జేసికొని సమాప్తిని పొందించి చాలా దూరములో

ముందు నడచుచున్న భీముని నొక్క క్షణములో వెంబడించెను అంతలో తిరిగి భీముఁడు హనుమంతుని వాలము నందలి యొక రోమమును క్రింద వైచెను

శ్లో॥ శివలింగ విధానేన స చ వ్యవహితో మృగః
ఏవం వికీర్య రోమాణి ప్రత్యేకంచ పృథక్పృథక్

శ్లో॥ రిక్తవాలజవో హ్యాసీత్ పురద్వారం వివేశ సః

తా॥ అంతట శివలింగము పుట్టినది అది శివపూజ విధి ప్రకారము చేసెను ఇట్లు రోమములు వేయుచుండుటయును శివలింగములు వుద్భవించుచుండుటయును పురుషమృగము ఆ శివలింగములకు యథావిధిగఁబూజ చేయుచుండుటయును జరుగుచుండుటవల్ల పురుషమృగము భీముని సమీపింపలేక పోయినది తుదకు హనుమంతుని వాలమునందలి రోమములు లయిపోయినవి భీముని జవసత్త్వములు కూడ మిక్కిలి తగ్గినవి అట్టి స్థితిలో భీముండు పురద్వారములోఁ బ్రవేశించినాఁడు

శ్లో॥ బహిర్న్యస్తైకపాదాగ్ర మంతర్విన్యస్తదక్షిణం
జగృహే పుంమృగో భీమం సమాపితశివార్చనః

శ్లో॥ అథాబ్రవీ న్మృగం భీమః తద్గ్రీ హాత్యంతకాతరః
ఇద మవ్యాయ్య మన్యాయ్యం విద్వాన్ మాచర సాహసం

శ్లో॥ యస్త్వ ముల్లంఘ్య సమయ మగ్రహీ ర్మాం గృహాంతరే
ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య సత్యవాక్యోర్జితస్య తే

శ్లో॥ అధర్మే యది బుద్ధి స్స్యాదితరేషాంతు కాకథా
ఇత్యుక్తవంతం రాజానం జగాద మృగసత్తమః.

తా॥ లోపలను కుడికాలినుంచి వెలుపల ఎడమ పాదము యొక్క బొటనవ్రేలు నుంచిన భీముని వెంటనే పురుష మృగము శివార్చనమును సమాప్తి చేసికొని వచ్చి పట్టుకొనగా భీముడు మిక్కిలి భయమును పొంది ఇట్లు పలికెను ఓ పురుషమృగమా! ఓ విద్వాంసుఁడా! నీవు నాయెడ మిక్కిలి యన్యాయము చేసినావు నన్నుఁ బట్టుకొనుట యన్యాయము తొందరపడకుము నీవు చేసిన నియమమును విడిచి నన్నుఁబట్టుకొంటివి నీవన్న మాట తప్పితివి ధర్మము లన్నింటిని నేర్చినవాఁడవు ఉపకారములు జ్ఞాపకముంచుకొనుచుండువాఁడవు సత్య వాక్యమునందు మిక్కిలి ప్రసిద్ధి కాంచినవాఁడవు ఇట్టి యోగ్యుండవును మహాత్ముండవును నగు నీకే అధర్మమునందు బుద్ధి కలిగిన యెడల నితరుల విషయములో నేమి చెప్పవలెనని యనుచున్న భీమరాజును చూచి పురుష మృగమిట్లు పలికెను

శ్లో॥ త్వద్భ్రాతా ధర్మరాజేన ధర్మజ్ఞేన యదుచ్యతే
తదేవ నౌ మహాధర్మ్యం వివాదో న భవేత్తతః

శ్లో॥ ఏవం సంవేద్య వృత్తాంతం ధర్మరాజాయ ధీమతే
శ్రావయాంచక్రతు స్సమ్యక్ మృగభీమౌ యథాక్రమం.

తా॥ నీ అన్నగారు మిక్కిలి ధర్మాత్ములు బుద్ధిమంతులు, వారేదీ నిర్ణయించి చెప్పుదురో అదియే ధర్మము మనకు వివాదములో పనిలేదు అనెను పిమ్మట ధర్మరాజునకు పురుషమృగమును భీముండును జరిగిన వృత్తాంతమంతయును యథాక్రమముగా నున్నది యున్నట్లు తెలియఁజేసినారు

శ్లో॥ తచ్ఛ్రుత్వా సకలం వృత్తం ధర్మజ్ఞో ధర్మనందనః
విస్మయానందపూర్ణాంత ర్వభాషే ధర్మపాలకః

శ్లో॥ మృగోత్తమః మహాప్రాజ్ఞ! నాధర్మ స్తవ విద్యతే
కిం త్వయం పృథుకో భీమో యేనాదౌ ద్వార మావిశత్

శ్లో॥ తం విహాయార్ధకాయం త్వం శేషం భక్షయ పుంమృగ।
ఇత్యుక్తవచనం త్యక్త్వా పక్షపాతం యుధిష్ఠిరం

శ్లో॥ మృగ స్సంప్రీణయాంచక్రే నిర్దుష్టగుణవర్ణనైః

తా॥ ధర్మమును పరిపాలించునట్టి ధర్మరాజు, సకల వృత్తాంతము దెలిసికొని మహాశ్చర్యమును మహానందమును పొంది పురుషమృగమును చూచి, యో మృగరాజా! ఓ మహా బుద్ధిమంతుఁడా! నీవు చెప్పిన వాక్యములో ఎంతమాత్రమును నధర్మములేదు. అయితే యీ కుఱ్ఱవాడు ముందుగాఁ బురమును బ్రవేశించి నాఁడు కావున అట్లు ముందుఁజేరిన భీముని శరీర భాగమును మాత్రము వదలి మిగిలిన శరీరమును భక్షింపుమనెను. పక్షపాత మొక్కింతయును లేక ధర్మప్రకారము మాటలాడినట్టి ధర్మరాజును జూచి పురుషమృగము సంతోషించి యీ ధర్మరాజును మంచి వాక్యములతో వాని సద్గుణములు వాని ధర్మమును పొగడెను

శ్లో॥ తతః ప్రీతమనా భూయః నృపధర్మేణ పుంమృగః
భుక్తశాలాః పృథాసూనోః శోధయామాస సంచరన్.

శ్లో॥ ఆంజనేయ కృపయాత్తపౌరుషం
భీమమార్యచరితం యుధిష్ఠిరః
తం ప్రశస్య పురతో మహీభుజాం
యజ్ఞశేష మనయ న్మునీశ్వర।

తా॥ పిమ్మట ధర్మరాజు మిక్కిలి సంతోషించెను, పురుషమృగము ధర్మప్రకారము ధర్మరాజుయొక్క రాజసూయ యాగమునందలి

భోజనశాల లన్నియును దిరిగిచూచి పరిశుభ్రమయిన వానినిగాంచెను తరువాత ధర్మరాజు శ్రీ హనుమంతుని దయచేత మిక్కిలి ప్రఖ్యాతమయిన పనులు చేసి మాహాత్తరచరిత్రమును గాంచిన తన పెద్ద సోదరుండగు భీముని రాజనమూహమునందు మిక్కిలి ప్రశంసించి, యో మైత్రేయమునీంద్రా! మిగిలిన యజ్ఞకార్యమును మహానందముతోను సక్రమముగాను యధావిధిగా సంపూర్తిని పొందించెను

## శ్రీ హనుమత్పూజవలననే సర్వదేవతా పూజాఫలము కలుగు ననుటకు ప్రమాణ వచనములు

అయితే సుందరకాండ మహామంత్ర మనిరికదా! ఆ మంత్రము నెట్లు, ఏ సంకల్పవిధానమున, ఎటువంటి సంపుటితో పఠింపవలయునని అడుగవచ్చును అధికారిభేదము, శక్తిభేదము అనువానినిబట్టి ఎవరెవరు ఏయే విధానముల ఈ కాండ పారాయణ ఫలమును పొందవచ్చునో అదియంతయు సమగ్రముగా సర్వ విధానములు ముందు ముందు యీ గ్రంధము నందు చూడగలరు ముఖ్యముగా సుందరకాండమువైపు ప్రజల దృష్టిని మరలించుటయే యీ ప్రసంగమునకు పరమార్థము

## పరాశర సంహిత

మైత్రేయులకు పరాశరుడు చెప్పుట :

శ్లో॥ మైత్రేయ జపతాం నిత్యం మంత్ర మేకం హనూమతః ।
సప్త కోటి మహామంత్రా స్సిధ్యంత్యేవ న సంశయః ॥
ఆరాధితే కపిశ్రేష్ఠే సమస్తా అపి దేవతాః ।
భవంతి సతతం తుష్టాః సర్వదేవాత్మకో హి సః ॥

**యేనకేనా ప్యుపాయేన హనుమత్పూజనై ర్విభః ।**
**దివసం సఫలం కుర్యాత్ స్తోత్రైర్వా వందనై రపి ।**

తా॥ హనుమన్మంత్రము నొక్కటి నిత్యము జపించుటచే సప్త కోటి మహామంత్ర సిద్ధి కలుగును కపివరుని ఆరాధనచే, సర్వదేవతారాధన ఫలము కలుగును ఆయన సర్వదేవతా స్వరూపుడు కాన సర్వ దేవతలు తుష్టులగుదురు కాన హనుమత్పూజనము స్తోత్రము వందనములచె ప్రతిదినము సఫలము

**పరాశరః :**

**శ్లో॥ అన్య్రద్రహస్యం వక్ష్యామి కథాం పాపప్రణాశినీం**
**సావధానమనా భూత్వా శృణుష్వ మునిపుంగవ ।**

ఓ మైత్రేయ మహర్షీ! సర్వపాప ప్రణాశనకర మగు ఒక రహస్యమగు కథను చెప్పెదను వినుము॥

**శ్లో॥ రాక్షసైః పీడితా దేవా బ్రహ్మాణం శరణం యయుః ।**
**బాధంతే రాక్షసా నిత్యం బ్రహ్మ న్లోకా నృషీంశ్చ నః ।**

తా॥ ఓ మైత్రేయా! రాక్షసులు దేవతలనున్ను, ఋషీశ్వరులనున్ను, లోకమునున్నూ అనేకవిధముల బాధించుచుండ దేవతలందరు ఆ బాధను సహింపజాలక బ్రహ్మను చూచి -

**శ్లో॥ తేషాం కురు వధోపాయం త్వం హి నః పరమాగతిః ।**
**ఇత్యుక్తః ప్రాహ తా న్దేవాన్ మయా న జ్ఞాయతే వధః ।**

తా॥ ఓ బ్రహ్మ దేవుడా! ఆ దుర్మార్గులను వధించు మార్గమును మాకు చెప్పవలసినది నీ కన్న మాకు వేరు శరణ్యము లేదని చెప్పగా విని ఆ రాక్షసుల నాశనము చేయుట నా వలనకాదు

శ్లో॥ శంకరం పరిపృచ్ఛామో గచ్ఛామో రజతాచలం।
తత్ర గత్వా మహాదేవ మూచుస్తే సహితామహాః
రాక్షసానాం వధోపాయం కురు రుద్ర మహాప్రభో ॥

తా॥ మనమందరము రజతాద్రి కరిగి ఈశ్వరునకు విన్నవించుకొందాము రండని చెప్పి బ్రహ్మదేవుడు వారల దోడ్కొని పోగా అచ్చట రాక్షస వధోపాయమును చెప్పుమని దేవతలు శంకరుని ప్రార్థించిరి

శంకర ఉవాచ :

శ్లో॥ నర నారాయణం దేవం మార్తానాం చ పరాయణం।
తిష్ఠంతం పరమక్షేత్రే నిత్యం బదరికాశ్రమే ।
తం పృచ్ఛామః సురశ్రేష్ఠ గచ్ఛామ సత్ర మా చిరమ్ ॥

తా॥ ఓ బ్రహ్మాది దేవతలారా! ఆర్తత్రాణ పరాయణుండగు నరనారాయణుండు బదరికాశ్రమమున కలడు మన మందరము కలసి అచ్చటికి వెళ్ళి ఏతద్వృత్తాంతమును విన్నవించుకొందాము రండు ఆలస్యము చేయకుడని పలికెను

శ్లో॥ బ్రహ్మేశాదిసురా స్సర్వే నరనారాయణం ప్రభుం।
నమస్కృత్య జగన్నాధం పప్రుచ్ఛు రిద మాదరాత్ ।

తా॥ బ్రహ్మాది సురులందరున్నూ ఈశ్వర సహితముగా బదరికాశ్రమము చేరి జగన్నాధునకు నమస్కరించి ఇట్లు విన్నవించుకొనిరి

శ్లో॥ బాధంతే రాక్షసా నిత్యం నరనారాయణ ప్రభో ।
ఏతేషాం తు వధోపాయం క్షిప్రం కర్తు మిహార్హసి ।

తా॥ ఓ నరనారాయణమూర్తీ! రాక్షసుల బాధలు సహింపలేకయుంటిమి, ఆర్తులగు మమ్ము కటాక్షించి రాక్షసనాశనము చేయు

ఉపాయమును శీఘ్రముగా చెప్పవలసినది

శ్లో॥ స ముహూర్త మివ ధ్యాత్వా ప్రోవాచ సకలాన్ సురాన్
భవిష్యతి న సందేహో రాక్షసానాం వధ స్సురాః।

తా॥ అట్లు మొరలిడిన దేవతల వాక్యములను విని నర నారాయణమూర్తి ఒక క్షణకాలం ఆలోచించి, ఓ దేవతలారా! తప్పక రాక్షస నాశనము కాగలదు భయములేదని వారించి,

శ్లో॥ ఇత్యుక్త్వా హ్యాత్మన స్తేజ స్సమాకృష్య జనార్దనః।
బ్రహ్మణశ్చ సురాణాం చ తేజసా సాక మీశితుః।

తా॥ తనయొక్క తేజస్సును, బ్రహ్మ మొదలైన దేవతల యొక్కయు, ఈశ్వరుని యొక్కయు తేజస్సులను సంగ్రహించి నలువంటివాడై,

శ్లో॥ పిండీకృత్య దదౌ రుద్రం పపౌ సర్వామరాత్మకమ్।
అథోవాచ హరివ్యక్తి రేత త్తేజోద్భవః సురాః।
హరం త్యక్త్వా సురా స్సర్వే గచ్ఛతేతి యథాగతమ్।

తా॥ ఒక ముద్దగాచేసి దానిని ఈశ్వరుని చేతి కిచ్చెను దానిని ఈశ్వరుడు మ్రింగివేసెను ఈ తేజస్సు వలన గొప్పబలము కలిగిన వానరవ్యక్తి పుట్టును అప్పుడు మీ కష్టములన్నియు తొలగు'నని వారితో చెప్పి ఈశ్వరుని విడచి మీ నివాసంబులకు మీ రరుగు డనెను

శ్లో॥ తతః కాలే మహాదేవః పర్యట న్పృథివీ మిమాం।
పార్వతీ సహిత శ్శ్రీమా న్వేంకటాఖ్యం గిరిం గతః।

తా॥ తరువాత కొంతకాలమునకు ఈశ్వరుడు పార్వతీ సహితుడై

భూమండలమున దిరుగుచు వేంకటాచలమునకు చేరెను

శ్లో॥ నిత్యం సన్నిహితో యత్ర శ్రీనివాస స్సతాం గతిః।
లభంతే సాయిషా సర్థా న్యస్మి న్పండిత సామరాః॥

తా॥ ఆ పర్వతమందు శ్రీనివాసమూర్తి వరముల నిచ్చి పండిత పామరులను రక్షించుచుండెను

శ్లో॥ తౌ తత్ర దంపతీ చైకే శేషాఖ్యే చిత్రకాననే।
చేరతుః పరమామోదే నిర్మలోద సరిద్వరే॥
ఏకదా పరమ ప్రీతా పార్వతీ పతిదేవతా।
క్రీడంతం సురతాసక్తం కపియుగ్మం దదర్శ హ॥

తా॥ ఆ పుణ్యదంపతు లిరువురును ఆ పర్వతమునందలి సుఖకరములైన ప్రదేశములయందు కొంతకాలము గడపిరి, ఒకానొక సమయమునందు పార్వతీదేవి క్రీడార్థముగా బయలుదేరిన రెండు కోతులను చూచెను

శ్లో॥ తత స్సా హ్రీమతీ బాలా మహాదేవస్య పశ్యతః
పుష్పసాంద్రేషు కుంజేషు తదా రంతుం మనోదధే॥

తా॥ అట్లు బయలుదేరిన వానరమిథునమును చూచి లజ్జగలదియై తానును పొదరిండ్లయందు క్రీడించుటకు ఆసక్తి కలదాయెను

శ్లో॥ సర్వజ్ఞ స్తదభిప్రాయం జ్ఞాత్వా స కపిరూపధృత్।
రమయామాస తాం దేవీం కపిరూపధరాం శివామ్॥

తా॥ సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు ఆ పార్వతీదేవి యొక్క

అభిప్రాయమును తెలుసుకొనినవా డగుటచేత పార్వతీసహితముగా వానరరూపమును ధరించి వానరరూపములో నున్న యామెను సంభోగాది క్రియలచే సంతోషపరచెను

శ్లో॥ సహస్రాబ్దప్రమాణేన క్రీడిత్వా స మహాద్యుతిః।
తత్తేజః పార్వతీగర్భే విధాయ విరరామ హ ।

తా॥ వెయ్యి సంవత్సరములు గడచిన పిమ్మట ఆ తేజః పుంజమును పార్వతీ గర్భమందు ప్రవేశింపజేసెను

శ్లో॥ అగ్నౌ చిక్షేప తత్తేజః పార్వతీ ధారణాక్షమా
స చా ప్యశక్త స్త ద్వాయౌ నిక్షిపన్ విససర్జ హ ।

తా॥ కపిరూపములో నున్న పార్వతి ఆ తేజస్సును ధరించుటకు అసమర్థురాలై అగ్ని యందు వదలెను అగ్నిదేవుడున్నూ భరింపజాలక వాయుదేవునకు అప్పగించెను ఇట్లుండ,

శ్లో॥ తస్మి న్కేసరిణో భార్యా కపిపత్నీ వరాంగనా
అంజనా పుత్ర మిచ్ఛంతీ మహాబలపరాక్రమమ్
తప శ్చచార సుమహ న్నియతేంద్రియమానసా ॥

తా॥ ఇట్లుండగా కేసరియను వానరుని యొక్క భార్య అంజనయను పేరుగల వానరస్త్రీ మహాబలపరాక్రమములు గల కుమారుని పొందవలెనని గొప్పదైన తపస్సు చేసెను

శ్లో॥ తస్యై వాయుః ప్రసన్నాత్మా ప్రత్యహం ఫల మర్పయన్।
భక్షార్థ మేకదా తస్య స్తత్తేజ శ్చార్పయ త్కరే
ఫలబుద్ధ్యా తు తత్తేజ స్సా ప్యభక్షయ దంగనా ॥

తా॥ వాయుదేవుడు ఆమెయందు అనుగ్రహము కలిగి ప్రతిదినము భక్షించుటకు ఒక ఫలము నిచ్చుచుండెను ఒకానొక సమయమందు ఆ చిన్నదానియొక్క హస్తమందు ఫలమువలెనే ఆ తేజస్సును సమర్పించెను. నిత్యమువలెనే ఫల మనుకొని ఆ తేజఃపిండమును అంజనాదేవి భక్షించెను

శ్లో॥ తాతిది ఘోణ కాలేన చాఽంజనా పతిదేవతా ।
స్వాంగేషు గర్భచిహ్నాని సా దృష్ట్వా హ్రీమనా హ్యభూత్ ।

తా॥ కొద్దికాలమునందే ఆ అంజనాదేవి గర్భమును ధరించి గర్భ చిహ్నములను చూచి లజ్జపొందెను

శ్లో॥ విస్మయావిష్టచిత్తాం తాం వ్రతభంగవిశంకితాం
ధ్యాయంతీం భయవిత్రస్తాం మాభూస్యాఽ హోఽ శరీరిణీ ।

తా॥ హఠాత్తుగా గర్భము ధరించుటచే ఆశ్చర్యమును పొందినదిన్ని వ్రతభంగమువలన భయముగలదిన్నీ ధ్యానించుచున్నదిన్నీ అయినట్టి అంజనాదేవిని గురించి ఆకాశవాణి పలికెను

శ్లో॥ మాభూత్తే వ్రతభంగోఽయం మావిషీద వరాననే ।
దేవప్రసాదాత్తే గర్భే మహావ్యక్తి ర్భవిష్యతి ।

తా॥ ఓ అంజనాదేవి! నీకు వ్రతభంగము కాలేదు, విచారించ నక్కరలేదు భగవత్ప్రసాదముచే నీ గర్భమందు మహానుభావుడు పుట్టగలడు

శ్లో॥ ఏవ ముక్తా తు సా దేవీ ముదా పరమయాయుతా
వైశాఖే మాసి కృష్ణాయాం దశమీ మందసంయుతా
పూర్వప్రోష్ఠపదాయుక్తా తథా వైధృతిసంయుతా ।

తస్యాం మధ్యాహ్న వేలాయాం జనయామాస వైసుతమ్ ।
మహాబలం మహాసత్వం విష్ణుభక్తి పరాయణమ్ ।
సర్వదేవమయం వీరం బ్రహ్మవిష్ణు శివాత్మకం
వేదవేదాంగ తత్త్వజ్ఞం సర్వవిద్యా విశారదమ్
సర్వబ్రహ్మవిదాం శ్రేష్ఠం సర్వదర్శన సమ్మతం
మాణిక్య కుండలధరం దివ్యపట్టాంబరావృతమ్
కనకాచలసంకాశం పింగాక్షం హేమమాలినం
స్వర్ణయజ్ఞోపవీతిం చ మణినూపురశోభితమ్
ధ్వజవజ్రాంకుశచ్ఛత్ర పద్మ రేఖాంఘ్రి సంయుతం
దీర్ఘలాంగూలసహితం దీర్ఘకాయం మహాహనుమ్
కౌపీన కటి సూత్రాభ్యాం విరాజంతం మహాభుజం
ఆశ్చర్యభూతం లోకానాం వజ్రసంహననమ్ కపిమ్ ।
సర్వలక్షణ సంపన్నం కిరీట కనకాంగదం
ప్రభయాఽమితయా విష్ణో రవతారమివాపరమ్ ।

తా॥ ఈ ప్రకారముగా ఆకాశవాణిచే చెప్పబడినదై సంతోషముతో కొంతకాలము గడపెను అనంతరము వైశాఖమాసమున కృష్ణపక్ష దశమీ మందవారమున పూర్వాభాద్రా నక్షత్రము, వైధృతినామయోగముతో కూడిన దినమున మధ్యాహ్నవేళయందు మహాబలము కలిగినవాడును, విష్ణుభక్తితత్పరుడును, నిగ్రహానుగ్రహసమర్థుడును, వేదవేదాంగ తత్త్వములను తెలిసినవాడును, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుండును, వేదశాస్త్రములయందు చెప్పబడిన మహిమకలవాడున్నూ, మాణిక్య కుండలములను ధరించినవాడును, దివ్య పీతాంబరమును ధరించినవాడును, మేరు సమానుడును, స్వర్ణమాలికలను, స్వర్ణ యజ్ఞోపవీతమును, మణినూపురములను ధరించి వటువంటి వాడును,

ధ్వజ వజ్ర అంకుశ ఛ్చత్ర పద్మ రేఖలతో గూడిన పాదపద్మములు కలిగినటువంటి వాడును, పెద్దదైనటువంటి వాలమున్నూ, పెద్దదయిదన శరీరమున్నూ, బ్రహ్మతేజః పుంజితమైన ముఖపద్మము కలిగినటువంటి వాడున్నూ, సర్వలక్షణ సంపన్నుడున్నూ, సర్వాశ్వర్యనిధియున్నూ, గొప్పవైన భుజములు కలిగినటువంటివాడున్ను కాంతిచేత విష్ణుమూర్తి యొక్క మరియొక అవతారముపలెనున్నవాడున్నూ, అయిన కుమారుని అంజనాదేవి కనెను

శ్లో॥ పపాత పుష్పవృష్టిశ్చ నేదు ర్దుందుభయో దివి
నన్నృతు ర్దేవగన్ధర్వా ష్టుష్టువు స్సిద్ధ చారణా
వవౌ వాయు స్సుఖస్పర్శం సరితో నిర్మలోదకాః ॥

తా॥ ఆ సమయమునందు దేవతలు పుష్పవర్షము కురిపించిరి దేవదుందుభులు శుభధ్వని చేసినవి అప్సరఃస్త్రీలు నాట్యము చేసిరి గంధర్వులు సంగీతమును పాడిరి సిద్ధ చారణులు సంతోషముతో స్తుతి చేసిరి వాయువులు సుఖముగా సంచరించినవి, నదులు నిర్మలోదకముతో ప్రవహించినవి

శ్లో॥ యదాంజనా కేసరి ధర్మపత్నీ
హ్యసూత బాలం కపిసార్వభౌమం
ప్రదక్షిణాకారశిఖం మునీనాం
తదైవ వహ్నిత్రితయం విరేజే ॥

తా॥ ఏ సమయమునందు అంజనాదేవి వానర సార్వభౌముడైన మహానుభావుని కనెనో ఆ సమయమునందు మునీశ్వరులయొక్క గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని యను అగ్నిత్రయము ప్రదక్షిణ జ్వాలలతో శుభసూచకముగా ప్రకాశించినవి

శ్లో॥ ప్రసూనగంధానిల సంభృతేషు
వనేషు మత్తా మకరందనిర్ఝరైః ।
మిళింద సంఘా విచరంతి సర్వత
స్సకోరకైః పల్లవిత ద్రుమేషు ॥

అర్థము:- ప్రసూనగంధానిల సంభృతేషు = పుష్పపరిమళ మిళిత వాయువులతో కూడినట్టియు, పల్లవిత ద్రుమేషు = వికసించిన వృక్షములు కల, వనేషే = వనముల యందు, సకోరకైః = మొగ్గలతో కూడిన, మకరందనిర్ఝరైః = మకరంద ప్రవాహములచే, మత్తాః = మదించినవై, మిళిందసంఘాః = తుమ్మెదల గుంపులు, సర్వతః = అంతటనూ విచరంతి = సంచరించినవి

తా॥ వనముల యందు పుష్పపరిమళములతో కూడిన వృక్షముల యందు తుమ్మెదలె సుఖముగ సంచరించినవి

శ్లో॥ పతంతి రత్నాని సురేతరాణాం కిరీటకోటిగ్రథితాన్యకాండే
తదంగనామానసగహ్వరేషు సగర్వకంపం భయ మావివేశ ।

టీ॥ సురేతరాణాం = రాక్షసుల యొక్క, కిరీటకోటి గ్రథితాని = కిరీటముల యొక్క అంచలయందు అతుకబడిన, రత్నాని = రత్నములు అకాండే = కారణము లేకయే, పతంతి రాలుచున్నవి తదంగనా మానస గహ్వరేషు = ఆ రాక్షసస్త్రీల యొక్క మనస్సులనే గుహలయందు, సగర్వకంపం = గర్వము యొక్క వణకులో కూడుకొన్న, భయం = భయము, ఆవివేశ = ప్రవేశించెను

తా॥ రాక్షసులు శిరస్సులయందు ధరించిన కిరీటస్థగిత రత్నములు అకస్మాత్తుగా రాలినవి ఆ రాక్షసస్త్రీలు భయమును పొందిరి ఈ ప్రకార

ముగా ఆ హనుమజ్జన్మ మహాత్మ్యమందు లోకమునకు సుఖమున్ను, లోకబాధకులైన రాక్షసులకు దుఃఖమున్ను కలిగెను

శ్లో॥ ఆంజనేయః పూజితశ్చే త్పూజితా స్సర్వ దేవతాః
హనుమన్మహిమాలశక్యో బ్రహ్మణాపి చ వర్ణితుం ।

తా॥ ఆంజనేయుని బూజించినయెడల సర్వదేవతలను బూజించి నట్లే యగును హనుమంతుని మహిమను బ్రహ్మదేవుడుగూడ వర్ణింప జాలడు బ్రహ్మదేవుడు చరాచరసృష్టికిఁ గర్తయైనను హనుమత్సృష్టి యా చరాచరసృష్టి కతీతమైనది కావున బ్రహ్మదేవుడునూ వర్ణింపలేడని పరాశర సంహిత చెప్పుచున్నది

తథైవ నవమే పటలే ధ్వజదత్తచరిత్రేః

శ్లో॥ దైవతాని కతి సంతి న భూమౌ నైవ తాని మనసో మతానిమే
దీక్షితం జడ దరిద్రరక్షణే దైవతం హనుమదాఖ్య మేవతత్ ।

తా॥ లోకములో ననేకులు దేవతలు లేరా? ఉన్నారు ఉన్నను వారియందు నామనస్సు ప్రసరించుటలేదు జడులను, దరిద్రులను రక్షించిన హనుమంతుడే రక్షింపవలయును కావున హనుమంతుని మించిన దైవములేదు

హనుమత్కూర్మాంతే ః

శ్లో॥ ఆంజనేయో విరాడ్రూపో విశ్వాత్మా పావకాత్మజః
గౌరీసుత ఈశపుత్రః సర్వాకామాన్ దదాతు నః ।

తా॥ ఆంజనేయులు విరాడ్రూపి, సర్వదేవతాత్మకుడు, విశ్వమంతయు నాయన స్వరూపమే. ప్రపంచమంతయు వహ్నిషోమాత్మ

కము అందు అగ్నికి హనుమంతుడు పుత్త్రుడు సోమాత్మకులైన పార్వతీశివులకును బుత్త్రుడు అందుచేత నాయన సర్వదేవతాస్వరూపు డనుట నిర్వివాదాంశము అట్టి హనుమంతుడు మాకు సర్వమనోరథముల నొసంగుగాక !

పరాశర సంహితాయాం ధ్వజదత్త చరిత్రే ।

శ్లో॥ బ్రహ్మ విష్ణు శివ మైథిలి శివా కార్యసిద్ధిశిథిలోద్యమా మహా
అంజనాసుతమనుప్రభావతో భుక్షతే సుఖమహర్నిశం ద్విజ ।

తా॥ బ్రహ్మవిష్ణురుద్రులను సీతాపార్వతులును కార్యసిద్ధిపరులు కారు, ఈ దేవతలు కేవలము పారలౌకికులు, కావున వారు ప్రాపంచిక కార్యసిద్ధికిఁ దోడ్పడరు హనుమంతుడట్లు కాదు అయన పరాపర ప్రపంచస్వరూపుడు కావున సర్వకార్యసిద్ధిప్రదుడనుట సత్యము, హనుమదుపాసకుడైన ద్విజుడు సర్వ సౌఖ్యముల ననుభవించును

తత్రైవ త్రయోదశపటలే హనుమంతంప్రతి ధ్వజదత్త వచనం॥

శ్లో॥ త్వా మామనంతి శ్రుతయో జగతా మాదికారణం
త్వామేవ సృష్టికర్తారం పురుషం ప్రకృతేః పరం ।

స్వామీ ! శ్రుతులు నిన్ను పరబ్రహ్మపదార్థ మని చెప్పుచున్నవి సమస్త జగత్తునకు ఆదికారణమైన పరంజ్యోతివి నీవేనని శ్రుతులు పల్కుచున్నవి భూతసృష్టి యొనర్చు చతుర్ముఖబ్రహ్మవును నీవే ప్రకృతి కతీతుడైన పరబ్రహ్మవును నీవే

అపి చ ఏకోనవింశ పటలే ।

శ్లో॥ సప్తకోటి మహామంత్రా వినా బ్రహ్మాస్త్రవిద్యయా
హనుమ న్మంత్రజాలానాం మిత్రాణీతి విదు ర్బుధాః ।

తా॥ బ్రహ్మాస్త్ర విద్య యొక్కటి తక్కఁదక్కిన సప్తకోటి మహామంత్రములును హనుమద్విద్యకు లొంగినవే ఒక బ్రహ్మా స్త్రము నకు మాత్రము హనుమంతుడేడు నిమిషములు లీలగాఁ గట్టుపడెను, ఆ బ్రహ్మయైనను హనుమదనుగ్రహము చేతనే యాయనను గట్టుటకు సమర్థుడయ్యెను ఇందొక్క విశేషము బ్రహ్మాస్త్రవిద్యను బ్రహ్మ దర్శించినను నది శ్రీబగళావిద్య, తత్వములో త్రిపురసుందరీ దేవతాత్మకమైనది హనుమంతుఁడందు జగన్మాతయందలి గౌరవవిశేషముచే దానికి లొంగెనని విశేషజ్ఞులు గమనింపవలయును

**పరాశర సంహితాయాం :**

శ్లో॥ కేవాన పూజయన్తీహ ప్రత్యక్ష వరదాయకం
అర్చయన్తి హనూమంతం బ్రహ్మ విష్ణు శివా అపి ॥
హనుమత్సదృశం దైవం నాస్తి నాస్త్యేవ భూతలే
తస్మాన్ సంపూజ్యతే భాను ర్బ్రహ్మ గౌరీ మహేశ్వరః ॥
శ్రీ జానకీపతి స్సాక్షా దాదినారాయణః ప్రభుః
ఈశ శక్రాది లోకేశాః కుమారో గణనాయకః ॥
బ్రహ్మర్షయో వసిష్ఠాద్యా స్సనకాద్యాశ్చ యోగినః
పితరో వసవో రుద్రాః పూజిత స్స్వ ర్నసంశయః ॥

తా॥ శ్రీరామచంద్రుడే హనుమదుపాసకుడని సుందరోత్తరకాండ వచనముల వలన స్పష్టమగుచున్నది, హనుమన్మంత్రమునకు శ్రీ రామ చంద్రుడే ఋషియయ్యెను అనగా హనుమన్మంత్రమును దర్శించినది శ్రీరామచంద్రుడే యని తెలియవలయును ఈ విషయము అగస్త్యసంహిత యందుము శ్రీ రామోత్తరతాపన్యుపనిషత్తు నందును

ప్రతిపాదింపఁబడినది అయినను గోరిన కోరిక లెల్ల ప్రత్యక్షముగా దీర్చు పరమ దైవమైన హనుమంతు నెవ్వరుపాసింపరు; బ్రహ్మ విష్ణు రుద్రులు కూడ హనుదుపాసన చేయుచుందురు హనుమంతుని బోలిన దైవము భూతలమునందు లేనేలేడు హనుమదుపాసన చేసినందువలన సూర్యుడు, బ్రహ్మ, గౌరీశంకరులు, సాక్షాదాదినారాయణమూర్తియైన శ్రీరామచంద్రుడును, ఇంద్రాద్యష్టదిక్పాలురును, స్కందగణపతులును, బ్రహ్మర్షులైన వసిష్ఠాదులును, పరమయోగిపుంగవులైన సనకాదులును, పితృవసు రుద్రగణంబులును బూజింపబడినవారగుదురు హనుమంతుడు సర్వ దేవతాత్మకుడని దీనివలన దెలియనగుచున్నది

పునశ్చ తత్రైవ బ్రహ్మకృత ఆంజనేయ స్తుతౌ ।

శ్లో॥ పార్వతీ గర్భసంభూతః పార్వతీపుత్త్ర నామవాన్
అగ్నినా ధార్యమాణత్వా దగ్నిగర్భో భవాన్భవేత్ ।
వాయుప్రసాదజననా ద్వాయుపుత్రో నిగద్యతే
అంజనాగర్భజననా రాంజనేయస్తతో భవాన్ ।
కేసరిక్షేత్ర జన్యత్వా త్పుత్త్రః కేసరిణః కపే
హనూవజ్ర ప్రహారాద్ధి హనుమానితి నామ తే ।
బ్రహ్మ విష్ణు శివాంశత్వా త్త్రిమూర్తి రితి విశ్రుతః ।

పార్వతీదేవి, అగ్ని, వాయువు, అంజనాకేసరులు, వీరు హనుమంతుని సరాపర మూర్తుల ధరించినారు ఇందుఁబార్వతి శివుని యర్ధాంగి, అగ్నివాయువు లిర్వురును శివుని యష్టమూర్తుల లోనివారే యిట్లు హనుమంతుని శివత్వమురూఢియగుచున్నది అగ్నిప్రపంచసృష్టికి హేతువగుటచే బ్రహ్మాంశ కలవాడు వాయువు సర్వవ్యాపకు డగుటచే

విష్ణ్వంశకలవాడు ఇట్లు బ్రహ్మవిష్ణ్వంశలు గూడ హనుమంతునియం దుండుట హనుమంతుడు త్రిమూర్త్యాత్మకుడని బ్రహ్మ స్తుతించెను

ఉమాసంహితాయాం ఆంజనేయస్తవే ।

శ్లో॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకం
బాలార్క సదృశాభాసం రామదూతం నమామ్యహం ।

ఆంజనేయడు గొప్పవీరుడు ఇందు వీరుడనగా బ్రహ్మవేత్తయని యర్థము సృష్టి స్థితి లయ కారణ తత్త్వములైన బ్రహ్మ విష్ణు శివాంశలు కలవాడగుటచే త్రిమూర్త్యాత్మకుడు ఆయన పొడుచుచున్న ప్రొద్దువంటి యెఱ్ఱని కాంతి కలవాడు ఇది శక్తిస్వరూపము "ఆధారే తరుణార్కకోటి సదృశం" అని దేవీస్తుతియం దున్నది ఆయన రామదూత పరబ్రహ్మ పదార్థమైన శ్రీ రామచంద్రుని స్వరూపకథనము చేయగలిగిన వాడనియు అర్థము

కావుననే యనేక గ్రంథములయందు మారుతి సర్వదేవతాత్మకుడని ప్రశంసింపబడెను ఆయన పూజవలన సర్వదేవతా పూజాఫలము లభించుననియుఁ జెప్పబడినది

శౌనక సంహితాయాం :

శ్లో॥ యత్రాఽస్తి భోగో నహి తత్ర మోక్షః
యత్రాఽస్తి మోక్షో నహి తత్ర భోగః
శ్రీ మారుతే స్సేవన తత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ।

పరాశర సంహితాయాం మైత్రేయం ప్రతి పరాశరః :

శ్లో॥ అనయా సదృశీ విద్యా నాస్తి నాస్త్యేవ తే శపే
ప్రీత్యర్థం న ప్రశంసామి క్రియతే సత్యమేవ తత్ ।

సుదర్శన సంహితాయాం ః

శ్లో॥ యస్తు గేహే హనూమంతం భక్త్యా నిత్యం ప్రపూజయేత్
తద్గృహే తత్ప్రభావేన నిత్యం లక్ష్మీ రచంచలా ॥

శ్లో॥ దీర్ఘమాయు ర్లభే త్తై వ సర్వాత్ర విజయో భవేత్ ।
మార్యాది భూతసంక్షోభ స్తద్దేశే నైవ జాయతే ।

తా॥ కొందరు దేవతలు భోగమును, గొందరు దేవతలు మోక్షమును మాత్ర మిచ్చెదరు హనుమన్మంత్రోపాసకులకు భోగమోక్షములు రెండును గరతామలకము లగుచుండును అందుచేతనే హనుమన్మంత్రము వంటి మహావిద్య మఱియొకటి లేదనియు, విది మొగమాటము చేతగాక సత్యమును ప్రతిజ్ఞచేసి చెప్పుచుంటిననియు మైత్రేయునితో పరాశర మహర్షి చెప్పెను ఎవనియింటియందు హనుమంతుడు పూజితుండగు చుండునో వానియింటియందు లక్ష్మి స్థిరనివాసముగా నుండును వాడు సర్వకార్యములందును సర్వతోముఖవిజయము గాంచుచుండును అట్టి వానికి మార్యాది భూతములవలన భయ మెన్నడును గలుగబోదని సుదర్శన సంహిత వాక్రుచ్చుచున్నది

పరాశర సహింతాయాం ః

శ్లో॥ సప్తర్షయో మునిశ్రేష్ఠః కాదశే కపినాయకం
సంపూజ్య విధివ త్తుష్టైః సంప్రాప్తా శ్శాశ్వతం పదం ।

శ్లో॥ మార్గశీర్షే మహామాసే మందవారే శుభావహే
రంభావనే మహారమ్యే బ్రాహ్మణా భోజయే ద్యది ॥

శ్లో॥ తస్య ప్రసన్నో హనుమాన్ సర్వకామ ఫలప్రదః
దదాతి శాశ్వతీం భక్తిం పరత్రచ పరాం గతిం.

ఉమా సంహితాయాం ।

శ్లో॥ అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాం సుధీః
యః కరోతి నరో భక్త్యా పూజాం శక్త్యా హనూమతః ॥

శ్లో॥ న శస్త్ర భయ మాప్నోతి భయం వా ప్యంతరిక్షజం
పుత్రపౌత్రాది సహితః సర్వసౌఖ్య మవాప్నుయాత్ ।

ఇకఁ బూజావిధానము చెప్పఁబడుచున్నది. సప్తర్షులు హనుమంతుని ప్రతిమను కదళీవనమందుఁ బ్రతిష్ఠించి పూవులతోఁ బూజచేసి శాశ్వత పదవిని గాంచిరి. మార్గశిర మాసమున శనివారమునాఁడరటితోఁటయందు హనుమంతుని బూజించి తదంగముగ బ్రాహ్మణ సమారాధన జరిపినచో నట్టివారి యెడల శ్రీ హనుమంతుడు ప్రసన్నుడై శాశ్వతమైన భక్తి సంపత్తియు బరమగతియు నొసంగి రక్షించును. హనుమత్ప్రతిమను జిల్లేడు వేరుతోఁజేసి పూజించినచో, దానివలన శస్త్రభయములు పొందకుండుననియు నెట్టియాపదలును లేక నరుడు పుత్రపౌత్రవంతుడై దివ్యములైన సర్వసౌఖ్యము లనుభవించుననియు హనుమాసంహితయందుఁ జెప్పబడినది.

పరాశర సంహితాయాం మైత్రేయంప్రతి పరాశర వచనం ।

శ్లో॥ ఏకో దేవ స్సర్వద శ్శ్రీ హనూమా
నేకో మంత్ర శ్శ్రీ హనూమత్ప్రకాశః
ఏకోమూర్తి శ్శ్రీ హనూమ త్స్వరూపా
చైకం కర్మ శ్రీ హనూమత్సపర్యా.

తా॥ పరాశర మహర్షి యంతటివాడు శ్రీ హనుమంతుని యెడల ననన్యభక్తి కలవాడై పరవశత్వము నొంది ఇట్లు చెప్పుచున్నాడు ఒక్కడే దేవుడు అతడు హనుమంతుడు ఒక్కటే మంత్రము అది హనుమన్మంత్రము ఒక్కటే మూర్తి, అది హనుమన్మూర్తి ఒక్కటే కర్మ అది హనుమత్సేవ

పరాశర మహర్షి పరవశత్వము పట్టలేక ఇంకను నిట్లు వ్రాకుచ్చెను

శ్లో॥ జలాధీనా కృషి స్సర్వా భక్త్యధీనం తు దైవతం
సర్వం హనుమతోఽధీన మితి మే నిశ్చితా మతిః ॥
మహాదేవాంశ సంభూతం వాయునా ప్రేరితం బలాత్
అంజనాగర్భ సంభూతం హనుమంత ముపాస్మహే ।
హనుమా న్కల్పవృక్షో మే హనుమా న్మమ కామధుక్
చింతామణి స్తు హనుమాన్ కో విచారః కుతో భయం ।

తా॥ లోకములోఁ గృషియంతయు జలమును కధీనమై యుండును నీరులేనిచోఁ బంటలు పండవు దైవత మెప్పుడును భక్తి కధీనమై యుండును భక్తిలేనిచో నే దేవతయు సాక్షాత్కరింపదు కాని హనుమంతుని కీ సర్వము నధీనములై యుండును అనగా సర్వ కృషియు, సర్వదేవతలును హనుమదధీనములై యుండును మహాదేవునియొద్దనుండి బయలుదేరి వాయుదేవునిచేతఁ గొనిరాబడిఁ యంజనా గర్భమున సాక్షాత్కరించిన యాంజనేయస్వామిని నే నుపాసించెదను ఇందు హనుమంతుని స్థూల, సూక్ష్మ కారణ దేహములు వర్ణింపఁబడినవి స్థూలమంజనాగర్భసంజనితము సూక్ష్మము వాయుప్రేరితము కారణము మహాదేవ జనితము హనుమంతుడు మా కల్పవృక్షము మా కామధేనువు, మా చింతామణి

మాకు విచారములేదు. మాకు భయ మెక్కడిది? యని పరాశరుడు చెప్పెను

సహస్రకంఠ రావణసంహార సందర్భమున ;
పరాశర సంహితాయాం శ్రీ రామంప్రతి హనుమద్వచనం

శ్లో॥ ప్రసార్య లాంగూల మహం తిష్ఠామి వరుణాలయే
సప్తసాగరపర్యంతం వర్ధయిత్వాతుసేతువత్ ।
లాంగూలం సమధిష్ఠాయ జహి త్వం పురుషోత్తమ
ఇ త్యుక్త్వా దీర్ఘ లాంగూలం ప్రసార్య పవనాత్మజః ।
మార్గం సప్తసముద్రాంతం కృత్వా వై పర్యవస్థితః
లాంగూల రోమజాలేషు నక్షత్రాణి తథా గ్రహాః ।
దృశ్యన్తే దర్భపుంజేషు యథైవ హిమబిందవః ।

తా॥ సహస్రకంఠ రావణ సంహారమందు శ్రీ యాంజనేయుడు శ్రీరామునితో నిట్లు చెప్పెను "రామచంద్రా ! నేను నా తోకను సప్తసముద్రాంతము పెంచెదను నీవు నా తోక మీదుగా సప్త సముద్రములను దాటి వెళ్ళి సహస్రకంఠుని వధింపుము" అని, అప్పుడు శ్రీ ఆంజనేయుడు తనతోకను పెంచగా నది సముద్రసప్తకము దాటిపోయెను దానియందు నక్షత్రములు, గ్రహములు దర్భకొసలపై మంచునీటి బిందువులున్నట్లు ప్రకాశించెను- ఆ సమయమున;

శ్లో॥ తదాంజనేయస్తు విజృంభయిత్వా
ప్రతీకమాగా త్కాల విశ్వరూపః ।
బ్రహ్మాది దేవాశ్చ తదంగరోమ
కూపేషు మధ్యే బుధయశ్చదృష్టాః ।

సహస్ర శీర్షా చ సహస్ర బాహు

రాక్రమ్య సర్వా విదిశో దిశశ్చ......"

తా॥ సహస్రకంఠ రావణుని సంహరించుటకై శ్రీ రామచంద్రుడు హనుమంతుని నియోగించెను అప్పుడాయన తన విశ్వరూపమును జూపెను అట్లు పెరిగిన హనుమంతుని రోమకూపములయందు బ్రహ్మాది దేవతలును, ఋషులును గప్పడిరి ఆ మహామూర్తికి సహస్రశీర్షములు, సహస్రబాహువులు నుండెను ఆయన దిగ్విక్కుల నన్నిటి నాక్రమించెను

శ్లో॥ చతుర్ముఖః పంచముఖశ్చ షణ్ముఖ
స్సహస్రశీర్షా ద్విము ఖైకవక్త్రః
త్రిమూర్తి తేజోమయ మాంజనేయం
జ్ఞాతుం సమర్థశ్చ నహి త్రిలోక్యాం ॥

తా॥ నాలుగు ముఖములు గలిగిన బ్రహ్మయును, నై దుముఖములు గలిగిన శివుడును, నాఱుముఖములు గలిగిన కుమారస్వామియు, వేయి తలలు గలిగిన యాదిశేషుడును,రెండు ముఖములు గలిగిన యగ్నియును, ఏకముఖుడై న శ్రీ మన్నారాయణుడును త్రిమూర్త్యాత్మకుడై న యాంజనేయుని మాహాత్మ్యము నెఱుంగ సమర్థులు కారు

తత్రైవ పంచవింశతి పటలే పంచముఖాంజనేయ ధ్యానే॥

శ్లో॥ శ్రీ కరాకార దృఙ్మూర్తి మోహితాఖిల మూర్తయే
స్త్రీపుంమయాయ మహతే పరేశాయ నమోనమః ।

తా॥ శోభాయుక్తమైన రూపనేత్రాకారములచేత సర్వమూర్తులను మోహింప జేయువాడును, స్త్రీ పుం మూర్త్యుపేతుడును, గొప్పవాడును, పరబ్రహ్మ స్వరూపుడై న శ్రీ యాంజనేయులువారికి నమస్కారము

స్త్రీ పుంరూపద్వయముచేత శోభించుచున్నాడనుటచే నర్ధనారీశ్వర రూపుడనియుఁ దోచుచున్నది బాలార్కద్యుతి యనుటవలన వర్ణసామ్యము చేత శక్తిత్వము, స్త్రీపుంమూర్తిమయు డనుటచేత శక్తిమత్వము ఋజువగు చున్నది పైన నుదహరించిన ప్రమాణముల ప్రకారము సర్వదేవతాస్వరూపుడుగాన హనుమత్పూజయే సర్వదేవతాపూజాఫల మిచ్చునని స్పష్టమగు చున్నది సాక్షాదీశ్వర స్వరూపుడుని నిర్ణయింపబడినది

కావున ఆస్తికులగు భక్తు లెల్లరును సర్వదేవతా స్వరూపుడైన శ్రీ హనుమద్దేవతోపాసన వారి వారి శక్త్యనుసారముగా జేసి తరింతురుగాక యని ప్రార్థన

ఇంతకును నీ గ్రంధమందలి విషయమంతయును మా స్వకపోల కల్పితము కాదు ఇది పరాశరాగస్త్యాది సంహిత లనేకములనుండి యందలి విషయముల నేర్చికూర్చి, మా పూర్వుల యనుష్ఠానక్రమము ననుసరించి సంప్రదాయానుసారముగా గ్రదనము చేసినది ఇందలి ప్రమాణా ప్రమాణములు మహర్షి ప్రోక్తములేకాని మాయవి కావు అనూచానముగా మా వంశములో వచ్చుచున్న సంప్రదాయ మిది నా శక్తినిబట్టి శ్రీ హనుమద్దేవతాంకితముగా వేతత్వల మెల్ల తద్దేవతార్పణ బుద్ధితో 'నాహం కర్తా' యను భావములో నేనీ గ్రంధమును సంగ్రహించితిని కావున పెద్దలు పండితులు, పామరులైన భక్తమహాశయులెల్లరు నిరహంకారముగా నేను చేసిన సేవయందలి వైలక్షణ్యమును గుర్తించి న న్నాశీర్వదింతు రని ప్రార్థించుచున్నాను, ఇది నేను అనాదినుండి జరిపిన కృషి ఇంకను ననేక మహద్విషయములు నాకు లభించనివి గ్రంధాంతరములయందుండి యుండవచ్చును లభించినవానికి సరియైన

వ్యాఖ్యానము నాకు దోచి యుండక పోవచ్చును "వ్యాఖ్యానలో విశేష యీ మాటు ముద్రణమున జేర్పించ గలుగుదును రామశబ్దమునందలి మకారము త్వం పదవాచ్యము ఓంకారమునందలి మకారము శివ హనుమంతులను జెప్పునది కావున హనుమంతుడు త్వం పదవాచ్యుడని తేలుచున్నది త్వంపదము చిదచిద్విశిష్ట బ్రహ్మపదవాచ్యము కావున హనుమంతుడును పరాపరమూర్త్యాత్మకుడైన పరమేశ్వరుడని సిద్ధాంతముగు చున్నది గాన సుందర కాండమునకు ప్రధానుడు గనుక భక్తులెల్లరు ఈ సుందరకాండమును పారాయణమొనర్చి సర్వదేవతా స్వరూపుడైన శ్రీ సుందర హనుమానుని కృపకు పాత్రు లగుదురుగాక

ఇతి శ్రీ హనుమద్వైభవే ప్రధమాధ్యాయ స్సమాప్తః

# ద్వితీయోధ్యాయః

## శ్రీ మత్సుందరకాండ కథా ప్రారంభం

శ్లో॥ ఏకదా నైమిశారణ్యే మునయ శ్శౌనకాదయః ।
సూతం దృష్ట్వా మహాభాగం పప్రచ్ఛు ర్హర్షసంప్లుతాః ॥
సూత ! సూత ! మహాభాగ సర్వ శాస్త్ర విశారద ।
త్వత్తశ్శు తా న్య నేకాని పుణ్యాదాని వ్రతాని చ
కథా శ్శుభకరా స్సర్వా మనోభీష్ట ప్రదాయకాః ।
ఇదానీం శ్రోతు మిచ్ఛామి స్సర్వత్ర జయకాంక్షయా ।
జయప్రదం సర్వశత్రుభయ క్షయకరం శుభం ।
విద్యాప్రదం ధనకరం సర్వాభీష్టఫలప్రదం ।
తత్రాపి జయదం పుణ్యం వ్రతం వా దానముచ్యత ।
పురాణపఠనం వాఽపి కథయస్వ దయానిధే ॥

సూత ఉవాచ :-

శ్లో॥ యూయం సమర్థా శ్శాస్త్రేషు సర్వేషు చ మహాధియః
తథాపి మాం వదస్వేతి మయ్యనుగ్రహకారిణః ॥
తస్మా దహం యుష్మ దంతేవాసీ వినయపూర్వకం ।
వదామి యుష్మత్సాంతేషు స్థితంకామవిధాయకం ॥
వ్రతం శ్రీరామచారిత్ర సంయుతం చ హనూమతః ।
ప్రభావయుక్తం వాల్మీకి కవినా రచితం పురా ॥
శుభం శ్రీ సుందరాభిఖ్య కాండ పారాయణాత్మకం ।
వ్రత మస్తి చ సర్వేషా మభీష్ట ఫలదాయకం ॥

బ్రహ్మచారి గృహస్థోవా నారీవా జయకాంక్షిణీ
ఏతద్వ్రతం ప్రకుర్వీత వాంఛితం భవతి ధ్రువం ।
బ్రహ్మచారీ వివాహోర్థం కుర్యా దేత ద్వ్రతం శుభం
వివాహ మాశు భవతి సత్యం సత్యం వదా మ్యహం ।

ఋషయః ఊచుః :—

శ్లో॥ తద్వ్రతం తస్య మాహాత్మ్యం తద్విధిశ్చ యథాభవేత్
తత్క్రమం సర్వ మాచక్ష్వ సంపూర్ణ ఫలదాయకం ।

సూత ఉవాచ :—

శ్లో॥ శృణ్వంతు మునయ స్సర్వే మదుక్తం నాన్యమానసాః ।
య చ్ఛ్రుత్వా జయ మాప్నోతి వాంఛితార్థా న్ద్రుతం।
చైత్రేవా కార్తి కేవాపి వైశాఖే మాఘమాసివా ।
ఫాల్గుణేవాపి చ శుభే తిథౌ వారే శుభే తథా ।
నక్షత్రే జన్మతారాది బలం చంద్రబలం తథా ।
ఆలోచ్య యోగ్యదివసే ప్రారభే న్నియతో వ్రతీ ।
సంపూజ్య గణనాథం చ రామచంద్రం చభక్తితః ।
హనుమద్విగ్రహే పూజాం హేమరౌప్యకృతాకృతౌ ।
కృత్వా గురుంచ సంపూజ్య వస్త్రాలంకార భూషణైః
వాచకం పూజయే త్పశ్చా ద్యథావిభవసారతః ।
స్వయంవా పఠనం కుర్యాత్ అన్యైర్వాఽపి విశేషతః ।
వటుభిర్వా గృహస్థైర్వా వాచయే న్నియతేంద్రియః ।
కుర్యా త్ప్రారంభకాలేతు ప్రత్యహం మునిసత్తమాః ।
ఖ్యాతః శ్రీరామదూతేతి ధ్యానం సర్వార్థసిద్ధయే ।

దివే దివే సప్త సర్గా న్పఠే దనుదినం సుధీః
కుర్యాత్సమాప్తి పర్యంతం తస్య కార్యం యధా భవేత్
అధవా ప్రత్యహం వారం ప్రారంభాంతం పఠే త్సుధీః ।
మాసస్యార్థం చైకమాసం దినవింశతిపంచ వా
దినాని చత్వారింశద్వా ప్రత్యహం చ పఠే త్సుధీః
సప్త పారాయణం వా పి తధా సప్తదినేషుచ ।
మహోపద్రాప్తికాలే తు న మాసాది వినిర్ణయః
యధాశక్త్యనుసారేణ ప్రత్యహం ప్రపఠేత్సుధీః ॥
ఏవం పారాయణం కృత్వా తత ఉద్యాపనం చరేత్ ।
మండపం కారయే త్పంచ ప్రస్థ తండులకైర్యుతం
తన్మధ్యేఽష్టదళం పద్మం కారయేన్నియతో వ్రతీ
తస్మి న్నావాహయే ద్దేవం రామచంద్రం సమాహితః
ఆవిహయే త్తత్పురతో వాయుసూనుం హిరణ్మయం ॥
అష్టదిక్ష్వష్టదిక్పాలా నావాహ్య తదనంతరం
షోడశై రుపచారైశ్చ హనూమంతం ప్రపూజయేత్ ।
పూజాన్తే ప్రార్థయే ద్దేవదేవం వాయు తనూభవం ।
రామదూత నమస్తుభ్యం సీతాశోకవినాశక ।
లక్ష్మణస్య ప్రాణదాతా కురు మ ద్వాంఛితం ఫలం ।
అంజనా గర్భ సంభూత లంకా ప్రాణాపహారక ।
రావణోద్యాన విధ్వంసీకురు మ ద్వాంఛితం ఫలం ।
వాయునందన సుగ్రీవసచి వార్ణవలంఘన ।
దుష్టరాక్షస దర్పఘ్న కురు మ ద్వాంఛితం ఫలం ।
ప్రసన్నోభవ మే స్వామిః ప్రపన్నార్తి ప్రభంజన

త్వ త్పాదసన్నిధిం ప్రాప్తం పాహి మాం కరుణాకర ।
ఇత్యుక్త్వా దండవ ద్భూమౌ పతిత్వా ప్రార్థయేత్తతః ।
ప్రతిమానహితం చైవ మండపం చ ద్విజాతయే ।
దాతవ్యం దక్షిణాయుక్తం యథా విభవసారతః
వాచకం హనుమ ద్బుద్ధ్యా వస్త్రాలంకారభూషణైః
పూజయేత్తం సుసంప్రార్థ్య విప్రసంతర్పణం చరేత్ ।
దీనారాణీ ప్రదద్యాద్వై వాచకాయ ద్విజాతయే ।
స తు సంతుష్ట చిత్తశ్చే త్స్వకార్యం భవతి ధ్రువం ।
విద్యార్థీ లభతే విద్యాం ధనార్థీ ర్లభతే ధనం ।
కన్యార్థీ లభతే కన్యాం పుత్రార్థీ లభతే సుతం ।
సత్యం సత్యం పున స్సత్యం వాంఛితం భవతిధ్రువం
ఏవ ముక్తా శ్శౌనకాద్యా సూత మూచుః పున ర్ముదా ।
పురాకృతం వా కేనాపి వాంఛితం ప్రాప్త మచ్యుత ।
తచ్ఛ్రోతుం వాంఛితం నోద్య కథయస్వ పురాతనం

సూత ఉవాచ

పురా మహేశ్వరో దేవః త్రిపురం హంతుకాముకః ।
ఏవం సంపూజ్య హతవాన్ త్రిపురం యుగపద్బలాత్
వృత్రాసురవధార్థాయ సురాణా మధిపః పురా
పూజయిత్వా హనూమంతం వృత్రహంతాఽభవన్ముదా
అమృతోత్పాదనే కాలే సర్వై ర్దేవై కృతం త్విదం ।
మంతక ఇతి ఖ్యాతం మణీ మాహర్తు కాముకః
శ్రీకృష్ణశ్చాపి సంపూజ్య హనూమంత మిదం వ్రతం ।
కృతవాన్ ధర్మరాజోఽపి వేదవ్యాసేన చోదితః
కృత్వా చైత ద్వ్రతం భక్త్యా విజయం ప్రాప దుర్లభం ।

ప్రకాశ్యం ప్రాప్య సకలాన్ భోగా స్సంప్రాప్తవాన్ ముదా
తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యం వ్రత ముత్తమం ॥
ఇ త్యుక్తా మునయ స్సర్వే సూత మి త్యూచురుత్సుకాత్
ఇదం రహస్యం కస్మాచ్చ శ్రుతం కుత్ర మహామునే ।
తద్వ దస్వ మిధో నోచే దస్మాకం వాక్యగౌరవాత్ ॥

సూతః ।–

ఏకదా శివపూజార్థం కైలాసం గతవా నహం
కైలాసశిఖరే రమ్యే పార్వత్యాసహ శంకరం
దృష్ట్వా సంపూజ్య విధివ త్కించిత్కాలం స్థితోస్మ్యహం
తదానీం శంభునా ప్రోక్తం పార్వత్యై చ దయాళునా ।
ప్రమదేభిః శ్రి త త్సర్వం మయా శ్రుత మిదం వ్రతం ।
భక్తాయ చైత ద్వక్తవ్యం నాభక్తాయ కదాచన ।
గోపనీయం గోపనీయం సర్వదాఽతి ప్రయత్నతః ॥
ఇతీశ్వరేణ సంప్రోక్త మాదరేణ పునః పునః
ఇతఃపూర్వం న కేనాపి పృష్టం మునికులోత్తమాః ।
యుష్మాభిః పృష్టమధునా మయా చోక్త మిదం వ్రతం ॥
యే పరం తీద మాఖ్యానం శృణ్వంతి శ్రద్ధయాన్వితాః ।
తే లభంతేఽఖిలా న్కామా నాంజనేయప్రసాదతః ॥

ఇతి శ్రీ వాయుపురాణే శ్రీ మత్సుందరి కాండ పారాయణ
వ్రతకల్పః సంపూర్ణః

ఏవం విశేష్టే శుభే ముహూర్తే మమ ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం
శ్రీ హనుమత్ప్రసాదేన మమ శత్రు కృత మంత్ర, యంత్ర, తంత్రో

చ్చాటన, భేదన, వశీకరణ, స్తంభన, మోహనాదిమహాభయ నివృత్త్యర్థం, శ్రీ రామచంద్ర ప్రీత్యర్థం శ్రీ మదాంజనేయ ప్రసాదసిద్ధ్యర్థంచ శ్రీ వాల్మీకి విరచిత శ్రీ మద్రామాయణాంతర్గత సుందర కాండ పారాయణం కరిష్యే ॥ (ఇతి సంకల్పః)

## శ్రీ మత్సుందరకాండ కథా ప్రారంభము

ఒకప్పుడు నైమిశారణ్యమునందు శౌనకాది మహర్షుల యొద్దకు సూతుడు రాగా, ఆ మహర్షులు సూతుని వినయవిధేయతలతో నిట్లు ప్రశ్నించిరి సకల పురాణవేత్తయగు సూతుడా! నీవు పుణ్యప్రదము లయిన వ్రతాదులను గూర్చి పూర్వము వినిపించితివి మఱియు ననేక పుణ్యకథలను గూడ నీవలన వినియుంటిమి కాని యింకను వినఁగుతూహల ముగ నున్నందున, సర్వత్ర జయప్రదమును, శత్రు భయంకరమును, పుణ్యప్రదమునగు వ్రతమును గూర్చి చెప్పుమనగా, సూతుడిట్లు వారలకుఁ జెప్పదొడగెను: ఓ మహర్షులారా! మీరలు సకల శాస్త్రవేత్తలును, మహామేధావంతులు నయ్యును నన్నిట్లు ప్రశ్నించుట, నాయందు మీకుగల యనుగ్రహము కంటె వేఱొండు కాజాలదు కాని నేను శిష్యభావముతో వినయ పూర్వకముగఁ జెప్పుదాని నితర మనస్సు లేనివారలై వినుడని యిట్లు చెప్ప నారంభించెను ఓ మునులారా! నేను జెప్పబోవు వ్రతము సుందరకాండ పారాయణ రూపమైనది అది శ్రీ రామచంద్ర కథావిలసితమును, హనుమత్ప్రభావ సూచకమును, వాల్మీకి విరచితమును, శుభప్రదము సర్వాభీష్ట ప్రదమునై యున్నది ఈ వ్రతము నాచరించు వారలకు సర్వాభీష్టములు సిద్ధించును గృహస్థులు, బ్రహ్మచారులు కూడా నీ వ్రతము నాచరించవచ్చును గృహస్థులాచ రించినచో సర్వాభీష్టములు సిద్ధించును

బ్రహ్మచారి యాచరించుటచే శీఘ్రముగా వివాహ ప్రాప్తి గలవాడగును నేను సత్యముగాఁ జెప్పుచున్నాను అని యివ్విధముగా సూతుడు చెప్పగా, ఆ మహర్షులు తిరిగి యిట్లు ప్రశ్నించిరి॰ సూతా ఆ వ్రత విధానము, వ్రత మహాత్మ్యమును, తత్క్రమమును గూడ విస్తృతముగా మాకు జెప్పమని ప్రార్థింపఁ దిరిగి సూతుడమ్మునులతో నిటులఁజెప్ప నారంభించెను ఓ మునులారా! ఈ వ్రతము నాచరించుటచే వాంఛా సిద్ధి కలుగును సర్వత్ర జయము గలుగును విధానమును చెప్పెదను వినుడు

అనన్యమనస్కులై చైత్ర వైశాఖ కార్తీక మాఘమాసములలో గాని, ఫాల్గుణ మాసమునగాని, శుభతిథియందు, శుభ వాసరమునందు, శుభ నక్షత్రమున తారాచంద్రబలమును గూడ విచారించి యీ పారాయణ వ్రతము నారంభింపవలయును, పారాయణ ప్రారంభమున విఘ్నేశ్వర పూజ చేసి శ్రీ రామచంద్రుని, హనుమంతుని విగ్రహములన్ను బూజించి, గురువును, వాచకుని వస్త్రాలంకారాదులచేఁ బూజించి స్వయముగగాని, యితరులచే గాని పారాయణము ప్రారంభించ వలయును

ప్రత్యహము సమాప్తి పర్యంతము ప్రారంభకాలములోఁ శై విధముగ నాచరింపవలయును, శ్రీ రామదూతయని ధ్యానముచేసి ప్రతిదినము సప్తసర్గ పారాయణము చేసినచో సర్వాభీష్టసిద్ధి కలుగును ప్రతిదినము సుందరకాండ పారాయణము చేయ వీలుకలుగనిచో, వాయునకొకపరిగాని మాసార్థముకాని, ఒక మాసముకాని, 25 దినములుకాని, నలుబది దినములు గానీ ప్రత్యహము సప్తసర్గ పారాయణము చేయవలయును॰

సప్తదినములలో సప్తసర్గ పారాయణము చేసినను ఫలప్రాప్తి కలుగును

ఆపత్కాలమున మాసాదినియమము లేదు యథాశక్తిగఁ బ్రతి దినము పారాయణము చేసికొనినను ఫలము కలదు ఒకపరి పారాయణము చేసిన పిదప ఉద్యాపనము చేయవలయును ఆ విధానము చెప్పెదను. ఒక మంటపము నేర్పరచి యైదుకుంచముల బియ్యము నచ్చటఁబోసి దాని మధ్యమున 'అష్టదళ పద్మమును' లిఖించి, దానిమీద రామచంద్ర మూర్తినావాహనముచేసి, ముందుభాగమున హనుమంతుని సువర్ణప్రతిమ నావాహనముచేసి, అష్టదిక్పాలురను ఆవాహనము చేసి పూజింపవలయును

ఇట్లు షోడశోపచార పూజలు చేసిన పిదప హనుమంతునిఁ గ్రింది విధముగ ధ్యానింపవలయును, "ఓరామదూత ! నీకు నమస్కారము. సీతాశోకనివారక ! ఓలక్ష్మణప్రాణదాతా ! నీకు నమస్కారము, నా మనోభీష్టమును సిద్ధింపజేయుము" "ఓయంజనాగర్భసంభవ ! లంకా ప్రాణాపహారక ! రావణోద్యాననాశకా! నీకు నమస్కారము నాయభీష్టమును సిద్ధింపజేయుము ఓవాయునందనా ! ఓ సుగ్రీవసచివా ! సముద్రలంఘనా! దుష్టరాక్షసమర్దనా! నీకు వందనము నాయభీష్టమును నెరవేర్చుము ఓ ఆపన్నివారకా! స్వామీ ! ప్రసన్నుడవై నీపాదపద్మముల సన్నిధినిఁ బొందిన నన్ను దయానిధీ ! రక్షింపుము "

ఇట్లు సాష్టాంగదండప్రణామము చేయుచు హనుమంతుని బ్రార్థించ వలయును పిదప ప్రతిమా సహితముగా మంటపమును దక్షిణా సహితముగ దానము చేయవలయును బ్రాహ్మణ సంతర్పణమును గూడ జేయవల యును పారాయణము చేసిన బ్రాహ్మణునకు సన్మానము చేయవల యును ఆ బ్రాహ్మణుడు సంతుష్టుడైనచో తన కార్యము తప్పక

సిద్ధించును పై విధముగ వ్రత మాచరించిన వానికి విజయము తప్పక కలుగును విద్యార్థి విద్యను, పుత్రార్థిపుత్రుని, కన్యార్థి కన్యను, ధనార్థి ధనమును సత్యముగఁ బొందగలడు

ఇట్లు సూతుడు చెప్పగా మహర్షులు తిరిగి ప్రశ్నించిరి. ఏమన, ఈ వ్రతము నెవ్వరైనను పూర్వము చేసి తమ యభీష్టసిద్ధినిఁ బొందినవారలుండిరా ! ఆ విషయమునుగూడ మాకు చెప్పుడనగా సూతుఁడిట్లు చెప్పెను. ఓ మహర్షులారా ! పూర్వము పరమేశ్వరుడు త్రిపుర సంహారము చేయబోవునపుడు పై విధముగా వ్రతము నాచరించి త్రిపుర సంహారము చేయగలిగెను అదియునుంగాక దేవేంద్రుడు వృత్రాసురుని సంహరింపదలచి యీ వ్రతము నాచరించి వానిని సంహరించెను అమృతమునకై దేవతలు సముద్ర మధనమునకై ప్రయత్నించునపుడివ్విధముగ హనుమంతుని బూజించి యమృతమును బొందగలిగిరి శ్రీకృష్ణుడు శమంతకమణిని దీసికొని వచ్చుటకు బోవునపుడు హనుమంతుని బై విధముగఁ బూజించి వెళ్ళి శమంతకమణిని దీసికొని రాగలిగెను వేదవ్యాసునిచేఁ బ్రేరేపింపబడి ధర్మరాజు యీ వ్రతమునుచేసి దుర్లభమైన విజయమును బొందెను మరియు రాజ్యభోగములను గూడఁ బొంద గలిగెను అందువలన ప్రయత్న పూర్వకముగ నీవ్రత మాచరింపవలయును

ఇట్లు సూతుడు చెప్పగా మహర్షులివ్విధముగ తిరిగి ప్రశ్నించిరి సూతమహర్షీ ! ఈవ్రతము రహస్యమైనదికదా ! ఎవరివలన నీవు వినియుంటివో మాయందలి గౌరవముచే, గోప్యమయినను చెప్పవలయును అని మునులు ప్రశ్నింప సూతుడిట్లు చెప్పెను మునులారా! నేనొకపుడు శివునిఁ బూజించుటకుఁ గైలాసపర్వతమున

కేగి యచ్చట బార్వతీ పరమేశ్వరులను జూచి పూజించి కొంతకాల మచ్చట నుంటిని

ఆ సమయమున పరమేశ్వరుడు పార్వతికి జెప్పుచుండగా నేను వినియుంటిని ఇది రహస్యమైనదనియు, భక్తిగలవానికే చెప్పవలయును గాని భక్తిహీనునకు నెప్పుడును చెప్పగూడదని, గోప్యముగ నుంచ దగినదియని పరమేశ్వరుడు పార్వతికి జెప్పగా నేను వినియుంటిని మునులారా! పూర్వ మీ విషయము నన్నెవరు నడిగియుండలేదు మీరలిప్పుడు ప్రశ్నించిరి కాన నీ వ్రతమును మీకుఁజెప్పితిని దీని నెవ్వరు పఠించెదరో, ఎవ్వరు వినెదరో, వారలు సకలాభీష్టములను బొందగలరు హనుమత్ప్రసాదమువలన సమస్త కార్యసిద్ధులను బొందెదరు

ఇట్లు వాయు పురాణమున సుందర కాండ వ్రతకల్పము సంపూర్ణము

ఏవం తిథౌ॥ గో॥ నా॥ ఆయుష్యాభివృద్ధ్యర్థం । హనుమత్సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న పరివారసమేత శ్రీ రామచంద్ర దేవతా ముద్దిశ్య శ్రీ రామచంద్ర దేవతా ప్రీత్యర్థం, సంభవద్భిర్ద్రవ్యైః। సంభవద్భిరుపచారై స్సంభవితా నియమేన శ్రీ రామచంద్రదేవతాం యావశ్శక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥ తదంగ కలశారాధనం కరిష్యే॥ కలశగంధ పుష్పాద్యై రలంకృత్య ॥

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః ।
మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణా స్థితాః ॥
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ॥
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబుసమాశ్రితాః ॥

మంత్రం :-

ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే । ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే ॥ ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతా న్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపోన్న మాపోఽమృత మాప స్సమ్రా డాప విరాడాప స్స్వరాడాప శ్ఛందాగ్ం స్యాపో జ్యోతీగ్ం ష్యాపో యజూగ్ం ష్యాప స్సత్య మాప స్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువ రాప ఓమ్ ॥

శ్లో॥ గంగే చ యమునేచైవ గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥

ఆయాంతు శ్రీ రామపూజార్థం దురితక్షయకారకా కలశోదకేన దేవ మాత్మానం పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య ॥ తతః పుష్పం గృహీత్వా సపరివారం శ్రీరామచంద్రం ధ్యాయేత్ ॥

శ్లో॥ కాలాంభోధర కాంతికాయ మనిశం వీరాసనాధ్యాసితం।
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజం జానుని
సీతా పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం మకుటాంగదాది వివిధాకల్పోజ్జ్వలం భజే ॥
సపరివారాయ శ్రీ రామచంద్రస్వామినే నమః ధ్యాయామి ॥

శ్లో॥ ఆవాహయామి విశ్వేశం జానకీవల్లభం హరిం।
కౌసల్యా తనయం విష్ణుం శ్రీ రామం ప్రకృతేః పరం ॥
శ్రీ॥ రా॥ ఆవాహయామి॥

శ్లో॥ రాజధిరాజ రాజేంద్ర రామచంద్ర మహీపతే।
రత్న సింహాసనం తుభ్యం దాస్యామి స్వీకురు ప్రభో ॥
శ్రీ॥ రా॥ రత్నసింహాసనం సమర్పయామి॥

శ్లో॥ త్రైలోక్య పావనోఽసి త్వం నమస్తే రఘునాయక।
పాద్యం గృహాణ రాజర్షేనమో రాజీవలోచన ॥
శ్రీ॥ రా॥ పాదయోః పాద్యం సమర్పయామి॥

శ్లో॥ పరిపూర్ణ పరానంద నమోరామాయ వేధసే ॥
గృహాణార్ఘ్యం మయాదత్తం కృష్ణ విష్ణో నమోస్తు తే ॥
శ్రీ॥ రా॥ హస్తయో రర్ఘ్యం సమర్పయామి ॥

శ్లో॥ గృహాణాచమనం నాథ సర్వలోకైక నాయక।
బ్రహ్మాండోదర సంస్థోసినమః శ్రీ రఘునాయక ॥
శ్రీ॥ సీ॥ రామాయనమః. ముఖే ఆచమనీయం సమర్పయామి॥

శ్లో॥ పయోదధి ఘృతోపేతం శర్కరా మధుసంయుతం ।
గృహాణ రామరాజేంద్ర స్నానం పంచామృతాంచితం ।
శ్రీ। సీ॥ రామ॥ శుద్ధోదక స్నానం స॥ మి॥

శ్లో॥ సంతప్తకాంచనమయం పీతాంబర మిదం హరే ।
సంగృహాణ జగన్నాథ రామచంద్ర నమోఽస్తు తే ।
శ్రీ। రా॥ దివ్యపీతాంబరం స॥ మి॥

శ్లో॥ శ్రీరామాచ్యుత గోవింద శ్రీధరానంత రాఘవ ।
బ్రహ్మసూత్రం చోత్తరీయం గృహాణ రఘునాయక ।
శ్రీ। రా॥ యజ్ఞోపవీతం స॥ మి॥

శ్లో॥ కిరీట హార కేయూర రత్న కంకణ మేఖలాః ।
గ్రై వేయం కౌస్తుభం చ మణికంకణ నూపురః ।
ఏవ మాదీని సర్వాణి భూషణాని నృపోత్తమ ।
అహం దాస్యామి సద్భక్త్యా సంగృహాణ జనార్దన ।
శ్రీ। సీరామ॥ అనర్ఘ రత్నాభరణాని సమర్పయామి॥

శ్లో॥ కుంకుమాగరుకస్తూరీ కర్పూరోన్మిశ్ర చందనం ।
తుభ్యం దాస్యామి దేవేశ శ్రీరామ స్వీకురు ప్రభో ।
శ్రీ। రా॥ దివ్య చందన హరిద్రాచూర్ణ కుంకుమాది
సుగంధ ద్రవ్యాణి సమర్పయామి ।

శ్లో॥ తులసీ కుంద మందార జాజీ పున్నాగ చంపకైః ।
కదంబ కరవీరైశ్చ కుసుమై శ్శతపత్రకైః ।
నీలాంబు జైర్బిల్వ దళైః పుష్పహారైశ్చ రాఘవ ।
పూజయామి మహాభక్త్యా సంగృహాణ జనార్దన ।
శ్రీ। రా॥ నానావిధ పరిమళపత్ర పుష్పాణి పూజయామి ।

# అథాష్టోత్తర శతనామపూజా

1 ఓమ్ శ్రీరామాయ నమః
2 ఓమ్ భద్రాయనమః
3 ఓమ్ రామచంద్రాయ నమః
4 ఓమ్ రాజీవలోచనాయ నమః
5 ఓమ్ శ్రీమతే నమః
6 ఓమ్ రాజేంద్రాయ నమః
7 ఓమ్ రఘుపుంగవాయ నమః
8 ఓమ్ జానకీ వల్లభాయ నమః
9 ఓమ్ జైత్రాయ నమః
10 ఓమ్ జితామిత్రాయ నమః
11 ఓమ్ జనార్దనాయ నమః
12 ఓమ్ విశ్వామిత్ర ప్రియాయ నమః
13 ఓమ్ దాంతాయ నమః
14 ఓమ్ శరణత్రాణతత్పరాయ నమః
15 ఓమ్ వాలిప్రమథనాయ నమః
16 ఓమ్ వాగ్మినే నమః
17 ఓమ్ సత్యవాచే నమః
18 ఓమ్ సత్యవిక్రమాయ నమః
19 ఓమ్ సత్యవ్రతాయ నమః
20 ఓమ్ వ్రత ధరాయ నమః
21 ఓమ్ సదాహనుమదాశ్రితాయ నమః
22 ఓమ్ కౌసలేయాయ నమః
23 ఓమ్ ఖరధ్వంసినే నమః
24 ఓమ్ విరాధవధ పండితాయ నమః
25 ఓమ్ విభీషణ పరిత్రాత్రే నమః
26 ఓమ్ దశగ్రీశిరోహరాయ నమః
27 ఓమ్ సప్త తాలప్రభేత్రే నమః
28 ఓమ్ హరకోదండఖండనాయ నమః
29 ఓమ్ జామదగ్న్యమహాదర్పదళనాయనమః
30 ఓమ్ తాటకాంతకాయనమః
31 ఓమ్ వేదాంతసారాయ నమః
32 ఓమ్ వేదాత్మనే నమః
33 ఓమ్ భవరోగస్యభేషజాయ నమః
34 ఓమ్ దూషణశిరోహంత్రే నమః
35 ఓమ్ త్రిమూర్తయే నమః
36 ఓమ్ త్రిగుణాత్మకాయ నమః
37 ఓమ్ త్రివిక్రమాయ నమః
38 ఓమ్ త్రిలోకాత్మనే నమః
39 ఓమ్ పుణ్యచారిత్రకీర్తనాయ నమః
40 ఓమ్ త్రిలోకరక్షకాయ నమః
41 ఓమ్ ధన్వినే నమః
42 ఓమ్ దండకారణ్యపుణ్యాకృతేనమః
43 ఓమ్ అహల్యాశాపశమనాయనమః
44 ఓమ్ పితృభక్తాయనమః
45 ఓమ్ వరప్రదాయ నమః
46 ఓమ్ జితేంద్రియాయ నమః
47 ఓమ్ జితక్రోధాయ నమః
48 ఓమ్ జితమిత్రాయ నమః
49 ఓమ్ జనార్దనాయ నమః
50 ఓమ్ ఋక్షవానర సంఘాతినే నమః
51 ఓమ్ చిత్రకూటసమాశ్రయాయ నమః
52 ఓమ్ జయంతత్రాణతత్పరాయ నమః
53 ఓమ్ సుమిత్రాపుత్రసేవితాయ నమః
54 ఓమ్ సర్వదేవాదిదేవాయ నమః

55 ఓమ్ సదానానం సేవితాయ నమః
56 ఓమ్ మాయామారీచహంత్రే నమః
57 ఓమ్ మహాభోగాయ నమః
58 ఓమ్ మహాభుజాయ నమః
59 ఓమ్ సర్వదేవస్తుత్యాయ నమః
60 ఓమ్ సౌమ్యాయ నమః
61 ఓమ్ బ్రహ్మణ్యాయ నమః
62 ఓమ్ ముని సంస్తుతాయ నమః
63 ఓమ్ మహాయోగినే నమః
64 ఓమ్ మహోదారాయ నమః
65 ఓమ్ సుగ్రీవేప్సితరాజ్యదాయనమః
66 ఓమ్ సర్వపుణ్యాధిఫలాయ నమః
67 ఓమ్ స్మృతసర్వాఘనాశనాయ నమః
68 ఓమ్ ఆదిపురుషాయ నమః
69 ఓమ్ మహాపురుషాయ నమః
70 ఓమ్ పురాణపురుషస్తుతాయనమః
71 ఓమ్ పుణ్యోదయాయ నమః
72 ఓమ్ దయాసారాయ నమః
73 ఓమ్ పురాణపురుషోత్తమాయ నమః
74 ఓమ్ స్మితవక్త్రాయ నమః
75 ఓమ్ మితభాషిణే నమః
76 ఓమ్ పూర్వభాషిణే నమః
77 ఓమ్ రాఘవాయ నమః
78 ఓమ్ అనంతగుణగంభీరాయ నమః
79 ఓమ్ ధీరోదాత్త గుణాశ్రయాయ నమః
80 ఓమ్ మాయామానుషచారిత్రాయ నమః
81 ఓమ్ మహాదేవాదిపూజితాయనమః
82 ఓమ్ సేతుకృతే నమః
83 ఓమ్ జితవారాశయే నమః
84 ఓమ్ సర్వతీర్థమయాయ నమః
85 ఓమ్ హరయే నమః
86 ఓమ్ శ్యామాంగాయ నమః
87 ఓమ్ సుందరాయ నమః
88 ఓమ్ శూరాయ నమః
89 ఓమ్ పీతవాససే నమః
90 ఓమ్ ధనుర్ధరాయ నమః
91 ఓమ్ సర్వయజ్ఞాధిపాయ నమః
92 ఓమ్ యజ్వినే నమః
93 ఓమ్ జరామరణవర్జితాయ నమః
94 ఓమ్ శివలింగ ప్రతిష్ఠాత్రే నమః
95 ఓమ్ సర్వాభరణభూషితాయ నమః
96 ఓమ్ పరమాత్మనే నమః
97 ఓమ్ పరబ్రహ్మణే నమః
98 ఓమ్ సచ్చిదానందవిగ్రహాయ నమః
99 ఓమ్ పరస్మై జ్యోతిషే నమః
100 ఓమ్ పరస్మైధామ్నే నమః
101 ఓమ్ పరాకాశాయ నమః
102 ఓమ్ పరాత్పరాయ నమః
103 ఓమ్ పరేశాయ నమః
104 ఓమ్ పారగాయ నమః
105 ఓమ్ పారాయ నమః
106 ఓమ్ సర్వదేవాత్మకాయ నమః
107 ఓమ్ శివాయ నమః

108 శ్రీ సీతాలక్ష్మణహనుమత్పరివారసమేత శ్రీరామచంద్రాయ నమః
శ్రీ । రా । నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి

శ్లో॥ వనస్పత్యుద్భవైర్దివ్యై ర్నానాగంధైస్సుసంయుతః
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం ।
శ్రీ । రా । ధూపమాఘ్రాపయామి

శ్లో । సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా యోజితం మయా ।
గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహం ।
శ్రీ ॥ రా॥ దీపం దర్శయామి

ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి ।

శ్లో । ఇదం దివ్యాన్న మమృతం రసై ష్షడ్భి స్సమన్వితం ।
శ్రీరామరామ రాజేంద్ర నైవేద్యం ప్రతిగృహ్యతాం ।
శ్రీ రా । నైవేద్యం సమర్పయామి ।

శ్లో । పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ।
సచూర్ణం జానకీనాథ తాంబులం ప్రతిగృహ్యతాం ।
శ్రీ । రా॥ తాంబూలం,సువర్ణపుష్పదక్షిణాంసమర్పయామి

శ్లో । మంగళార్థం మహీపాల నీరాజన మిదం హరే ।
సంగృహాణ జగన్నాథ రామచంద్ర నమోస్తుతే ।
శ్రీ । రా॥ మంగళ నీరాజనం దర్శయామి ।

శ్లో । తప్త జాంబూనదేనైవ నిర్మితం రత్నభూషితం ।
మంత్రపుష్పం ప్రదాస్యామి రఘుశ్రేష్ఠ నమోస్తు తే
శ్రీ । రా॥ మంత్ర పుష్పం సమర్పయామి ।

శ్లో॥ యాని కాని చ పాపాని జన్మాంతరకృతానిచ।
తాని తాని ప్రణశ్యంతు ప్రదక్షిణ పదేపదే॥
శ్రీ॥ రా॥ ఆత్మప్రదక్షిన నమస్కారాన్ సమర్పయామి॥

శ్లో॥ నమో బ్రహ్మణ్య దేవాయ రామాయాఽకుంఠమేధసే
ఉత్తమశ్లోకధుర్యాయ న్యస్త దండార్పితాంఘ్రయే॥
ఇందీవరదళశ్యామో రామో రాజీవలోచనః
మానసే వర్తతే యస్యాం తాం సీతాం ప్రణమామ్యహం॥
ద్వితో రామ నమ స్త్రితో దశకృత్వ సహస్రధా
శతకృత్వోఽనంతకృత్వో భూయో భూయో నమోస్తుతే।
శ్రీ॥రా॥ దండవ త్ప్రణామం సమర్పయామి॥

శ్లో॥ నృత్త గీతైశ్చ వాద్యైశ్చ పురాణ పఠనాదిభిః
రాజోపచారై రఖిలై స్సంతుష్టో భవ రాఘవ।
శ్రీ॥రా॥ రాజోపచారాన్ సమర్పయామి॥

అనేన మయా కృతేన షోడశోపచార పూజనేన సపరివార శ్రీరామ స్సుప్రీతో స్సుప్రసన్నో వరదో భవతు॥

అని అక్షతలు ఉదకము వదలిపెట్టవలెను
శ్రీరామచంద్ర ప్రసాదం శిరసా గృహ్ణామి.
శ్రీరామ తారకమంత్రమును యధాశక్తి జపించేది.

# శ్రీ హనుమత్పూజ విధానము

పూ॥ తిథౌ॥ గో॥ నా॥ మమ శరీర ఆవాహిత గర్భస్థిత సమస్త భూత ప్రేత పిశాచాది సర్వబాధా నివృత్త్యర్థ్యం, దుష్ట స్థాన స్థితా యే యే గ్రహాః తద్దోష పరిహారార్థం శ్రీహనుమత్పూజా ప్రదక్షిణాని కరిష్యే॥ తదాదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే॥ అథ హనుమత్పూజా విధిః ॥

శ్లో॥ అంజనానందనం వీరం కోటి బాలార్క సన్నిభం
ధ్యాయామ్యహం రామదూతం సర్వదా హృదయాంబుజే ।
శ్రీమదాంజనేయ పరబ్రహ్మణే నమః । ధ్యానం స॥ మి ।

శ్లో॥ ఆవాహయామి పింగాక్షం మహావీర్యం మహాబలం
వాయుసూనుం రామభక్తం లంకానిర్మూలకారణం ।
శ్రీ॥ ఆం॥ ఆవాహనం సమర్పయామి ।

శ్లో॥ రత్న సింహాసనం చారు జాంబూనదమయం శుభం
ప్రీత్యర్థం తవ దాస్యామి సంగృహాణ ద్రుతం ప్రభో ।
శ్రీ॥ ఆం॥ రత్న సింహాసనం సమర్పయామి ।

శ్లో॥ పాద్యం దదా మ్యహం భక్త్యా నిర్మలం పావనం శుభం
గృహాణ వానరాధీశ సుగ్రీవప్రియబాంధవ ।
శ్రీ॥ ఆం॥ పాద్యం సమర్పయామి ।

శ్లో॥ అర్ఘ్య మష్టాంగ సంయుక్తం శుభ్రం తే ప్రదదామ్యహం ।
గృహ్యతాం కరుణాసింధో పీతవస్త్రం ప్రసీద భో ।
శ్రీ॥ ఆం॥ అర్ఘ్యం సమర్పయామి ।

శ్లో॥ వాసితం సర్వతీర్థేభ్య ఆపీతం శీతలం శుభం।
దదా మ్యాచమనార్థం తే గృహ్యతా మంజనాసుత ॥
శ్రీ॥ ఆం॥ ముఖే ఆచమనీయం సమర్పయామి ।
యత్పురుషేణ హవిషా । పంచామృతస్నానం స॥ మి ।

శ్లో॥ గంగా గోదావరీ ముఖ్య నదీభ్య స్సముపాహృతం।
జలం దదామి స్నానార్థం స్వీకురుష్వ హరీశ్వర ।
శ్రీ॥ ఆం॥ శిరస్స్నానం సమర్పయామి ।

శ్లో॥ నవరత్నమయీం దివ్యాం మేఖలాం హేమనిర్మితాం ।
దదామి తుభ్యం గృహ్ణీష్వ శ్రీరామప్రియ మారుతే ॥
శ్రీ॥ ఆం॥ కటిసూత్రం సమర్పయామి ॥

శ్లో॥ పీతకౌశేయ కౌపీనం ధార్యం చ బ్రహ్మచారిభిః ।
అర్పయామి మహాబాహో గృహాణ పవనాత్మజ ॥
శ్రీ॥ ఆం॥ కౌపీనం సమర్పయామి ॥

శ్లో॥ పీతవస్త్ర యుగం దేవ ప్రయచ్ఛామి తవ ప్రభో
ప్రీత్యర్థం పావనే మహ్యం ప్రసీద కరుణాకర ॥
శ్రీ॥ ఆం॥ వస్త్ర యుగ్మం సమర్పయామి ॥

శ్లో॥ రాజితం బ్రహ్మసూత్రం చ నిర్మితం బ్రహ్మణా పురా ।
ప్రీత్యర్థం తవ దాస్యామి సంగృహాణ కపీశ్వర ।
శ్రీ॥ ఆం॥ బ్రహ్మసూత్రం సమర్పయామి ॥

శ్లో॥ చందనం రోచనామిశ్రం హరిద్రా కుంకుమాన్వితం ।
స్వీకురుష్వ దయాసింధో మయార్పిత మిదం ప్రభో ।
శ్రీ॥ ఆం॥ దివ్యచందనం సమర్పయామి ।

శ్లో॥ అక్షతాం శ్చవ దాస్యామి హరిద్రాక్తాన్ శుభప్రదాన్ ।
రామప్రియ సమస్తార్థ్యం సంగృహాణాఽంజనాసుత ॥
శ్రీ ఆం॥ అక్షతాన్ సమర్పయామి ।

శ్లో॥ కిరీట హార కేయూర కటకాంగుళి ముద్రికాః ।
ధారయస్వ మయా దత్తా భక్త్యా కపికులోత్తమ ॥
శ్రీఆం॥ సర్వాభరణాని సమర్పయామి ।

శ్లో॥ చంపకాశోక పున్నాగ జాజీ మందార చంపకైః ।
త్వాం పూజయామ్యహం భక్త్యా సుప్రసీదాఽంజనాసుత ॥
శ్రీ ఆం॥ నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి ।

## అథాంగపూజా

ఓం హనుమతే నమః పాదౌ పూజయామి । గూఢ గుల్ఫాయ నమః గుల్ఫౌ పూజయామి । అంజనాగర్భ సంభూతాయ నమః జంఘే పూజయామి । అతి బలపరాక్రమాయ నమః ఊరూ పూజయామి । ఉదధి లంఘనాయనమః కటిం పూజయామి । సీతాశోకాపహారిణే నమః నాభిం పూజయామి । కాలనేమిమధనాయ నమః హృదయం పూజయామి । మకరీవిపాటనాయనమః స్తనౌ పూజయామి । సంజీవన ధరాధర ధారిణే నమః బాహూ పూజయామి । సుగ్రీవ సచివాయనమః గ్రీవం పూజయామి । లక్ష్మణ ప్రాణదాత్రే నమః శిరః పూజయామి । భక్తాభీష్టప్రదాయకాయ నమః సర్వాణ్యంగాని పూజయామి ॥

## అథదిక్పాలపూజా

ఇంద్రాయ నమః । అగ్నయే నమః । యమాయ నమః । నైరుతయే నమః । వరుణాయ నమః । వాయవే నమః । కుబేరాయ నమః । ఈశానాయ నమః ।

# అథాంజనేయాష్టోత్తర శత నామావళిః

1 ఓం ఆంజనేయాయ నమః
2 ఓం మహావీరాయ నమః
3 ఓం హనుమతే నమః
4 ఓం మారుతాత్మజాయ నమః
5 ఓం తత్త్వజ్ఞానప్రదాయ నమః
6 ఓం సీతాదేవీముద్రాప్రదాయనమః
7 ఓం అశోకవనికాచ్ఛేత్రే నమః
8 ఓం సర్వమాయావిభంజనాయ నమః
9 ఓం సర్వబంధవిమోక్త్రే నమః
10 ఓం రక్షోవిధ్వంసకారకాయనమః
11 ఓం పరవిద్యాపరిహారాయ నమః
12 ఓం పరశౌర్యవినాశకాయ నమః
13 ఓం పరమంత్రనిరాకర్త్రే నమః
14 ఓం పరమంత్రప్రభేదకాయనమః
15 ఓం సర్వగ్రహవినాశినే నమః
16 ఓం భీమసేనసహాయకృతేనమః
17 ఓం సర్వదుఃఖహరాయ నమః
18 ఓం సర్వలోకచారిణే నమః
19 ఓం మనోజవాయ నమః
20 ఓం పారిజాతమూలస్థాయ నమః
21 ఓం సర్వమంత్రస్వరూపవతే నమః
22 ఓం సర్వతంత్రస్వరూపిణేనమః
23 ఓం సర్వయంత్రాత్మకాయనమః
24 ఓం కపీశ్వరాయ నమః
25 ఓం మహాకాయాయ నమః
26 ఓం సర్వరోగహరాయ నమః
27 ఓం ప్రభవే నమః
28 ఓం బలసిద్ధికరాయ నమః
29 ఓం సర్వవిద్యాసంపత్ప్రదాయ నమః
30 ఓం కపిసేనానాయకాయ నమః
31 ఓం భవిష్యచ్చతురాననాయ నమః
32 ఓం కుమారబ్రహ్మచారిణే నమః
33 ఓం రత్నకుండలదీప్తిమతే నమః
34 ఓం సంచలద్వాలసన్నద్ధలంబ
మానశిఖోజ్వలాయ నమః
35 ఓం గంధర్వవిద్యాతత్త్వజ్ఞాయ నమః
36 ఓం మహాబలపరాక్రమాయనమః
37 ఓం కారాగృహవిమోక్త్రే నమః
38 శృంఖలాబంధమోచకాయ నమః
39 ఓం సాగరోత్తారకాయ నమః
40 ఓం ప్రాజ్ఞాయ నమః
41 ఓం రామదూతాయ నమః
42 ఓం ప్రతాపవతే నమః
43 ఓం వానరాయ నమః
44 ఓం కేసరిసూనవే నమః
45 ఓం సీతాశోకనివారకాయ నమః
46 ఓం అంజనాగర్భ సంభూతాయ నమః
47 ఓం బాలార్కసదృశాననాయ నమః
48 ఓం విభీషణ ప్రియకరాయ నమః
49 ఓం దశగ్రీవకులాంతకాయ నమః
50 ఓం లక్ష్మణప్రాణదాత్రే నమః
51 ఓం వజ్రకాయాయ నమః
52 ఓం మహాద్యుతాయ నమః
53 ఓం చిరంజీవినే నమః
54 ఓం రామభక్తాయ నమః
55 ఓం దైత్యకార్యవిఘాతకాయ నమః
56 ఓం అక్షహంత్రే నమః
57 ఓం కాంచనాభాయ నమః

58 ఓం పంచవక్త్రాయ నమః
59 ఓం మహాతపసే నమః
60 ఓం లంకిణీభంజనాయ నమః
61 ఓం శ్రీమతే నమః
62 ఓం సింహికాప్రాణభంజనాయ నమః
63 ఓం గంధమాదనశైలస్థాయ నమః
64 ఓం లంకాపురవిదాహకాయ నమః
65 ఓం సుగ్రీవసచివాయ నమః
66 ఓం ధీరాయ నమః
67 ఓం శూరాయ నమః
68 ఓం దైత్యకులాంతకాయ నమః
69 ఓం సురార్చితాయ నమః
70 ఓం మహాతేజసే నమః
71 ఓం రామచూడామణిప్రదాయ నమః
72 ఓం కామరూపిణే నమః
73 ఓం పింగళాక్షాయ నమః
74 ఓం వార్ధిమైనాక పూజితాయ నమః
75 ఓం కబళీకృతమార్తాండమండలాయ నమః
76 ఓం విజితేంద్రియాయ నమః
77 ఓం రామసుగ్రీవసంధాత్రే నమః
78 ఓం మహారావణమర్దనాయ నమః
79 ఓం స్ఫటికాభాయ నమః
80 ఓం వాగధీశాయ నమః
81 ఓం నవవ్యాకృతిపండితాయ నమః
82 ఓం చతుర్బాహవే నమః
83 ఓం దీనబంధవే నమః
84 ఓం మహాత్మనే నమః
85 ఓం భక్త వత్సలాయ నమః
86 ఓం సంజీవన నగాహర్త్రే నమః
87 ఓం శుచయే నమః
88 ఓం వాగ్మినే నమః
89 ఓం దృఢవ్రతాయ నమః
90 ఓం కాలనేమిప్రమథనాయ నమః
91 ఓం హరిమర్కట మర్కటాయ
92 ఓం దాంతాయ నమః
93 ఓం శాంతాయ నమః
94 ఓం ప్రసన్నాత్మనే నమః
95 ఓం శతకంఠమదాపహృతే నమః
96 ఓం యోగినే నమః
97 ఓం రామకథాలోలాయ నమః
98 ఓం సీతాన్వేషణపండితాయనమః
99 ఓం వజ్రదంష్ట్రాయ నమః
100 ఓం వజ్రనఖాయ నమః
101 ఓం రుద్రవీర్య సముద్భవాయ నమః
102 ఓం ఇంద్రజిత్ప్రహితామోఘ బ్రహ్మాస్త్ర వినివారకాయ నమః
103 ఓం పార్థధ్వజాగ్రసంవాసినేనమః
104 ఓం శరపంజర భేదకాయ నమః
105 ఓం దశబాహవే నమః
106 ఓం లోకపూజ్యాయ నమః
107 ఓం జాంబవత్ప్రీతివర్ధనాయనమః
108 ఓం సీతా సమేత శ్రీ రామ పాదసేవాధురంధరాయ నమః

శ్రీ । అం । నానావిధ పరిమళపత్ర పుష్పాణి సమర్పయామి ।

శ్లో॥ వనస్పతి సముద్భూతైః గంధాఢ్యైః సుమనోహరైః ।
గుగ్గులాద్యైః సుఘోపేతః ధూపోయం ప్రతిగృహ్యతాం ।
శ్రీ। అం॥ ధూప మాఘ్రాపయామి ।

శ్లో॥ సర్వవర్తిత్రయోపేతం గోఘృతేన ప్లుతం శుభం ।
సకలధ్వాంతహరణం దీపం తే దర్శయామ్యహం ।
శ్రీ। అం॥ దీపం సందర్శయామి

శ్లో॥ నైవేద్యం షడ్రసోపేతైః ర్భక్ష్యైః ర్భోజ్యైః సమన్వితం ।
మధురైః ర్మృదులైః ర్నిత్యం అర్పయామ్యరిమర్దన ।
శ్రీ। అం॥ నైవేద్యం సమర్పయామి

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి।హస్తౌ ప్రక్షాళయామి ।
పాదౌ ప్రక్షాళయామి । శుద్ధాచమనీయం సమర్పయామి ।

శ్లో॥ పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ।
శ్రీ అం॥ తాంబూలం సమర్పయామి ।

శ్లో॥ స్వర్ణపాత్ర స్థితం చారు ప్రదీప్తం తిమిరాపహం
కర్పూరహారతిం దివ్యం స్వీకురుష్వ శివాంశజ ।
శ్రీ అం॥ ఉత్తర నీరాజనం దర్శయామి ।

శ్లో॥ మందారైః పారిజాతైశ్చ మల్లికాభిశ్చ చంపకైః ।
పుష్పాంజలిం ప్రదాస్యామి స్వర్ణపద్మైః సమన్వితం ।
శ్రీ అం॥ సువర్ణమంత్రపుష్పం సమర్పయామి ।

శ్లో॥ ప్రదక్షిణం కరోమి త్వాం భక్తియుక్తేన చేతసా ।
బహుజన్మార్జితం పాపం శమయే ద్వాయునందన ।
శ్రీ అం॥ ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ।

శ్లో ఉమాధీశ తేజో సముద్భూత నిత్యం
సమాశ్లిష్టసిద్ధిం కురుష్వ ప్రసన్న ।
నమామి త్వదీయాంఘ్రియుగ్మారవిందౌ ।
సమస్తాపరాధం క్షమస్వ ప్రభో మే ।
శ్రీ ఆం॥ క్షమాపణం సమర్పయామి ।

శ్లో రామదూత నమస్తుభ్యం సీతాశోక వినాశక ।
లక్ష్మణస్య ప్రాణదాతా కురు మ ద్వాంఛితం ఫలం ।
అంజనా గర్భ సంభూతా లంకా ప్రాణాపహారక ।
రావణోద్యాన విధ్వంసీ కురు మ ద్వాంఛితం ఫలం ।
ప్రసన్నో భవ మే స్వామిన్ ప్రపన్నార్తి ప్రభంజన ।
త్వత్పాద సన్నిధిం ప్రాప్తం పాహి మాం కరుణాకర ।
శ్రీ ఆం॥ అనేక నమస్కారా సమర్పయామి ।

శ్లో యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ ।
తాని తాని ప్రణశ్యంతు ప్రదక్షిణ పదే పదే ।
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః ।
త్రాహి మాం నరకాద్ఘోరాత్ వాయుపుత్ర నమోస్తుతే ।

శ్రీ ఆం॥ ఆత్మప్రదక్షిణం సమర్పయామి అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మక శ్రీమదాంజనేయ స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవ ఇతి జలం నిక్షిపేత్ ॥

శ్రీ సుందర హనుమద్వైభవే
ద్వితీయోధ్యాయ స్సమాప్తః

# తృతీయ అధ్యాయము

ఋషయః

శ్లో॥ "సంకటే విషమే ప్రాప్తే క ఉపాయో వదస్వ నః" ఇత్యుక్తః ।
కుంభజో హృష్టభూత్వా ఋషీన్ ప్రోవాచ పూర్ణధీః ॥

తా॥ మహామునులెల్లరు నగస్త్యమహర్షింజేరి ప్రణమిల్లి వినయమున నంజలులఁబట్టి యో మహర్షి చంద్రమా! విషమమైన సంకటము వచ్చి నపుడు దానిఁ దొలగింపనగు నుపాయము మాకు దయతో దెల్పుఁడని ప్రార్థింప న మ్మునులకు పూర్ణజ్ఞానియగు నక్కలశభవుండు హర్షముతో నిట్లు చెప్పఁ గడంగెను ।

శ్లో॥ పశుపుత్రప్రదం పౌత్ర వృద్ధిదం కల్మషాఽపహమ్ ।
జ్ఞానభక్తిప్రదం నృణాం ముక్తి వైరాగ్యదాయకమ్ ।
దుర్భిక్ష భేదనం సద్య స్సువృష్టిప్రద మవ్యయమ్ ।
క్షయాఽపస్మారకుష్ఠాది సర్వరోగ నివారణమ్ ।
కామధేనుసమం భూమౌ కల్పవృక్షసమం భువి ॥

తా॥ నరులకు పశువృద్ధికరమును, పుత్రపౌత్రాదుల నిచ్చి పెంపొందించునదియు, పాపహరమును, భక్తిజ్ఞానముల నిడునదియు, ముక్తివి, వైరాగ్యము నొసగునదియు, కరువును పోగొట్టునదియు, వెంటనే సువృష్టి నిచ్చునదియు, క్షయ, కుష్ఠు మొదలగు రోగములనెల్ల నివారించునదియు, ధరలో కామధేనువు, కల్పవృక్షము వంటిదియును, మఱియు

శ్లో॥ గృహవృద్ధికరం పుంసాం, చింతితార్థప్రదాయకమ్ ।
దుర్నిమిత్తహరం శుద్ధం వాక్పటుత్వప్రదాయకమ్ ।

శ్లో॥ సర్వవశ్యకరం ప్రోక్తం వైదేశిక విదర్శనమ్ ।
బ్రహ్మతేజోఽభివృద్ధిం చ దుర్ఘటార్థప్రదాయకమ్ ।
భూత బేతాళ కూశ్మాండభేదకం సర్వసిద్ధిదమ్ ।
రాజకార్యానుకూల్యం చ సర్వకష్ట నివారణమ్ ।
వాదార్థసిద్ధిదం లోకే సర్వవశ్యప్రదాయకమ్ ।
సర్వమంగళదం నృణాం దారిద్ర్య భయనాశనమ్ ।

తా॥ గృహమునకు సర్వారిష్టములు తొలగించి, అభివృద్ధిని దెచ్చునదియు, తలచిన కోర్కెలనొసంగునదియు, దుర్నిమిత్తములనగు కీడు బాపునదియు, శుద్ధమగు వాక్పటుత్వమును ప్రసాదించునదియు సర్వమును వశ్యముగా సలుపునదియు, అన్యదేశ వృత్తాంతమునుగూడ తెలియజేయునదియు, బ్రహ్మ తేజస్సు నిచ్చునదియు, దుర్ఘటములగు కార్యముల సమకూర్చునదియు, భూత భేతాళ కూశ్మాండాది గ్రహబాధ నడగించునదియు, సిద్ధుల నెల్ల స్వాధీనము చేయునదియు, రాజకార్యానుకూలత గూర్చి కష్టముల నన్నిటిని దాటించి వాదములయందు జయము సమకూర్చి అనేక శుభముల నిచ్చి దారిద్ర్యభయమును బోగొట్టునట్టిదియు ।

శ్లో॥ సుందరకాండ మఖిలం కృత్వా పారాయణం సకృత్
కృత్వా న్యాస విధానేన ధ్యాత్వా వాయుసుతం హృది ।
పారాయణం చరే ద్ధీమాన్, సుందరం సర్వదాయకమ్

తా॥ ఒక్కమారు సుందరకాండమునంతయు నియమముతోఁ బారాయణ మొనరించుటయే, మొదలుగా విధానముతో న్యాసముచేసి, హృదయమున నాంజనేయుని ధ్యానించి, బుద్ధిమంతుఁడై, సర్వ ఫలదాయకమగు సుందరకాండ పారాయణముఁ జేయవలయును

శ్లో॥ న్యాసహీనం హరే దాయు ర్ధ్యానహీనేన విఘ్నకమ్ ।
కీలకేన వినా రోగీ శక్తిహీనే దరిద్రతా ॥
కోశ పూజన హీనేతు సర్వనాశో భవే ద్ధ్రువమ్ ।
బీజహీనే జ్ఞానహీనో భవే న్నాత్ర తు సంశయః ॥
షడ్వర్ణ జపహీనేతు మూలతంత్ర విహీనతః ।
నింద్యో భవే త్కళత్రాణాం నాశమేతి న సంశయః ॥
గురుభక్తి విహీనేతు నిష్ఫలం నాత్ర సంశయః ॥

తా॥ అంగన్యాసరహితముగ బారాయణ చేసినచో ఆయుర్దా యమును హరించును ధ్యానము లేకుండగఁ బఠించినచో దారిద్ర్యము వచ్చును గ్రంధమును బూజింపకుండఁ బారాయణము చేసినచో నిశ్చయముగ సర్వనాశము గలుగును బీజహీనముగఁ బారాయణము చేసినచో జ్ఞానహీనుడగును మూలమంత్రమును జపింపకపోయినచో కళత్రమునకు హాని కలుగును గురుభక్తి లేనిచో నిష్ఫలమగును

శ్లో॥ హనుమద్విజయం కాండం యః పారాయణ మాచరేత్ ।
విధినా సర్వసిద్ధిం చ ప్రాప్నోతి చ న సంశయః ॥

తా॥ హనుమద్విజయ కాండను (సుందర కాండను) విధిప్రకార మెవరు పారాయణము చేయుదురో వారు సర్వసిద్ధులను బొందెదరు సందియము లేదు సూర్యోదయమునకు రెండు గడియల పూర్వమే పారాయణము నారంభింపవలయును

శ్లో॥ మండలాంతం చరే ద్యస్తు మండలాధిపతి ర్భవేత్
సుందరం కాండ మఖిలం చతుర్వింశతి వాసరే।
పారాయణం చరే ద్యస్తు లభే త్పుత్రాంశ్చ సుందరాన్।
హనుమద్విజయం కాండం శుద్ధః పారాయణం చరేత్।
ద్వి షష్టి దినాని యక్షేశమిత్రో భవతి నాన్యథా।

తా॥ నలుబది దినములు పారాయణము చేసినవాడు మండలాధిపతి యగును, ఇరువదినాలుగు దినములలో పారాయణ మాచరించిన సుందరులగు పుత్రులు గలుగుదురు పరిశుద్ధిగలవాడై యీ హనుమ ద్విజయ కాండమును నిరువది రెండు దినములు పఠించినవారు కుభేరుని వంటి ధనము గలవారగుదురు

శ్లో॥ వృష్టికామ స్సప్త రాత్రం జ్ఞానకామ స్తథైవచ।
జయకామో మండలాంతం భూకామీ తథైవచ
పశుకామః పంచరాత్రం శంకీ వై మండలం శుభం।
అన్నార్థీ తు చతుర్వింశ ద్దినాని చ న సంశయః।
ఆయు రారోగ్య మైశ్వర్యం భవే త్పారాయణే సదా।

తా॥ వర్షమునుగోరువారు సప్తరాత్ర పారాయణ చేయవలయును జ్ఞానకాముడు, జయకాముడు, భూకాముడు మండలాంతము (నలుబది దినములు) చేయవలయును పశుకాముడు అయిదు దినములు చేసిన చాలును, అన్నార్థియగువాడు ఇరువదినాలుగు దినములు పారాయణము చేయవలయును పారాయణము వలన ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగును

శ్లో॥ పారాయణం సదా యస్తు కుర్యా ద్భక్తి సమన్వితః
నిష్కామీ వా ఋషిశ్రేష్ఠ నియమస్తు యథోచితమ్ ।
సకామీ నియమేనైవ చరే త్పారాయణం శుభం ।
అక్షారలవణాశీచ, తాంబూలం వర్జయే ద్బుధః ।
తైలాభ్యంగోపి న ప్రోక్తం సకామస్య విశేషతః ।
నారీ సంగం వృథావార్తాం కండూతిం పరదూషణమ్ ।
తంద్రాం ప్రమాదం నిద్రాం చ హాస్య స్త్రీ భాషణంతథా ।

తా॥ భక్తి శ్రద్ధలతో నెవడు పారాయణము చేయునో అతడు నిష్కాముడైన నియమము మాత్రము పూర్వము నందు జెప్పబడిన విధముగ గాక యథోచితముగ నని తెలియవలయును సకాముడు నియమముతోనే చేయవలయును నియమ మిట్లుండ వలయును ఉప్పు కారములను వర్జంవవలయును తాంబూలమును విసర్జించవలయును సకామునకు తైలాభ్యంగము కూడదు స్త్రీసంగమును, వ్యర్థప్రలాపము, పరదూషణము, తంద్ర, ప్రమాదము, నిద్ర, హాస్యము, స్త్రీలతో నెక్కువగ సంభాషించుట కూడదు

శ్లో॥ మధురం చైవ భక్ష్యం చ కేవలం సక్తుభక్షణం ।
నిష్పంగీ భూమిశయనో చరే త్పారాయణం శుభమ్ ।

తా॥ మధురపదార్థ భక్షణము సక్తుపిండి భక్షణము చేయవలయును నిష్పంగుడై భూమియందుశయనించుచుండవలెను పారాయణమివ్విధముగ జేసిన శుభము కలుగును

శ్లో॥ మధ్యే పారాయణం యస్తు లోకవార్తా ముదాహరేత్
పారాయణం తు సకలం నిష్ఫలం నాత్ర సంశయః ।

మౌనీ పారాయణం కృత్వా సర్వాభీష్ట మవాప్నుయాత్ ।
యది స్యా జ్జృంభణాదిని శరీరేతు మహర్షయః
త్రిరాచమ్య ప్రమృజ్యాథ నేత్రే పారాయణం చరేత్ ।

తా॥ పారాయణ మధ్యలో లోకవార్తలు చెప్పినచో పారాయణ మంతయు వ్యర్థమగును మౌనముతో పారాయణము చేసినవారికి సర్వాభీష్టములు కలుగును ఆవలింతలు, తుమ్ములు మొదలగునవి కలిగినపుడు రెండుపర్యాయము లాచమనము చేసి నేత్రములను నీటితో తుడుచుకొని పిదప పారాయణము చేయవలయును

శ్లో॥ స్వయం కర్తు మశక్తో వా బ్రాహ్మణై కారయే చ్ఛుభం
ఆశు రోగ ప్రశమనం త్రిదినా త్సప్తవారకమ్
పారాయణంతు కృత్వా తు రోగశాంతి ర్భవిష్యతి ।

శ్లో॥ ప్రథమే ద్విః ద్వితీయే త్రి ష్తృతీయే తు ద్వివారకమ్ ।
ఆవర్తనస్య చైకస్య ద్వినిష్కం పుష్క మీరితం ।
దత్వా నిష్కాని సద్భక్త్యా యథాశక్త్యా మహర్షయః
నిత్యం యః పఠయేత్కాండంహనుమద్విజయాంకితమ్
మహేశపద మాసాద్య భక్తిత స్తేన పూజితః ।
సత్యలోకాధిపో భూయా న్నాత్రకార్యా విచారణా ।

తా॥ పారాయణము స్వయముగఁ జేయలేనపుడు బ్రాహ్మణులతో చేయించవలయును సకల శుభములు కలుగును త్రిరాత్రములుకాని, సప్తరాత్రములుకాని పారాయణము చేసినచో రోగశాంతి కలుగును ఒకట రెండు మూడు దినములలో రెండు పర్యాయములు పారాయణము చేయించి ఒక్కొక ఆవృత్తికి ఒక్కొక నిష్కము (వరహా) చొప్పున

రెండావృత్తులకు రెండు విప్రులకును విప్రవలయును విప్రులను యథాశక్తిగ నిచ్చి, యెవరు పారాయణము చేయించెదరో వారు ఇంద్ర పదమును(స్వర్గమును) పొంది వారిచే పూజితుడై సత్యలోకమునుగూడ బొందు ననుటకు సందియములేదు

శ్లో॥ కృత్వా తు సుందరకాండం పారాయణ మఘాపహమ్ ।
సురో భూయా న్న సందేహః కిముతాఖిలసంపదః ।
జన్మ ప్రభృతి యత్పాపం యత్పాపం పూర్వజన్మని ।
నశ్యత్యేవ నసందేహః సకృత్పారాయణేన చ ।
ఏత త్సుందరకాండేన సమో మంత్రోన విద్యతే ।
తత్పారాయణత స్సిద్ధి రితి బ్రహ్మానుశాసనమ్ ।

శ్లో॥ సమస్త మంత్రరాజోఽయం సంశయ స్తత్ర నాస్తి వై ।
బీజకాండ మితి ప్రోక్తం సర్వ రామాయణేష్వపి ।
తస్మా త్పారాయణం కృత్వా ధన్యాభవత తత్వతః ।

తా॥ సర్వపాపహరమైన సుందరకాండ పారాయణము చేసిన వారలు దేవత్వమునే పొందెదరని చెప్పగా, సర్వ సంపదలు కలుగునని వేరుగ జెప్పనేల? జన్మ మొదలుకొని ఏ యే పాపములు చేయబడినవో అవి అన్నియు సకృత్పారాయణము వలననే నశించును. సుందరకాండముతో సమానమయిన మంత్రములేదు పారాయణము వలన సిద్ధియగును ఇది బ్రహ్మశాసనము సమస్త మంత్రములకు రాజు అనుటకు సందియము లేదు సర్వ పారాయణములయందు నిది బీజకాండమని చెప్పబడినది అందువలన పారాయణముచేసి ధన్యులు కావలయును అని మహర్షులకు అగస్త్య మహర్షిచే చెప్పబడెను.



## సుందరకాండ పారాయణారంభమున హనుమద్ధ్యానము

శ్లో॥ ఖడ్గం ఖట్వాంగ శైలద్రుమ పరశు గదా పుస్తకం శంఖ చక్రే
పాశం పద్మం త్రిశూలం హల ముసల ఘటాన్ టంక శక్త్యక్షమాలా
దండాహికుంత ఘంటాభయ కులిశ వరా పట్టసం చాపబాణౌ ।
ఖేటం ముష్టిం ఫలంవా డమరు మపి భజే బిభ్రతం వాయుసూనుం ।

ఖడ్గమును ద్రుమశైలాదులను పరశు గదా శంఖ చక్రములను పాశమును పద్మమును త్రిశూలమును హల ముసలా ద్యాయుధములను అక్షమాలను కులిశమును పట్టసమును డమరును ధరించిన వాయుపుత్రుని భజించుచున్నాను - (అని ధ్యానము చేయవలయును)

## పఠనము చేయువాని కుండవలసిన విధి.

శ్లో॥ సర్వశాస్త్రార్థ పారజ్ఞః భక్తి యుక్తో రఘూత్తమే
వాల్మీకి హృదయాభిజ్ఞః శబ్దసారార్థ పారవిత్ ।
ప్రవకృత్యైధిక్రియత హ్యన్యథా హనుమాన్ శపేత్ ।

సర్వశాస్త్రసారమును దెలిసినవాడును, రామునియందు భక్తి గలవాడను, వాల్మీకి హృదయమును దెలిసినవాడును, శబ్దసారమును, అర్థసారమును దెలిసినవాడు నగు ప్రవక్తను పారాయణమున కేర్పరుప వలయును లేనియెడల హనుమంతున క్రాగహము గలుగును

# పాఠకునకు దిజ్నియమము

## మదర్శన సంహితలో

శ్లో॥ వక్తా ప్రాఙ్ముక ఆసీత శ్రోతా చోత్తరదిఙ్ముఖః।
మారుతే ర్విష్టరం కృత్వా పూజయే త్ప్రత్యహం బుధః।

వక్త తూర్పుదిక్కుగాఁ గూర్చుండవలయును శ్రోత యుత్తర దిఙ్ముఖుడుగా గూర్చుండవలయును హనుమంతునకుఁ బ్రత్యేకాసన ముంచి పూజించి ప్రత్యహ నిర్విధముగ జేసి యారంభింప వలయును

ఆదౌ దీపం ప్రజ్వాల్య। గణాధిపతిం ధ్యాత్వా। తతః ఆచమ్య। ప్రాణానాయమ్య। దేశకాలౌ సంకీర్త్య। శ్రీమాన్ గో నా స్య మమ సకుటుంబస్య సభ్రాతృకస్య సపుత్రికస్య ఆయుష్యాభివృద్ధ్యర్థ మిలోధిక మైశ్వర్య హాప్తర్థ్యం సుగుణానేక సుపుత్రావాప్త్యర్థం గృహ పశు శిశు వృద్ధ సర్వజనావహిత దుష్టగ్రహనివారణార్థం భూమ్యంతరిక్ష మహోత్పాతాది దుర్నిమిత్తాద్భుతదర్శన దుష్టారిష్ట ప్రయోగోపద్రవ సకల క్షుద్రప్రయోగ శల్యతంత్రాది ప్రయోగ బగళాప్రయోగాఽఽ సురీ ప్రయోగ వార్తాళీప్రయోగ నివారణార్థం, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర చండాలాది నానాజాతి స్త్రీపురుష దుష్టగ్రహోచ్చాటనార్థం త్రయోదశ సన్ని పాతాఽష్టాదశకుష్ఠ గుల్మాఽష్టవిధ మహాపక్షవాత పాండురోగ కామిలా క్షయ హృదయశూలాఽక్షిశూల కుక్షిశూలాది సమస్త వ్యాధి నివారణార్థం శ్రీ సువర్చలాసమేతాంజనేయ ప్రసాదసిద్ధ్యర్థం శ్రీమత్సుందరకాండ పారాయణ మహం కరిష్యే ॥

అస్య శ్రీ సుందరకాండ మహామంత్రస్య వాల్మీకి ఋషిః ఆంజనేయో దేవతా, రామదూతాయ కపయ ఇతి బీజం, నమో వాతాత్మజాయ ఇతి శక్తిః,సముద్రతారకాయ ఇతి కీలకం, సర్వావిఘ్న నివారణ్యార్థే సర్వాభీష్టసిద్ధ్యర్థే సున్దరకాణ్డ పారాయణే జపే వినియోగః

ఉదధిక్రమిణే తుభ్యం నమో రాక్షసమర్దనే, అంగుష్ఠాభ్యానమః
ఛాయాగ్రహ వినాశాయ సురసామారకాయ చ, తర్జనీభ్యాం నమః
మైనాక దర్శినే తుభ్యం మైనాకగిరిమానినే, మధ్యమాభ్యాంనమః
ఆకాశగామినే దేవమానినే సర్వదాయినే, అనామికాభ్యాం నమః
వాయుపుత్రాయ ధీరాయ లఙ్కాదర్పాప హారిణే, కనిష్ఠికాభ్యాం నమః
అక్షహన్త్రే నమస్తుభ్యం పుచ్ఛవహ్ని ప్రదీపనే, కరతల కరపృష్ఠాభ్యాంనమః
ఉదధి మర్దినే, హృదయాయ నమః ఛాయా కాయ చ, శిరసేస్వాహా
మైనాక మానినే, శిఖాయై వౌషట్ ..........
ఆకాశ.....యినే, కవచాయ హుం, వాయు పుత్రాయ....హారిణే నేత్రత్రయాయ వౌషట్, అక్షహంత్రే....పనే. అస్త్రాయ ఫట్. అష్ట మంత్రి మతానాం చ గర్వభఙ్గకృతే నమః, భూ ర్భువస్సువరోమితి దిగ్బన్ధః.

ధ్యానం

శ్లో॥ సర్వావిఘ్ననివారకం శుభకరం పింగాక్ష ముక్షాపహం
సీతాన్వేషణతత్పరం కపివరం కోటీన్దు సూర్యప్రభం
లంకాద్వీపభయఙ్కరం సకలదం సుగ్రీవసమ్మానినం
దేవేంద్రాది సమస్త దేవవినుతం కాకుత్థ్సదూతం భజే.

శ్లో॥ బుద్ధి ర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చహనూమత్స్మరణాద్భవేత్.

శ్లో॥ రామదూతాష్టాక్షరించ పఠే దాద్యంతయోః పృథక్
స ఏవ రామదూత స్య త్వత్యం శంకర భాషితమ్.

సుందరకాండ ప్రతిశ్లోకము యొక్కగాని ప్రతిసర్గ యొక్కగాని మొదటను చివరను హనుమదష్టాక్షరీ మహామంత్రమును సంపుటిచేసి పారాయణము చేసినవారు సాక్షాత్తు హనుమత్స్వరూపు లగుదురని శంకరుడు సెలవిచ్చెను-

## అష్టాక్షరీ మహామంత్రము

అస్య శ్రీ ఆంజనేయాష్టాక్షరీ మహామంత్రస్య ఈశ్వర
ఋషిః అనుష్టుప్ ఛందః హనూమాన్ దేవతా-
ఆం బీజం నమః శక్తిః ఆంజనేయాయ ఇతి కీలకం
శ్రీ హనుమత్ప్రసాద సిద్ధ్యర్థే వినియోగః

ఆం అంగుష్ఠాభ్యాం నమః ఆం హృదయాయనమః
ఈం తర్జనీభ్యాం నమః ఈం శిరసేస్వాహా
ఊం మధ్యమాభ్యాం నమః ఊం శిఖాయై వషట్
ఆం అనామికాభ్యాం నమః ఆం కవచాయహుం
ఈం కనిష్ఠికాభ్యాం నమః ఈం నేత్రత్రయాయవౌషట్
ఊం కరతల కరపృష్ఠాభ్యాం నమః ఊం అస్త్రాయ ఫట్

భూర్భువ స్సువ రో మితి దిగ్బంధః

ధ్యానమ్

శ్లో॥ ఆంజనేయ మతి పాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాన నందనం

# మూలమంత్రమ్

## ఓం ఆం ఆంజనేయాయ నమః

ఈ మంత్ర పురశ్చర్యకై లక్ష జపించవలయును దానిలో పదవవంతు తర్పణము-దాని పదవవంతు హోమము అందు పదియవ వంతు బ్రాహ్మణభోజనము మధుత్రయముచేత హోమము చేయవలయును శర్కర తేనెతో గూడిన ఆవుపాలతో తర్పణము చేయవలయును

## ఫలశ్రుతి

శ్లో॥ ఏవం శాస్త్రోక్త విధినా జప న్నష్టాక్షరీం మనుం
అష్టాక్షరీప్రభావేన శుద్ధాంతఃకరణో భవేత్
తదుపాసనయా జంతుః సర్వత్ర విజయీ భవేత్
సిద్ధించ సర్వకార్యస్య ప్రసిద్ధిం జగతాం త్రయే
అంతే కైవల్య సంపత్తింలభతే నాత్రసంశయః.

ఈ విధముగ శాస్త్రానుసారముగ పురశ్చర్య చేసినవారు శుద్ధమైన అంతఃకరణము కలవారగుదురు వారికి సర్వకార్యముల యందు విజయము కలుగును ముల్లోకములయందు ప్రసిద్ధి గాంతురు చివరకు కైవల్యము నొందుదురు ఈ విషయమున సంశయములేదు మంత్రము చేయలేనివారు, మంత్రాధికారము లేనివారు ధ్యానశ్లోకమును (ఆంజనేయ మతిపాటలాననం ఇత్యాది) సంపుట చేసికొని సుందరకాండ పారాయణము చేయవచ్చును ధ్యానశ్లోకము మంత్రముతో సమానమైన బలము కలదని ప్రమాణము కలదు (ధ్యానంతు దేవతారూపం)

మఱియొక విశేషము కలదు :

మంత్రమ్ :— వ పృష్టం ధన ముభయమ్ సమాకృత మస్మభ్యమ్ త్రాం
వరుణశ్చ మన్యుః ధియం దధానా హృదయేషు శత్రవః
పరాజితా సో అపనిలయంతాం—

(మన్యుసూక్తమ్).

ఈ పైమంత్రమును శ్రీం హ్రీం క్లీం అను బీజాక్షరములతో సంపుటి చేసి, అనగా శ్లోకముయొక్కగాని, సర్గముయొక్కగాని ఆద్యంతములయందు గలిపి సుందరకాండ పారాయణము చేసినచో అంతర్బహి శ్శతృవులు నశించి భక్తుడు శుద్ధస్ఫటిక రూపుడై బ్రహ్మత్వము నొందుట నిస్సంశయము

పారాయణక్రమమున సుందరకాండమును పదునాలుదినములఁ బూర్తి చేయు పద్ధతి వ్రాయబడియున్నది ఈపై సంపుటితో ఆ పారాయణము పూర్తి చేసినయెడల సర్వశత్రుపలాయనము జరుగును

## సంగ్రహ పారాయణము

శ్లో॥ దేవదేవ నమస్తేస్తు కలౌ సామాన్య మానవాః
చాత్వారింశత్సహస్రాణాం శ్లోకానాం పఠనేఽఖిలాః
అ సమర్థాస్తత స్త్వంహి సంగ్రహం తస్య వక్ష్యతాం
ఇత్యుక్తః ప్రాహ గౌరీశః శ్రుణు వక్ష్యే నగాత్మజే
వాల్మీకి ప్రోక్త శ్రీరామ చరితస్యహి సంగ్రహం
వాల్మీకివాచ యత్ప్రోక్తం రామాయణ మనుత్త మం
తస్యైవ సౌందరేకాండే హ్యష్ట పంచాశదాత్మకం

సర్గ మారభ్య కాండాంతం గ్రంథం చైకాదశాత్మకం
సర్గమాత్ర గ్రంథ మష్టచత్వారింశోత్త రం తథా
చతుశ్శత శ్లోకరూపం పురుషార్థ స్వరూపకం
అదౌ పారాయణం కుర్య దేకత్రిం శాఖ్యసర్గకే
షోడశశ్లోక పర్యంత ముపోద్ఘాతాత్మికం శుభం.

(ఉమాసంహిత)

సుందరకాండములో 58 సర్గ మొదలుకొని 61 సర్గవఱకు-అనగా కాండాంతము వఱకు పారాయణ చేసినచో సమస్త రామాయణ పారాయణ ఫలము కలుగును అయితే దీనికి ఉపోద్ఘాతముగా 31వ సర్గలోని మొదటి పదునాఱు శ్లోకములు పారాయణముచేసి తరువాత 58 సర్గ పారాయణము చేయవలయును దీనితో మొత్తము 464 శ్లోకములగును దీనికి యావద్రామాయణ పారాయణ ఫలితము కలుగు నని శంకరుడు సెలవిచ్చెను

కావున నీ సంగ్రహపారాయణము శుభము ఇది సప్తకాండముల సంగ్రహ కథా వివరము ఏమందురా వినుడు

1 మొదట వాల్మీకి రామాయణమందుగల బాలకాండమున 31వ సర్గలోని ఉపోద్ఘాతరూపమైన సంగ్రహ రామాయణ శ్లోకములు తదుపరి 52వ సర్గలోని 188 శ్లోకములును వెరశి 144 నూటనలుబదినాలుగు శ్లోకములును బాలకాండము

2 అది మొదలు అనగా 58వ సర్గలోని 129వ శ్లోకము మొదలు ఆ సర్గాంతము వరకు గల 38 శ్లోకములును 59వ సర్గలోని 26వ శ్లోకము వరకును 64 శ్లోకములును అయోధ్యాకాండము

3 తరువాత అనగా 59వ సర్గలోని 27 శ్లోకములు మొదలు ఆ సర్గాంతము వరకును గల 36 శ్లోకములలోని 10 శ్లోకములును 60వ సర్గయందు గల 7 శ్లోకములును 61వ సర్గాంతము వరకును గల 23 శ్లోకములును 62వ సర్గలోని 17వ శ్లోకము వరకును వెరసి 57 శ్లోకములును అరణ్యకాండము

4 తరుపరి 62వ సర్గలోని 18వ శ్లోకము మొదలు అసర్గాంతము వరకును గల 40 శ్లోకములలోని 23 శ్లోకములును 63 సర్గయందుగల 29 శ్లోకములును 64వ సర్గలోని 12వ శ్లోకము వరకును వెరసి 64 శ్లోకములును కిష్కింధాకాండము

5 అది మొదలు అనగా 64వ సర్గలోని 13వ శ్లోకము మొదలు 39వ శ్లోకము వరకును గల 27 శ్లోకములును 65వ సర్గయందు గల 27 శ్లోకములును 66వ సర్గలోని 15 శ్లోకములును 67 సర్గలోని 37 శ్లోకములును వెరసి 106 శ్లోకములును సుందరకాండము

6 తరువాత అనగా 68వ సర్గయందుగల మొదటి శ్లోకము మొదలు 22 శ్లోకము వరకును వెరసి 22 శ్లోకములను యుద్ధకాండము

7 అది మొదలు అనగా 67వ సర్గలోని 23వ శ్లోకము మొదలుకొని ఆ సర్గాంత మందు గల 29వ శ్లోకము వరకును గల 7 శ్లోకములును (అనగా 7 శ్లోకములే) దీనికే ఉత్తరకాండము అని భావము

## సప్త సర్గక్రమము

శ్లో॥ దినే దినే సప్త సర్గాం తన్య కాండస్య యో వదః
వఠే ద్భక్త్యా తు కాకుత్థ్సం హృది ధ్యాత్వా వమన్య చ ।

శ్లో॥ తస్య జన్మాంతర శతైః సంచితస్యాపి పాప్మనః
నాశం కుర్యా త్సుప్రసన్నో రామో విష్ణు స్సనాతనః।
కిం పున శ్చింతితార్థాప్తిం చింతయామః పునః పునః।
సహస్రనామభి ర్విష్ణో రభ్యర్చ్య చ దినే దినే
పఠే త్సుందరకాండస్య సప్తసర్గీం విధానతః
యదాతు సప్తమ స్సర్గః కాండ స్యంతిమసర్గకః
భవిష్యతి తదన్తం తు సప్తసర్గాన్ పఠే ద్వ్రతీ।

శ్లో॥ సప్త సర్గక్రమేణైవ నిత్యం యః పఠతే ముదా।
షట్సప్తవేద సంఖ్యేషు దినేషు ఫలమశ్నుతే।
అష్ట షష్టి దినైర్వాపి ఏకం పారాయణం భవేత్।
ఋషిభిర్వా గ్రహైర్వాపి రుద్రైర్వా కాండ ఏవవా।
పారాయణం యః కరోతి తత్ప్రమాణఫలం భవేత్।

ప్రతిదినము సుందరకాండ సప్తసర్గ క్రమముగఁ బారాయణము చేయువాడు శ్రీరామచంద్రునికి నమస్కరించి, మనసా ధ్యానించి పఠింప నారంభింపవలయును ఇట్లు పారాయణము చేయువాని యనేక జన్మార్జితములయిన పాపములను గూడ శ్రీరామచంద్రమూర్తి నశింప చేయగలడు అభీష్టములను సిద్ధింప చేయునని వేరుగ జెప్పనేల? సహస్రనామములచే విష్ణుని బూజించి, సుందరకాండమును సప్తసర్గక్రమమున పఠింపవలయును ఎంత దనుక సప్తమసర్గము కాండము యొక్క యంతిమ సర్గమగునో అంత దనుక నియమము గలవాడై పఠింపవలయును సప్తసర్గక్రమముగ నిత్య మెవడు ఏడుపర్యాయములు నాలుగువందల డెబ్బదియారు దినములలో పఠించునో వాడునంతఫలముల నొందును అరువది యెనమిది దినముల కొక సప్తసర్గ పారాయణ మగును ఇట్లే ఏడుగాని, తొమ్మిదిగాని, పదునొకండుగాని, సుందరకాండ పారాయణములు సలుపునాతడ అపురూప ఫలముల నొందగలడు

# సప్తసర్గ పారాయణ విశిష్టత

హనుమద్విద్య సప్తమంత్రాత్మకము, పరాశర సంహిత
"అన్యం విశేషం వక్ష్యామి పంచవక్త్రో హనూమతః
సప్త మంత్రాత్మికా విద్యా ప్రభావం వర్ణితుం మునే
బ్రహ్మాదయో ప్యశక్తాహి కిము తంత్రకృతో జనాః
పంచాస్య హనుమన్మంత్రం సప్త మంత్రాఖ్య విద్యయా
సకలం జనితం చేతి సప్త సంఖ్యా విశేషతః
సప్తఋషీన్ సప్తసింధూంశ్చ సప్తనామచి వైవిభో
సప్త స్వరాన్ సప్తశైలాన్ సప్త పాతాళలోకకాన్
సప్తాన్ సప్తహూత్యాంశ్చ నిర్మితా సప్తమాతరః

ఇందు సప్తవిద్యల వివరణ ముదాహరింప బడుచున్నది

1.హనుమ ద్వాదశాక్షరి – దీని యథార్థ మిట్లున్నది
ఆదౌ ప్రణవ ముచ్చార్య హరి మర్కట శబ్దతః
మర్కటాయ పదం వహ్ని జాయాంతం ప్రోచ్యతే తతః
ద్వాదశాక్షర సంయుక్తో మంత్రోయం సముదీరితః
మంత్రము :– ఓం హరి మర్కట మర్కటాయ స్వాహా ౧౨అక్షరములు

2 ప్రాఙ్ముఖ మంత్రము :–
ఓం నమః పంచవదనాయ పూర్వవ క్త్రపి శబ్దతః
ముఖే సకల శబ్దంచ శత్రుసంహారణే పదం
తతో యకార ముచ్చార్య హ్రాం బీజం తదనంతరం
మహాబలాయేతి పదం వహ్నిజాయాం సముచ్చరేత్
త్రయస్త్రింశ ద్వర్ణరూపశ్చ మంత్రోయ మితి కథ్యతే –

అట్టి బుద్ధిమంతులు సర్వ శత్రువులను జయించివారలై సర్వసౌఖ్యములను పొందెదరు

శ్లో ॥ యా నారీ వాయుపుత్రస్య ప్రతిష్ఠాం కురుతే తదా ।
ప్రసాదా ద్వాయుపుత్రస్య పుత్రం ప్రాప్నోతి దుర్లభం ॥
సంవత్సరా దథ సత్యం శృణుధ్వం రాజసత్తమాః ।
నారీ వాఽథ పుమాంశ్చాపి జపిత్వా మంత్రముత్తమం ।
సర్వా న్కామా నవాప్నోతి నాత్రకార్యా విచారణా ॥

తా ॥ ఏ స్త్రీ అయితే వాయుపుత్రుని ప్రతిష్ఠ గావించునో, ఆ భాగ్యవతి సంవత్సరము కాగానే, హనుమత్కారుణచే మంచి సౌందర్యము గల పుత్ర సంతానము గలది అగును ఓ రాజశ్రేష్ఠులారా। స్త్రీగాని, పురుషుడుగాని హనుమన్మంత్రము జపించినచో సమస్తమైన కోరికలను తప్పక పొందగలరు, ఎంతమాత్రము సందియము లేదు

శ్లో ॥ ఇత్యుక్త్వా రాఘవః పూర్వం సభామధ్యేఽథ మారుతిం
పూజయిత్వా యథాన్యాయం హనుమంతం కృతాంజలిం ।
విసర్జయిత్వా తా న్సర్వా న్నివేశాఽంతఃపురం స్వకం ।
గతేషు వానరేంద్రేషు హనుమాన్ రామభక్తిమాన్ ।
రామనామజపం కుర్వన్ తత్రస్థో మతిమా న్కపిః ॥

తా ॥ ఓ పార్వతీ ! సభామధ్యమందు పై విధముగా పలికి కృతాంజలియైన హనుమంతుని యథారీతిని పూజించి శ్రీరామచంద్రుడు యా వరి స్థానములకు వారిని వెళ్ళవలసినదిగా ఆజ్ఞాపించి తాను అంతఃపురము లో నికి వెళ్ళెను అంతట సుగ్రీవాది వానరులందరు యథాస్థానములకు వెళ్ళగా రామనామము జపించుచు హనుమంతుడు అచ్చటనే యుండెను

శ్లో ॥ తదా ప్రభృతి మానుష్యేలోకే మహాత్మ్య ముత్తమం ।
వానరేంద్రస్య విఖ్యాత మభవ ద్గిరిజే శృణు ॥
ఏవం చిరగతే కాలే కేశవాఖ్యో ద్విజోత్తమః ।

తా॥ అది మొదలుకొని శ్రీ వాయుపుత్రుని యొక్క మాహాత్మ్యము మనుష్యలోకమున తెలియబడినదాయెను ఇట్లు చిరకాలము గడువగా ఓపార్వతీ కేశవాఖ్యుడను బ్రాహ్మణోత్తముడును

శ్లో ॥ వేదవేదాంగవి ద్ధీమా న్స్వకర్మనిరత స్సదా ॥
పుత్రపౌత్రైః పరివృత స్స్నుషాభిశ్చ సమంతతః ।
ప్రభూత ధన ధాన్యశ్చ మహాభాగ్య సమన్వితః ॥
గృహాగతా న్సదా విప్రా నతిథీ న్సమపూజయత్ ।
సదా వస త్యసౌ మహాభాగః స్వగ్రామే వసతి ప్రభుః ॥

తా॥ వేదవేదాంగములను చదివినవాడును, బుద్ధిమంతుడును, స్వకర్మానుష్ఠానమందు నిష్ఠగలవాడును, పుత్రపౌత్రుల తోను, భార్యలోను, గొప్పదైన ఐశ్వర్యములోను తులతూగుచు తన యింటికివచ్చిన అతిథులను పూజించుచు ప్రభువు రీతిని స్వగ్రామమున నివసించుచుండెను

శ్లో ॥ తస్య భార్యా విశాలాక్షీ దైవా త్పంచత్వ మాగతా ।
పీడితదుఃఖేన మహతా చింతా వ్యాకులితేంద్రియః ।
వారాణశిం గత శ్శీఘ్రం క్షేత్రం విప్రపుంగవః ॥

తా ॥ ఇట్లుండగా దైవవశమున నతనిభార్య మరణించెను అంత నా బ్రాహ్మణోత్తముడు అ తిదుఃఖము కలవాడై కాశీక్షేత్రమునకు వెళ్ళిన వాడాయెను

శ్లో॥ స్నాత్వా భాగీరథీ నద్యాం మత్పూజాతత్పరో భవన్ ।
ఉషిత్వా తత్ర సుక్షేత్రే కించిత్కాలం మహీసురః ॥
గయాప్రయాగౌ సంసేవ్య గంగా మాదాయ యత్నతః ।
మార్గమధ్యే తు తీర్థాని యాని యానిప్రియే శృణు ॥
తాని సర్వాణి సంసేవ్య శనై ర్గచ్ఛ న్స్వకం గృహం
వటమేకం సమాసాద్య తత్ర వాస మథాఽకరోత్ ॥

తా॥ అచ్చట గంగానదియందు స్నానమాచరించి ఓ గౌరీ ! నన్ను పూజించుచు కొంతకాలము గడిపి, తిరిగి ఆకాశీక్షేత్రమునుంచి బయలుదేరి గయా, ప్రయాగ మొదలగు దివ్యక్షేత్రములు సేవించుకొని, గంగను వెంటనిడుకొని, నెమ్మదిగా తన స్వగృహమును జేరదలచినవాడై వచ్చుచు మార్గమధ్యమున అలసట దీర్చుకొను సంకల్పముతో మార్గమున నున్న ఒక మఱ్ఱివృక్షము క్రింద నివసించెను

శ్లో॥ సవృక్షో విపులశ్శాఖీ వ్యాప్త దిఙ్మండలాంతరః ।
నానాపక్షి సమాకీర్ణో నానాభూత గణాశ్రయః ॥
నివారితాతపచ్ఛాయా సమాక్రాంత దిగంతరః ।
పంథానం తం పరిత్యజ్య పాంథా గచ్ఛంతి దూరతః ॥

తా॥ ఆ వృక్షము గొప్పవైన శాఖలు గలిగి సర్వదిక్కుల వ్యాపించి యుండెను నానావిధములైన పక్షి సముదాయముతోను, అనేక భూత గణములతోను నిండియున్న ఆ వృక్షము అనేకులకు తన నీడచేత తాపమును పోగొట్టుచుండెను అయినను మార్గస్థులు ఆ వృక్షసమీపమునకు వెళ్ళుటమాని దూరముగా పోవుచుండిరి

శ్లో॥ ప్రవిష్టా కామినీ కాచిత్ రాక్షసీ భీమదర్శనా ।
భీషయంతీ జనా న్సర్వా న్భక్షయంతీ చ కాంశ్చన ॥

కామి న్యాకార మాసాద్య మోహయంతీ చ కాంశ్చన ।
తథజ్ఞాత్వా త్వసౌ విప్రస్తద్వృటం సముపాగతః ॥

తా ॥ ఆ మఱ్ఱివృక్షమునందు భయంకరమగు ఒకానొక రాక్షసి కామినీరూపమును ధరించి, ఆచెట్టు సమీపమున ప్రవేశించిన వారిని కొంతమందిని భక్షించుచు, మరికొందరిని తన మాయావేషముతో మోహింపజేయుచు నుండెను ఆ విషయమును బ్రాహ్మణోత్తముడు తెలియనివాడై ఆవృక్షము క్రింద ప్రవేశించెను

శ్లో ॥ నిశీథకాలేసంప్రాప్తే కామినీ రూపధారిణీ ।
సా కామినీ తథా విప్రసమీపం సముపాగతా ॥
సంపూర్ణ చంద్రవదనా చారుపద్మనిభేక్షణా ।
కుంభికుంభకుచా రమ్యా నానాభూషణ భూషితా ॥
తస్థౌ విప్రసమీపేతు చారుహాసా శుభాకృతిః ॥

తా ॥ సంపూర్ణచంద్రునితో సమానమగు ముఖము గలదియు, విశాలమగు నేత్రములు గలదియు యెత్తైన స్తనములు గలదియు, అనేక విధములగు ఆభరణములు ధరించినదియునై నిశీథకాలమున ఆ విప్ర సమీపమునకు వచ్చెను

శ్లో ॥ తాం దృష్ట్వా సుందరాకారాం విప్రః కామవశం గతః ।
కా త్వం విశాలనయనే కిమర్థం సముపాగతా ।
కృపయా మాం గృహాణాశు బ్రాహ్మణోహం శుచిస్మితే ।
పత్నీ పంచత్వ మాపన్నా పత్నీత్వం భజమే ప్రియే ॥
తస్య తద్వచనం శృత్వా ప్రోవాచ మధురాక్షరం ।
కామయే త్వాం ద్విజశ్రేష్ఠ భవిష్యామి ప్రియా తవ ।
మయాసహ మహాభోగాన్ భుంక్ష్వ బ్రాహ్మణపుంగవ ॥

తా॥ ఇట్లు తనవద్దకు వచ్చిన మాయారాక్షసిని జూచి బ్రాహ్మణుడు కామాసక్తుడై పలికెను విశాలమగు నేత్రములు గలదానా ! యే కారణము చేత యిచ్చటికి వచ్చితివి ? చిఱునవ్వు గలిగిన ఓచిన్నదానా! నేను బ్రాహ్మణుడను, దైవవశమున నాభార్యయు కాలగతినొందినది, గనుక నీవు దయగలదానవై నాకు బార్యవుగా నుండి నన్ను సేవింపుము ఆ మాటను విని ఓ బ్రాహ్మణోత్తమా ! నీ అభీష్టము ననుసరించి యుండెదను నాతో కలసి నీయిచ్ఛకొలది కామ సౌఖ్యముల ననుభవింపుము, అని మాయా రాక్షసి పల్కెను

శ్లో ॥ ఇత్యేవం ప్రలపంతౌ తౌ కామపాశవశం గతౌ ।
క్రీడాం చక్రతు రత్యంత మదనాక్రాంతచేతసౌ ॥
ఏవంగతేతు కాలేతు యోగీ కశ్చి న్మహాతపాః ।
జన్మాంతరకృతా త్పుణ్యా ద్బ్రాహ్మణస్య సమాగతః ॥
బ్రాహ్మణస్తు తదా దృష్ట్వా యోగినం వీతరాగిణం ।
రుద్రాక్షమాలాభరణం భస్మరాగోజ్వలం మునిం ॥
వ్యాఘ్రచర్మాంబరధరం సశిష్యం సముపాగతం ।
ఆగత్య సహసా తస్య పతిత్వా పాదయో స్తదా ॥
ప్రార్థయామాస తం విప్రం స్వగృహాగమనం ప్రతి ॥

తా ॥ ఇట్లు ఉభయులు పరస్పరము ఆలోచనమొనర్చుకొని మన్మధావేశముతో క్రీడించుచు కాలము గడుపుచుండగా బ్రహ్మణుని యొక్క జన్మాంతర పుణ్యవశముచేత ఒకానొక యోగిపుంగవుడు బ్రాహ్మణుని యొద్దకు వచ్చెను కోరికలు లేనివాడును, రుద్రాక్షమాలల ధరించి, విభూతి ధారణముచేసి వ్యాఘ్రచర్మమును ధరించి మహాతేజస్సుతో

శిష్యసహితుడై తన సమీపమునకు వచ్చిన యోగిపుంగవుని చూచుటతోడనే ఆ బ్రాహ్మణుడు తన గృహమునకు రావలసినదిగా ప్రార్థించుచు అతని పాదములమీద పడెను

శ్లో ॥ గృహాగతం మహాయోగిపుంగవం పావకోపమం
మంత్రశాస్త్రరహస్యజ్ఞం సదా జపపరాయణం ।
దృష్ట్వా సా కామినీ తత్ర భీతాఽంతర్గృహం మావిశత్ ॥
పాపితాం కామినీం దృష్ట్వా పరమాశ్చర్యసంభృతః ।
సంప్రవిశ్య గృహం తస్య ద్వారేవ స్థిత స్తథా ॥

తా ॥ అగ్నిహోత్రునితో సమానమగు కాంతిగల వాడును, మంత్రశాస్త్రరహస్యములనెల్ల తెలసి శ్రీ హనుమన్మంత్రమును యెల్లప్పుడు జపించుచుండెడివాడును, గృహమునకు వచ్చిన ఆ యోగిపుంగవుని జూచుట తోడనే కామిని భయముగలదియై యింటిలోనికి వెళ్ళిపోయెను యోగిపుంగవుడు యీచిత్రమును జూచి ఆశ్చర్యముకలవాడై తాను గృహద్వారమునే నిలచియుండినవాడై

శ్లో ॥ ఆహూయ బ్రాహ్మణం వాక్య మువాచ కృపయా మునిః ।
రేరే బ్రాహ్మణ దుర్బుద్ధేబ్రూహి సత్యం మమాగ్రతః ॥
కేయం కన్యా త్వయా కుత్ర పరిణీతా వదస్వ మే ।
యది సత్యం నబ్రవీషి భయం తే సముపాగతమ్ ॥

తా ॥ బ్రాహ్మణుని పిలచి అతనియందు కృపకలవాడై ఓ దుర్బుద్ధి గల బ్రాహ్మణుడా ! నీవు నా యెదుట సత్యమును చెప్పుము యీ కన్య యెవరు? ఎచ్చట వివాహమాడినావు? నిజము చెప్పుము అట్లు చెప్పవేని నీకు తప్పక చేటు మూడును

శ్లో ॥ తస్య త ద్వచనం శ్రుత్వా వేపమానః కృతాంజలిః ।
ఉవాచ ప్రాంజలిర్భూత్వా యోగినం వీతకల్మషం ॥
సత్యం బ్రవీమి తే బ్రహ్మా పాదమూల మిహాగతః ।
త్రాహిత్రాహి మహాభాగ భయా దస్మా న్మహామునే ॥

తా ॥ అప్పుడా యోగీశ్వరుని యొక్క మాటలను విని యా బ్రాహ్మణుడు గడగడవణుకుచు, దోసిలియొగ్గి ఓ మహానుభావా, నేను నీ పాదములను శరణు పొందితిని మహాభయమునుండి నన్ను రక్షింపుము సత్యము బల్కుచున్నాను అని చెప్పి యిట్లు పలికెను

శ్లో ॥ మార్గమధ్యే మయాదృష్ట్వా పా పేష్టా దుష్టచారిణీ ।
రూపలావణ్యసంపన్నా మదనేన విమోహితా ।
జన్మాంతరకృతా త్పాపా న్మయా ప్రాప్తా మహామునే ॥

తా ॥ ఓ మహానుభావా ! కాశీనుంచి నేను వచ్చుచుండగా మార్గ మధ్యమందు చక్కని యాకారముగలిగి మన్మథ వికారమును జెందిన యీ పాపపు చిన్నదానిని జూచితిని నా జన్మాంతర పాపమువలన నేను దీనిని భార్యగా గ్రహించితిని

శ్లో ॥ వద మే త్వం మహాభాగ కైషా స్త్రీరూపధారిణీ ।
విదితం ఖలు తే సర్వం పాణ్యా వామలకం యథా ॥

తా ॥ ఓ యోగిపుంగవా! ఇది యెవరు? దీని జన్మవృత్తాంత మెయ్యది? తమకు సర్వమును అరచేతిలోని యుసిరికాయవలె విదితమయియున్నదికదా !

శ్లో ॥ బ్రాహ్మణస్య వచ శ్శృత్వా ప్రహస్య యోగిపుంగవః
స బ్రవీ మ్యథునా పశ్చా ద్విదితా తే భవిష్యతి ॥

హనూమతి ప్రసన్నేతు దుర్లభం కిం మహామతే ।
హనుమ న్మంత్ర రహస్యం దిశామి తవ సువ్రత ॥

తా ॥ ఆ బ్రాహ్మణుని మాటలు విని ఓ బ్రాహ్మణోత్తమా ! దీని వృత్తాంతము నేనిప్పుడు చెప్పెను పిమ్మట నీకే తెలియగలదు హనుమంతుడు ప్రసన్నుడయ్యేనేని మనకు దుర్లభమయిన దేదియు నుండదు కాన నీకు హనుమన్మంత్రము నుపదేశించెదను

శ్లో ॥ హనుమ త్ప్రీతయే రామతారకం మంత్ర ముత్తమం ।
పంచముఖాంజనేయస్య మంత్రం జప మహీసుర ॥
హనుమ న్మంత్రరాజేన విధ్వస్తా భూతకోటయః ।
విద్రవంతి దిశ స్సర్వే భూత ప్రేతాధినాయకాః ॥
శిలారూపం హనూమంతం కృత్వా దేవాలయే శుభే ।
ప్రతిష్ఠాపయ విప్రేంద్ర శుభం తే ప్రభవిష్యతి ॥

తా ॥ ఓ బ్రాహ్మణుడా ! హనుమత్ప్రీతికొరకు రామతారక మంత్రమును జపించి, పిమ్మట పంచముఖాజనేయస్వామి యొక్క మంత్రమును జపింపుము ఆ మంత్రప్రభావము చేత కామినీ, బ్రహ్మ రాక్షసాది గ్రహములన్నియు పారిపోవును ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా ! శుభదినమున దేవాలయమునందు శిలారూపమైన హనుమంతుని ప్రతిష్ఠ చేయుము

శ్లో ॥ ఇత్యుక్త్వా బ్రాహ్మణం సద్య స్స్వాపయిత్వా హనూమతః ।
ఉపాదిశ న్మంత్రరాజం గృహ్య తామిస్ర భాస్కరం ॥
తేన మంత్ర ప్రభావేన జ్వలితాగ్ని సమప్రభః ।
జపమాలాం ప్రగృహ్యాశు స్వగృహం ప్రవివేశ చ ॥

తా॥ ఈ ప్రకారముగా పలికి ఆ మహాయోగి దుష్టగ్రహములనెడు చీకటులకు సుర్యుడయి ప్రకాశించెడు ఆంజనేయస్వామివారి యొక్క మంత్రము నా బ్రాహ్మణున కుపదేశించెను అంత నా బ్రాహ్మణుడు ఆ మంత్ర ప్రభావము వలన జ్వలించుచున్న యగ్నితో సమానమగు నాకారముగలవాడై శీఘ్రముగా జపమాలను చేతధరించి, తన గృహములో తాను ప్రవేశించగనే,

శ్లో॥ దృష్ట్వా తం బ్రాహ్మణం తత్ర కామినీ వికృతాననా।
కోశార్థభాగే స్థిత్వా సా పరుషం వాక్య మబ్రవీత్॥

శ్లో। రేరే బ్రాహ్మణ దుర్బుద్ధే జపమాలాం వివర్జయ।
హనుమన్మంత్రరాజస్య జపం చ పరివర్జయ॥
నోచేత్త్వాం నాశయిష్యామి పశ్య మే రూప మద్భుతం।
ఇత్యుక్త్వా రాక్షసాకార స్థిత్వా సా దూరతః పురః॥

తా॥ ఆ బ్రాహ్మణోత్తముని చూచి ఆ కామిని వికృతాననము గలదియై అర్ధక్రోశెడు దూరమున కేగి అచ్చట నిలచి కోపముగలదియై ఓ దుర్మార్గ బ్రాహ్మణుడా! నీ చేతనున్న జపమాలను పారవేయుము లేనిచో నిన్ను నాశమొనరించెదను హనుమన్మంత్రానుష్ఠానమును మానివేయుము అని కేకలు వేసెను

శ్లో। దృష్ట్వా తాం భీషణాకారాం భయకంపిత మానసః।
ధైర్య మాలంబ్య తేజస్వీ జజాప పునరద్భుతం॥
ప్రత్యక్షతోఽగ్రతః స్థిత్వా హనుమా నిద మబ్రవీత్।
మాభైషీః బ్రాహ్మణ శ్రేష్ఠ హ స్మిదాసీంతు రాక్షసీం॥

శ్లో ॥ ఇత్యుక్త్వా వాల మాలంబ్య కామినీం నిజఘాన హ ।
కంఠే బధ్వా నిజం వాలం పాతయిత్వా భువిక్షణాత్ ।
నిష్పీడ్య సుచిరం కంఠం నాశయామాస వానరః ॥

తా ॥ అంత నాబ్రాహ్మణోత్తముడు ఆ వికృతాకారమును జూచి భయముగలవాడై తిరిగి ధైర్యము నవలంబించి అత్యద్భుతముగా శ్రీ హనుమన్మంత్ర జపము గావించెను అంత శ్రీ హనుమంతుడు ప్రత్యక్షమై యెదుటనిలచి ఓ బ్రాహ్మణోత్తమా 'ఎంతమాత్రమును భయము జెందకుము తక్షణమే ఈ దుర్మార్గురాలిని నాశన మొనర్చెదను అని పలికి వెంటనే తన వాలమును దాని మెడకుచుట్టి నాశనమొనర్చి భూమిమీద పడవేసెను అంత నా మహావీరుడగు హనుమంతుడు అంతర్ధానము నొందెను పిమ్మట నా బ్రాహ్మణోత్తముడు తన గురువగు యోగిపాదముల నాశ్రయించినవాడై గురువుగారి ఆజ్ఞానుసారము తన గృహసమీపమున మరుత్సూనుని యథా శాస్త్రీయముగా ప్రతిష్ఠాదులు సలిపి ప్రతిష్ఠించి షోడశోపచారములచేత విధి విధానములతో పూజించుచు తన గురువుగారిని కూడా గురుభక్తి కలవాడై పూజించుచూ అతిసంతోషము గలవాడై తన గృహమందు నివసించుచుండెను అందువలన లోకములో భక్తితో ఏ మహాభక్తులు హనుమత్ప్రతిష్ఠను సలిపి పూజించుచుండెదరో, ఆ మహాభక్తులెల్లరు సర్వగ్రహ పీడలనుండి విడువబడినవారలై ఇహమందు సర్వసౌఖ్యముల ననుభవించి వైకుంఠప్రాప్తి గలవారలగుదురు

ఇతి శ్రీ రామోత్తరతాపనీయే పార్వతీంప్రతి
పరమేశ్వరేణోక్తః ॥

# శ్రీరామభక్తి చేయుచున్న

## బ్రాహ్మణుని కథ

### బ్రాహ్మణాగ్రహమున మారుతిచే స్త్రీదేశ మేర్పడుట.

శ్లో॥ ఏకదాశ్రావణేమాసి తద్గ్రామే సేనయాన్నృపః।
కశ్చి ద్య యౌ తథా విప్రః స్వస్థలే నిశి నిద్రితః॥

తా॥ ఒకానొకప్పుడు శ్రావణమాసమున ఒకానొక గ్రామమున కొకరాజు నిజసేనలోడ వచ్చెను అప్పుడొక బ్రాహ్మణుడు తన స్వగృహ మున నిద్రించుచుండెను

శ్లో॥ ఏతస్మిన్నంతరే వృష్టిపీడితా నృపసేవకాః।
గ్రామే గేహాని వివిశుః శూన్యగేహం యయు ర్దశ॥

తా॥ అంతలో గొప్పవానవచ్చుటచేతనాసైనికులు వర్షబాధవలన, ఇండ్లలో జొచ్చిరి ఆ విధముగానే పదిమంది రాజభటులు ఆ శూన్య గృహంబున బ్రవేశించిరి

శ్లో॥ అశ్వారూఢా స్నృహప్రాప్తే ద్వారమధ్యే ద్విజోత్తమం।
దృష్ట్వా వినిద్రితం ప్రోచుర్ద్విజోత్తిష్ఠ జవేన హి॥

తా॥ గుఱ్ఱపురౌతులు వేలకొలదిగా వాకిటనుండిరి అప్పుడా ద్వారమధ్యమున నిద్రించు విప్రునిజూచి ఆరాజభటులు ఓ బ్రాహ్మణుడా లెమ్ము లెమ్మనిరి

శ్లో॥ మార్గందేహి వయంవృష్ట్యా పీడితాస్సుశ్చిరం బహిః।
శూన్యగేహేఽత్ర స్థాస్యామ స్సుఖం పాశ్యాన్న సేవకాః॥

తా॥ దారినిమ్ము మేము బయట వానచే డస్సియున్నాము ఈ శూన్యగృహమున మా పరివారముతోడ సుఖముగా నుందుము

శ్లో॥ తత్తేషాం వచనం శ్రుత్వా సంభ్రమేణ ద్విజో బ్రవీత్।
రామచంద్ర స్సీతాయోఽత్ర నిద్రితోస్తి స్వబంధుభిః॥
నవర్తతేఽత్ర యుష్మాకం స్థలం సత్యం వచో మమః।
గచ్ఛధ్వం నగరే నానాస్థలా న్యన్యాని సంతి హి॥

తా॥ అనినందుకు నతడు సంభ్రమముతో నిట్లనెను ఈయింటిలో శ్రీరామచంద్రమూర్తి సీతాసమేతుడై బంధుపరివారముతో సుఖముగా నిద్రించియున్నాడు ఇచ్చట మీరుండుట కవకాశములేదు ఊరిలో మీరుండుటకు ఎన్నియో అవకాశములు గలవు పొండని నిరాకరించెను

శ్లో॥ తత్తస్య వచనం శ్రుత్వా రాజదూతాః పునర్ద్విజం।
ప్రోచుస్తే హ్యస్తి శ్రీరామ స్సోపి నిర్యాతువై బహిః।
తయా చ బంధుభిర్యుక్తః స్థలం నో దేహి భోద్విజ॥

తా॥ అంత నా రాజభటులు బ్రాహ్మణుడా ! అట్లు శ్రీరామ చంద్రుడు సీతతోడను, తమ్ములతోడను, బంధువులతోడను, నిద్రించు చున్నను వారిని బయటకు పంపివేసి మాకు స్థలము నిమ్మని గంభీరముగా పలికిరి

శ్లో॥ పున రాహ ద్విజస్తాః సకథం రామం వినిద్రితం।
ప్రబుద్ధంవై కరోమ్యద్య నిశాయాం రాజసేవకాః॥
యుష్మాకం ప్రార్థనా త్వద్య క్రియతే వైమయా ముహుః।
ప్రణమ్య విధివ ద్యూయం గచ్ఛధ్వం వై స్థలాంతరం॥

తా॥ తిరిగి ఆ రామభక్తుడు రాజభటులారా! రాత్రివేళ నిద్రించు చున్న రామచంద్రమూర్తిని నేనెట్లు నిద్రనుండి లేపుదును ? నేను దీనుడనై పలుమారు మిమ్ములను ప్రార్థించుచున్నాను కావున వేరుచోటుకు పొందు

శ్లో॥ తతస్తన్నిగ్రహం దృష్ట్వాతేఽ తివృష్ట్యా ప్రపీడితాః ।
తం విప్రం తాడయాంచక్రు స్తదాప్రాహద్విజోత్తమః ॥

తా॥ అనినంత వర్షబాధితులైన ఆ రాజసైనికులు ఆ బ్రాహ్మణుని స్మృహ తప్పునట్లుగా దెబ్బలు కొట్టిరి అంత నా బ్రాహ్మణుడు దెబ్బల బాధను సహింపజాలక రాజసేవకులతో నిట్లుపలికెను

శ్లో॥ రామం బహిఃకరో మ్యద్య తిష్ఠధ్వం రాజసేవకాః ।

తా॥ ఓ రాజభటులారా! వెంటనే రామచంద్రుని బయటకు తీసుకువెళ్ళెదను; తొందరచేయకుడు? మీరే యిచ్చట నుండుడు

శ్లో॥ ఇత్యుక్త్వాచమ్య శ్రీరామం భూసురో వాక్య మబ్రవీత్ ।
రామోత్తిష్ఠ బహి ర్దుష్టా స్త్వితాప్సం త్యశ్వ సంస్థితాః ।
తేషాం వస్తుం స్థలం దేహి వయం యామో బహిర్నిశి ॥

తా॥ అనిపల్కి శ్రీరామమూర్తిని జూచి రామప్రభూ లెమ్ము వెలుపల దుష్టులగు రాజభటులు తురగారూఢులై నిలచియున్నారు వారుండుటకు స్థలము నిమ్ము యీ రాత్రి మనము వెలుపలికి పోదము అని ప్రార్థించెను

శ్లో॥ ఇత్యుక్త్వా విజపృష్ఠే తా నారోహయత్స పూర్వవత్ ।
తతః కృత్వా మహాక్రోశం వస్త్రాదీనాం ద్విజోత్తమః ॥

శ్లో ॥ ధృత్వా కక్షే తో యకుంభం ధృత్వా రామం కరేణ సః ।
యష్టిం ధృత్వా సవ్యహస్తే శనై ర్ద్వారా ద్వహి ర్యయౌ ॥

తా ॥ సపరివారముగా రామచంద్రుని మూపుపై నిడుకొని, తన వస్త్రపాత్రాదుల మూటను చంకనిడుకొని, యెడమచేతితో జలకుంభమును కుడిచేతితో దండమును దాల్చి, అత్యంతాగ్రహముతో తిన్నగా బయటికి వెడలివచ్చెను

శ్లో ॥ తతో దృష్ట్వాతివృష్టిం స గేహా గ్రాధో బహి ర్ద్విజః ।
నమ్రీభూత స్తథా తస్థౌ గేహే సంవివిశుః ఖలాః ॥
తే ద్విజం తాదృశం దృష్ట్వా భ్రాంతం తే మేనిరే ఖలాః ॥

తా॥ అంతనా బ్రాహ్మణుడు అతివృష్టినవలోకించి యింటిముందరి చూరుక్రింద నిలువబడెను ఆ సైనికులు లోనికిజొచ్చి ఆ బ్రాహ్మణుని జూచి వెఱ్ఱివానినిగా నెంచిరి

శ్లో ॥ తతోఽతిశ్రమితో విప్ర శ్చింతయామాస చేతసి ।
పురాణే వాయుపుత్రస్య మయా సారం శ్రుతం బహు ॥
త త్సర్వం తు మృషా త్వద్య కిమస్త్యత్ర ప్రయోజనం ।
ఇతి నిశ్చిత్య విప్రశ్చ క్రోధేన మహతావృతః ॥
శీఘ్రం ఘటం భువి స్థాప్య వామహస్తేన మారుతేః ।
పుచ్ఛం ధృత్వా ప్రాక్షిప త్స మాకాశే వేగవత్తరః ॥
తదా సా మారుతే ర్ధాతుమయీ మూర్తి శ్శుభావహా ।
గత్వాకాశే గర్జనాం వై చకా రాతిభయంకరః ॥

తా॥ అంతనా బ్రాహ్మణుడు చింతాక్రాంతుడై పురాణములయందు వాయుపుత్రుని ప్రతాపము పలువిధములుగా చెప్పబడియున్నది అది

ఇప్పుడు సర్వము అబద్ధముగా తోచుచున్నదని తలచి కోపముతో తన చేతిలోనున్న నీటిలో నిండియున్న ఆ కుంభమును క్రిందబెట్టి యెడమ, చేతితో హనుమన్మూర్తియొక్క తోకనుబట్టి గగనమునకు విసిరివేసెను అప్పుడమ్మూరి ఆకాశంబున కెగసి భూమి బ్రద్ధలగునట్లు గర్జన మొనర్చెను

శ్లో॥ తాం గర్జనం మహావీర గ్రామస్థాశ్చ బహిస్థితాః ।
శ్రుత్వాతిభయ సంత్రస్తా మృతా స్సర్వే క్షణేనహి ॥

తా॥ ఆ గర్జనము వినినంతనే రాజభటులును, గ్రామస్థులును, వెలుపలనుండినవారును వికలచిత్తులై క్షణమాత్రమున మృతులై నేలకూలిరి

శ్లో॥ అశ్వానాగ వృషాద్యాశ్చ మృతా స్సర్వే తదా క్షణాత్ ।
యద్య ద్గ్రామే బహిర్వాపి చరం పురుషసంజ్ఞితం ।
పుత్రగర్భాశ్చ నారీణాం సర్వే ప్రాపుః క్షయం తదా ॥

తా॥ ఏనుగులు, గుఱ్ఱములు, ఎద్దులు, మొదలగునవి యెల్ల జచ్చెను పురుషులందరును మృతులయిరి చివరకు గర్భములో నుండిన పురుష గర్భంబులుగూడ నష్టంబు లయ్యెను

శ్లో॥ తదా స పురుషస్త్వేకో నమృతో బ్రాహ్మణోత్తమః ।
కృపయా రామచంద్రస్య మారుతేః కృపయాపి చ ॥

తా॥ శ్రీ రామచంద్రుని కృపచేతను, హనుమత్కటాక్షముచేతను, అప్పుడా బ్రాహ్మణుం డొక్కడుమాత్రమే బ్రతికియుండెను

శ్లో॥ తతః ప్రభాతే తా నార్యః సర్వా స్స్వపురుషా మృతాః ।
దృష్ట్వాతివిస్మయం ప్రాపు స్తాభిర్నైవ శ్రుతో ధ్వనిః ॥

శ్లో ॥ తదా విప్రం జీవితం తం దృష్ట్వా పంకేపి మారుతిం ।
పతితం విస్మయావిష్టా వప్రచ్ఛ స్తం ద్విజోత్తమం ।
తత స్స సకలం వృత్తం నారీ స్సంశ్రావయ త్తదా ॥
తత స్తాః ప్రార్థయిత్వా తం చక్రుః స్వీయపురాధిపం ।
సోపి రామాజ్ఞయా రాజ్యం చకార తత్పురస్య చ ॥
పురస్థితానాం నారీణాం స ఏవాసీ త్పతి స్తదా ॥

తా ॥ అంత నా మరుసటి దినమున తెల్లవారగా నాయూరి స్త్రీ లందరును తమ పురుషులు మృతులగుట నెఱింగి తాము ఆ గర్జనంబు వినని వారగుటచే నత్యంతాశ్చర్యమునంది బ్రాహ్మణోత్తమా ! ఇదియేమి వింతయని యడిగిరి అతడును జరిగిన సంగతినంతయు వారికి చెప్పెను అంత వారందరును ప్రార్థించి యతనిని తమపురమున కధిపతిని చేసిరి అతడును శ్రీ రామాజ్ఞ నంది యప్పట్టణమున రాజ్య మేలసాగెను ఆ పట్టణ స్త్రీల కందరకును తానే భర్తగా నుండెను

శ్లో ॥ తన్మారుతే ర్గర్జితం హి కాలేకాలే తు పూర్వవత్ ।
అద్యాపి శ్రూయతే తస్మి న్నగరే ఘనశబ్దవత్ ॥
తచ్ఛ్రుత్వాపుత్రగర్భాశ్చ ప్రస్థలంతి హి యోషితాం ।
స్త్రియ స్సహస్రశ శ్చాసః పురుష స్త్వేకఏవ సః
తదారభ్య తు స్త్రీరాజ్యం కథ్యతే మానవోత్తమైః ॥

తా॥ ఆ హనుమంతునియొక్క గర్జనంబు ఒక్కొక్క కాలమునందు ఘనుపటివలెనే ఇప్పటికిని అప్పురమున పిడుగులవలె వినబడుచున్నది అది వినబడిన నప్పటి యంగనలకు పుత్రగర్భంబు యుండిన నష్టే నశించును స్త్రీలు వేలకొలదిగా నుందురు అతడొక్కడే పురుషుడు అది మొదలు ఆ రాజ్యము స్త్రీరాజ్యమని పిలువబడుచుండెను

యీ కథ ఆనందరామాయణమునుండి గ్రహింపబడినది

శ్రీ హనుమద్వైభవ తృతీయ అధ్యాయములో 141 పేజీలో వ్రాయబడిన శ్రీ సప్తముఖీ హనుమత్కవచము యే మానవులు త్రిసంధ్యలయందు భక్తిశ్రద్ధలు కలవారై పఠింతురో వారిక సర్వశత్రు వినాశనము, పుత్రపౌత్రాభివృద్ధిను, సర్వరోగములు నశించుట, ఆయుః కీర్తియు వృద్ధిబొందుట, రాజానుగ్రహము కలుగుట, దుష్టస్థానముల యందుగల సర్వపాపగ్రహపీడలు తొలిగి సర్వత్ర విజయము కలవార గుదురు శనివారము నియమముగలవారుకాక యితరులుగాని, స్త్రీ పురుషభేదము లేక నియమములతో పఠించిన సర్వసౌఖ్యములు బడయగలరు, సర్వజ్వరశాంతియు కలుగుటయేగాక సర్వ భూతప్రేత పిశాచబాధలున్నా తప్పక తొలగును గాన తప్పక పఠించి ఆయాఫలముల నొందగలరు

## పంచముఖీ హనుమత్కవచమ్

అస్య శ్రీ పంచముఖీ వీరహనుమత్కవచస్తోత్ర మంత్రస్య బ్రహ్మ ఋషిః । గాయత్రీ చ్ఛంధః । శ్రీ రామచంద్రో దేవతా । రాంబీజం । మం శక్తిః । చంద్ర ఇతి కీలకం । రామచంద్రప్రసాద సిద్ధ్యర్థే పంచముఖీ వీరహనుమత్కవచస్తోత్ర మంత్రజపే వినియోగః । రాం అంగుష్ఠాభ్యాం నమఃరీం తర్జనీ భ్యాం నమః రూం మధ్యమాభ్యాం నమః రైం అనామికాభ్యాం నమః రౌం కనిష్టికాభ్యాం నమః రః కరతల కరపృష్ఠాభ్యాం నమః । ఏవం హృదయాదిన్యాసః । భూర్భువస్సువరోమితి దిగ్బంధః । ధ్యానం । వందే వానర నారసింహ ఖగరాట్క్రోడాశ్వవక్త్రాం చితంనానాలంకరణం త్రిపంచ నయనం దేదీప్యమానం రుచా హస్తాబ్జైరసి ఖేట పుస్తకసుధా కుంభాంకు శాద్రీః గదాం ఖట్వాంగం ఫణిభూరుహౌ దశభుజం సర్వారిగర్వాపహమ్ ।

అథ ధ్యానం ప్రవక్ష్యామి శృణు పార్వతి యత్నతః। మద్వ్రితం దేవదేవస్య ధ్యానం హనుమతః పరమ్॥ పంచవక్త్రం మహాభీమం త్రిపంచ నయనైర్యుతం। దశభిర్బాహుభిర్యుక్తం సర్వకామార్థసిద్ధిదమ్॥ పూర్వేతు వానరం వక్త్రం హృదయం సూర్యసన్నిభం। దంష్ట్రాకరాళవదనం భ్రుకు టీకుటిలోద్భవమ్॥ అస్యైకం దక్షిణం వక్త్రంనారసింహం మహాద్భుతమ్। అత్యుగ్రతేజోజ్వలితం భీషణం భయనాశనమ్॥ పశ్చిమే గారుడం వక్త్రం వజ్రదంష్ట్రం మహాబలం సర్వరోగప్రశమనం విషరోగనివారణమ్। ఉత్తరే సూకరం వక్త్రం కృష్ణదీప్తనభోజ్వలం। పాతాళేసిద్ధిదం నృణాం జ్వరరోగాదినాశనమ్॥ ఊర్ధ్వం హయాననం ఘోరం దానవాంతకరం పరం। యేన వక్త్రేణ విప్రేంద్ర సర్వవిద్యా వినిర్యయుః॥ ఏతత్పంచముఖం తస్య ధ్యాయతా మభయంకరం। ఖడ్గం త్రిశూలం ఖట్వాంగం పాశమంకుశపర్వతౌ॥ ద్వౌ ముష్టిసంగతౌమూర్ధ్ని సాయుధై ర్దశభిర్భుజైః ఏతాన్యాయుధజాలాని ధారయంతం యజామహే॥ ప్రేతాసనోపవిష్టం తు సర్వాభరణభూషితం। సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్॥ పంచాస్య మచ్యుతమనేక విచిత్రవీర్యం శ్రీశంఖచక్ర మణిసర్ప (భుజంగ) భుజాగ్రదేశం। పీతాంబరం మకరకుండల నూపురాంగం ప్రద్యోతితం కపివరం హృది భావయామి॥ మాం పశ్య పశ్య హనుమన్ని జదృష్టిపాతైః మాం రక్ష రక్ష పరితో రిపుదుఃఖపుంజాత్। వశ్యాన్ కురు త్రిజగతీవసుధాధిపాన్మేదేహి దేహి మహతీంవసుధాం శ్రియంచ॥ ఓం హరిమర్కట మర్కటాయ వం వం వం వం వం వౌషట్ హుం ఫట్ ఘేఘే స్వాహాస్మత్ప్రయోగాయ నమః ఓం హరిమర్కట మర్కటాయ ఓం ఓం ఓం ఓం ఓం హుం ఫట్ స్వాహా॥ హరిమర్కట మర్కటమంత్రమిదం యది లిఖ్యతి లిఖ్యతి భూమితలే, పరిమార్జతి మార్జతి వామకరే ప్రవినశ్యతి నశ్యతి శత్రుకులం పరిముంచతి ముంచతి శృంఖలికామ్॥ ఓం నమో

భగవతే పంచవదనాయి పూర్వకపిముఖాయ వీరహనుమతే హ్రాం ఠం ఠం ఠం ఠం ఠం మమ సర్వశత్రు సంహారకాయ మహాబలాయ హుం ఫట్ ఘే ఘే స్వాహా॥ ఓం నమో భగవతే పంచవదనాయ దక్షిణముఖే కరాళవదనాయ నృసింహాయ క్ష్రౌం హుం హుం హుం హుం హుం వీరహనుమతే సకల భూత ప్రేత పిశాచసర్వ ప్రయోగ గ్రహోచ్చాటనాయ హుంఫట్ స్వాహా। । ఓం నమో భగవతే పంచవదనాయ పశ్చిమ ముఖే వీరగరుడాయ క్ష్ర్యం మం మం మం మం మం మహా రుద్రాయ సకలరోగవిషహరాయ హుం ఫట్ స్వాహా । ఓం నమో భగవతే పంచవదనాయ ఉత్తరముఖే ఆదివరాహాయి గ్లాం లం లం లం లం లం లక్ష్మణప్రాణ రౌద్ర వీరహనుమతే లంకోపదహనాయ సకలసంపత్కరాయ పుత్ర పౌత్రాభివృద్ధి కిరాయ ఓం నమః స్వాహా। ఓం నమో భగవతే పంచవదనాయ ఊర్ధ్వముఖే హయగ్రీవాయ హ్ర్యం రూం రూం రూం రూం రూం రుద్రమూర్తయే సకలలోకవశీ కరణాయ వేదవిద్యాస్వరూపిణే ఓం నమః స్వాహా । ఓం ఖం ఘం ఙం ఛం ఝం ఞం ఠం ఢం ణం తం ధం నం ఫం భం మం యం రం లం వం శం షం సం హం ళం క్షం స్వాహా॥ ఇతి దిగ్బంధః ।

ఓం నమో భగవతే అంజనేయాయ మహాబలాయ హుం ఫట్ స్వాహా । ఓం నమో భగవతే ప్రబలపరాక్రమాక్రాంత సకలదిఙ్మండల యశోవితాన ధవళీకృత జగత్త్రితయాయ వజ్రదేహాయ రుద్రావతారాయ లంకాపురీదహనాయ దశశిరఃక్రాంతాయ సీతావిశ్వాసనాయ అనంతకోటి బ్రహ్మాండనాయకాయ మహాబలాయ వాయుపుత్రాయ అంజనాగర్భ సంభూతాయ శ్రీ రామలక్ష్మణానందకారాయ కపిసైన్యప్రియకరాయ సుగ్రీవ సాధ్యకరణ కార్యసాధకాయ పర్వతోత్పాటనాయ కుమారబ్రహ్మ చర్యాయ గంభీరశబ్దోదయాయ ఓంహ్రీంక్లీం సర్వదుష్ట గ్రహనివారణాయ సర్వరోగ

జ్వరోచ్చాట నోచ్చాటనాయ డాకినీవిధ్వంసవిధ్వంసనాయ ఓం శ్రీం హ్రీం హుం ఫట్ స్వాహా। ఓం నమో భగవతే శ్రీ హనుమతే మహాబలాయ సర్వరోగనివారణాయ సర్వవిఘ్న నివారణాయ సర్వదుష్ట గ్రహ రోగరోగోచ్చాటనాయ సర్వభూతమండల ప్రేతమండల పిశాచ మండలాది సర్వదుష్ట మండలోచ్చాటనాయ ఓంహ్రాం హ్రీం హ్రూం హుం ఫట్ ఘేఘే స్వాహా॥ ఓం నమోభగవతే శ్రీ వీరహనుమతే సర్వ భూతజ్వరప్రేత జ్వరైకాహికద్వ్యాహిక త్ర్యాహికచాతుర్థిక సంతప్త విషమజ్వరశ్లేష్మ జ్వరతాపజ్వరశీత మాహేశ్వర వైష్ణవజ్వర సర్వజ్వరాన్ ఛింది ఛింది భింది భింది యక్షరాక్షస బ్రహ్మ రాక్షసాన్ ఉచ్చాటయోచ్చా టయ ఓం శ్రీం హ్రీం హుం ఫట్ స్వాహా॥ ఓం నమో భగవతే పవనా త్మజాయ డాకినీ శాకినీ కామినీ మోహినీ నిశ్శేషనిరసనాయ సర్వ విషం నిర్విషం కురు కురు హరాయ హరాయ హుం ఫట్ స్వాహా । ఓం నమో భగవతే శ్రీ వీరహనుమతే సింహశరభశార్దూల గండభేరుండ పురుషా మృగాణా మాశానివాసినామాక్రమణం కురు కురు సర్వరోగాన్ నివారయ నివారయ ఆక్రోశయ ఆక్రోశయ మమ శత్రూన్ (మదం భయం) ఛింది ఛింది ఛింది ఛింది ఛేదయ ఛేదయ మారయ మారయ శోషయ శోషయ మోహయ మోహయ జ్వాలయ జ్వాలయ ప్రహారయ ప్రహారయ మమ సకలరోగాన్ ఛేదయఛేదయ ఓం శ్రీం హ్రీం హుం ఫట్ స్వాహా । ఓం నమోభగవతే శ్రీ వీరహనుమతే సర్వరోగదుష్టగ్రహాచ్చాటనాయ మమ శత్రుబలాని క్షోభయ క్షోభయ మమ సర్వకార్యాణి సాధయ సాధయ శృంఖలాబంధనం మోచయ మోచయ కారాగృహాన్ మోచయ మోచయ శిరశ్శూలకర్ణశూల అక్షిశూల కుక్షిశూల పార్శ్వశూల గుల్మశూలాది మహా రోగాన్నివారయ నివారయ నిర్మూలయ నిర్మూలయ నాగపాశా నంతవాసుకి

కర్కోటక కాలియ గులిక పద్మకుముద జలచర రాత్రించర

విషావావిసర్వవిషం నిర్విషం కురు కురు సర్వమిష్టజన ముఖ స్తంభనం కురు కురు సర్వస్త్రీ జనముఖస్తంభనం కురు కురు సర్వరాజభయ చోరభయ అగ్ని భయ పరిశమనం కురు కురు సర్వపర మంత్ర పరమంత్ర పరయంత్ర పరతంత్ర పరవిద్యా శ్చేదయ చ్ఛేదయ సంత్రాసయ సంత్రాసయ మమ సర్వవిద్యాః ప్రకటయ ప్రకటయ మాంపోషయ పోషయ సర్వారిష్టం శమయ శమయ సర్వశత్రూ సంహారయ సంహారయ సర్వరోగపిశాచబాధా విషబాధాన్నివారయ నివారయ మమ అసాధ్యాకార్యం సాధయ సాధయ ఓం క్రోం హ్రీం హ్రూం హ్రైం హ్రాం హ్రః హుంఫట్ స్వాహా ॥ ఓం నమో భగవతే శ్రీ వీరహనుమతే వరప్రసాదకాయ మమ సర్వాభీష్ట సంప్రదక్షణ కరాయ జగదాపన్నివారణాయ ఓం ఓం ఓం ఓం ఓం హుం ఫట్ ఘే ఘే స్వాహా ॥ య ఇదంకవచం నిత్యం సర్వశత్రు నివారణం ద్వివారంతు పఠేన్ని త్యం సర్వసంపత్కరం శుభమ్ ॥ త్రివారం యః పఠేన్నిత్యం సర్వరోగ నివారణం। చతుర్వారం పఠేన్ని త్యం సర్వశత్రు వశీకరమ్ ॥ పంచవారం పఠేన్నిత్యం పంచవక్త్రో (ముఖీ) వశీకరమ్ । షడ్వారం యః పఠేన్నిత్యం సర్వదేవవశీకరమ్ ॥ సప్తవారం పఠేన్నిత్యం సర్వసౌభాగ్యదాయకమ్ । అష్టవారం పఠేన్నిత్యం సర్వకామ్యార్థ సిద్ధిదమ్ ॥ నవవారం సప్తకేన రాజభోగసమన్వితం। దశవారం ద్విసప్తకేన త్రైలోక్యజ్ఞాన దర్శనమ్ ॥ ఏకాదశే త్రిసప్తకేనత్రైలోక్య విజయీభవేత్ కవచం స్మరణం చైవ మహాబల సమన్వితమ్ ॥

తా॥ ఈ కవచము నిత్యము పఠించువారలకు సర్వశత్రు నివారణ మగును నిత్యమును రెండు పర్యాయములు చొప్పున పఠించువారలకు సర్వసంపదలు కలుగును నిత్యమును మూడు పర్యాయములు పఠించువార లకు సర్వరోగనివారణ మగును నిత్యమును నాలుగు పర్యాయములు

పఠించువారలకు సర్వశత్రుపశీకరమగును నిత్యమును అయిదు పర్యాయములు పఠించు వారలకు హనుమంతుడే పశుడగును నిత్యమును ఆరు పర్యాయములు పఠించువారలకు సర్వదేవతలు పశులగుదురు నిత్యము యేడు పర్యాయములు పఠించువారలకు అన్ని కోరికలు ఫలించును ఏడుదినములు రోజుకు తొమ్మిది పర్యాయముల చొప్పున పఠించువారికి రాజ్యభోగము లభించును పదునాల్గు రోజులు రోజుఒకటింటికి పది పర్యాయములు పఠించువారికి మూడు లోకముల సంగతులు తెలియును ఇరువది యొక్కరోజు రోజు ఒకటింటికి పదకొండు పర్యాయములు పఠించువారికి త్రైలోక్య విజయము కలుగును ఈ కవచ పారాయణము పలన గొప్ప సామర్ధ్యము కలవారగుదురు

## పంచముఖీ హనుమన్మాలా మంత్రము

అస్య శ్రీ పంచముఖీవీరహనుమన్మాలామంత్రస్య రామచంద్ర ఋషిః । అనుష్టుప్ ఛందః । శ్రీసీతారామోదేవతా । హం బీజం హం శక్తిః । మమ సర్వాభీష్టసిద్ధ్యర్థే భూతప్రేత నివారణార్థే సర్వజనవశీకరణార్థే శ్రీ పంచముఖీ హనుమన్మాలా మంత్రజపే వినియోగః॥ ఓం హం హనుమతే అంగుష్ఠాభ్యాం నమః । ఓం యం వాయుదేవతాయై తర్జనీభ్యాం నమః । ఓం హం అంజనా సూనవే మధ్యమాభ్యాం నమః । ఓం రం రామదూతాయ అనామికాభ్యాం నమః । ఓం రుం రుద్రమూర్తయే కరతలకరపృష్ఠాభ్యాం నమః । ఓం హం హనుమతే కనిష్ఠికాభ్యాం నమః। ఓం రుం రుద్రమూర్తయే కరతలకరపృష్ఠాభ్యాం నమః। ఓం హం హనుమతే హృదయాయ నమః। ఓం యం వాయుదేవతాయై శిరసే స్వాహా । ఓం హం అంజనాసూనవే శిఖాయైవషట్ । ఓం రం రామదూతాయ కవచాయ హుం । ఓం హం హనుమతే నేత్రత్రయాయ

వౌషట్। ఓం హుం రుద్రమూర్తయే అస్త్రాయ ఫట్। భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥ ధ్యానమ్॥ పంచాస్య మచ్యుత మనేక విచిత్రవీర్యం చక్రాసి శంఖవిధృతం కపిరాజవర్యం। పీతాంబరాదిముకుటై రుపశోభితాంగం పింగాక్షమాద్య మనిశం మనసా స్మరామి॥ మనుః॥ వందే వానరనారసింహ ఖగరాట్క్రోడాశ్వ వక్త్రాంచితం నానాలంకరణం త్రిపంచ నయనం దేదీప్యమానం రుచా। హస్తాబ్జై రసిఖేటపుస్తకసుధా కుంభాంకుశాద్రీ న్హలం ఖట్వాంగం ఫణిభూరుహౌ దశభుజం సర్వారి గర్వాపహమ్। ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః। ఓం నమో భగవతే ప్రకటితపరాక్రమాక్రాంత సకల దిఙ్మండలాయ నిజకీర్తి స్ఫూర్తి ధావళ్యవితాయమానజగత్త్రితయాయ, అతులబలైశ్వర్యరుద్రావతారాయ మైరావణ మదవారణ గర్వనిర్వాపణోత్కంఠ కంఠీరవాయ బ్రహ్మాస్త్రగర్వ సర్వంకషాయ వజ్రశరీరాయ లంకాలంకారహారిణే తృణీ కృతార్ణవలంఘనాయ అక్షశిక్షణవిచక్షణాయ దశగ్రీవగర్వపర్వతోత్పాటనాయ లక్ష్మణప్రాణదాయినే సీతామనోల్లాసకరాయ రామమానసచకోర మృతకరాయ మణికుండల మండితగండ స్థలాయ మందహాసోజ్జ్వలన్ముఖారవిందాయ మౌంజీకౌపీన విరాజత్కటితటాయ కనకయజ్ఞోపవీతాయ దుర్వారవారకీలితలంబశిఖాయ తటిత్కోటిసముజ్జ్వల పీతాంబరాలంకృతాయ తప్తజాంబూనదప్రభాభాసుర రమ్య దివ్య మంగళ విగ్రహాయ మణిమయ గ్రైవేయాంగదహారకంకణ కిరీటోదారమూర్తయే రక్తపంకేరుహాక్షాయ త్రిపంచనయనస్ఫురత్పంచవక్త్రా ఖట్వాంగ త్రిశూల ఖడ్గోగ్రపాశాంకుశ క్ష్మాధర భూరుహ కౌమోదకీ కపాల హలభృద్దశ భుజాటోప ప్రతాపభూషణాయ వానరనృసింహ తార్క్ష్య వరాహ హయగ్రీవానన ధరాయ నిరంకుశ వాగ్వైభవప్రదాయ తత్త్వజ్ఞానదాయినే సహోత్కృష్టఫలప్రదాయ సుకుమారబ్రహ్మచారిణే భరతప్రాణసంరక్షణాయ గంభీర శబ్దశాలినే సర్వపాపవినాశాయ రామ సుగ్రీవ సంధాన చాతుర్య

ప్రభావాయ సుగ్రీవాహ్లాదకారిణే వాలివినాశ కారణాయ రుద్రతేజస్వినే వాయునందనాయ అంజనాగర్భ రత్నాకరామృతకరాయ నిరంతర రామచంద్ర పాదారవిందమకరంద మత్తమధుకరాయ మహామహానసాయ నిజవాల వలయీకృత కపిసైన్య ప్రాకారాయ సకలజగన్మోదకోత్కృష్టకార్యనిర్వాహ కాయ కేసరినందనాయ కపికుంజరాయ భవిష్యద్బ్రహ్మణే ఓం నమో భగవతే పంచవక్త్ర హనుమతే తేజోరాశే ఏహ్యేహి దేవభయ మసురభయం గంధర్వ భయం యక్షభయం బ్రహ్మరాక్షసభయం భూతప్రేతభయం పిశాచభయం విద్రావయ విద్రావయ, రాజభయం చోరభయం శత్రుభయం సర్వభయం వృశ్చికభయం మృగభయం పక్షిభయం క్రిమిభయం కీటకభయం ఖాదయ ఖాదయ. ఓం నమో భగవతే పంచవక్త్ర హనుమతే జగదాశ్చర్యకరశౌర్యశాలినే ఏహ్యేహి శ్రవణజభూతానాం దృష్టిజభూతానాం శాకినీ డాకినీ కామినీ మోహినీ భేతాళ బ్రహ్మరాక్షస సకల కూశ్మాండానాం విషయదుష్టానాం విషమ విశేషజనానాం భయం హర హర. మథ మథ భేదయ భేదయ ఛేదయ ఛేదయ మారయ మారయ శోషయ శోషయ ప్రహారయ ప్రహారయ ఠ ఠ ఠ ఠ ఖ ఖ ఖ ఖ ఖే ఖే ఓం నమో భగవతే పంచ వక్త్ర హనుమతే శృంఖలాబంధవిమోచనాయ ఉమామహేశ్వర తేజో మహిమావతార సర్వవిషభేదన సర్వభయోత్పాటన సర్వజ్వరచ్ఛేదన సర్వభయభంజన, ఓం నమోభగవతే పంచవక్త్రహనుమతేకబళీకృతార్క మండల భూతమండల ప్రేతమండల పిశాచమండల నిర్ధాటయ నిర్ధాటయ భూతజ్వర, ప్రేతజ్వర పిశాచజ్వర, మహేశ్వరజ్వరభేతాళజ్వర బ్రహ్మరాక్షసజ్వర ఐకాహికజ్వరద్వ్యాహికజ్వర త్ర్యాహికజ్వర చాతుర్థికజ్వర పాంచరాత్రికజ్వర విషమజ్వర బ్రహ్మరాక్షసజ్వర దోషజ్వర భేతాళపాశ మహానాగకుల విషం నిర్విషం కురు కురు ఝట ఝట దహ దహ ఓం నమోభగవతే పంచవక్త్ర హనుమతే కాలరుద్ర రౌద్రావతార సర్వగ్రహోను

చ్ఛాల యోద్ఛాటయ ఆహో ఆహో ఏహి ఏహి వశదిశో బంధ బంధసర్వ లోరక్ష రక్ష సర్వశత్రూ౯ కంపయ కంపయ మారయ మారయ దాహయ దాహయ కబళయ కబళయ సర్వజనా వేశయావేశయ మోహయ మోహయ ఆకర్షయాకర్షయ ఓం నమో భగవతే పంచవక్త్ర హనూమతే జగద్భిలకీర్తయే ప్రత్యర్థిదర్పదళనాయ పరమంత్ర దర్పదళనాయ పరమంత్ర ప్రాణనాశనాయ ఆత్మమంత్ర పరిరక్షణాయ పరబలం ఖాదయ ఖాదయ క్షోభయ క్షోభయి హోరయ హోరయ త్వద్భక్త మనోరథాన్ పూరయ పూరయి సకల సంజీవినీనాయక వరంమే దాపయ దాపయ ఓం నమో భగవతే పంచవక్త్ర హనూమతే ఓం హ్రాం క్ష్రాం క్ష్ర్మ్యం గ్లాం హ్వాం శ్రీం భ్రీం ఘ్రీం ఓం స్రూం క్లీం హ్రోం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హుం ఫట్ ఖే ఖే హుం ఫట్ స్వాహా.

ఈమాలామంత్రమును నిత్యము త్రికాలములయందుగాని ఏకకాలమందుగాని నియమముకలవారై ఆపత్తులయందును భూతప్రేతపిశాచాది బాధలయందును ఉద్యోగవిఘ్నములయందును విద్యార్థులు పరీక్షలయందు ఉత్తీర్ణులు కాగలందులకును బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులను స్త్రీలును పఠించినయెడల సకలకార్యసిద్ధులు చేకూరు ననుటకు సందియములేదు వారి వారి ఇష్టకార్యములను తలచి ఈమాలను ధ్యానము చేయవలసినది ప్రతి దినము తెల్లవారుజామున మేల్కాంచి మానసికముగా ఈమాలామంత్రమును అయిదుపర్యాయములు పఠించిన సకలకార్యసాఫల్యము చేకూరును ప్రతిశనివారమున దీక్షకలవారై మూడు వేళలయందు జపించుచు ఒక బ్రహ్మణుని భోజనముచే తృప్తిపరచిన సకల ఆపత్తులు తొలగును అయిదు అప్పములను ఆంజనేయమూర్తివారికి వారివారి కులాచార ప్రకారము నైవేద్యము పెట్టవలెను ఇటులదీక్షతో

చేయు వారికి శ్రీ ఆంజనేయమూర్తి స్వప్నమందు దర్శనమిచ్చుచుండును గాన భక్తులెల్లరు హనుమత్సేవచేసి తరించుదురుగాక

## ధ్యానమ్

శ్లో॥ శ్రీసీతారామపాదాంబుజ మధులహరీ పానమత్త ద్విరేఫః। విజ్ఞాతాగాధ సేవావిధిసలిలనిధి ప్రారంభే రభసః। దుర్వారోద్యద్ధృషీక ప్రబలతురంగసంశిక్షణాత్యంతదక్షః స్వాత్మన్యేకో రమిస్సపది మమ భవత్వాంజనేయః ప్రసన్నః॥ త్యాగీయోగీ విరాగీ పరహితకరణానుక్షణానంద భోగీ త్రాతా నేతా విధాతా నిఖిలసురరిపు వ్రాత దుఃఖ ప్రదాతా। సాదాచారి ప్రకారి స్సమరపింగణాజయ్యో వీరాధివీరః కేళీశాలీక్ష్మాభృద్రి స్సపదిమమ భవత్వాంజనేయః ప్రసన్నః॥ శ్రుత్వా రామాభిధానం పులకితసుతను స్సద్యో విధత్తేజడత్వం రామాఖ్యోచ్చారణాద్యే నయన జలధరారుద్ధకంఠో విభాతి రామం హిత్వా న కించిన్నివసతి హృదయే యస్య భక్తిప్రపూర్ణే భూయః శ్రేయః ప్రదాతాసహి మమ భవతాదాంజనేయః ప్రసన్నః॥ అంభోధేర్లంఘనేనాఽసురపతినగరే భూమిజాన్వేషణేన లంకాయాం చారణేన ప్రతిభటబలపిశైల్యవిద్రావణేన। సంజీవిన్యాః ప్రదానాత్స్మృతి రహితరఘుభ్రాతురుజ్జీవనేన ప్రఖ్యాతకీర్తి ప్రభావస్సహి మమ భవతాదాంజనేయ ప్రసన్నః। ॥ సాంవర్త్యం శివత్వం జలదహాభవతా భూతయస్సిద్ధయోఽష్ట శ్రీమద్రామాంఘ్రిపద్మం కేవలం గతరజసో యస్యనాంశేన తుల్యాః। దాస్యంయస్మైత్వమాత్మ్యం ప్రమదమతితరాం దాస్యతిప్రాభవాది ప్యానం వామంచకందవస్సహి మమ భవతాదాంజనేయః ప్రసన్నః॥

# సర్వదేవతాస్తోత్రగద్యము

శ్రీమాన్ నిరంతరకరుణామృతసారవర్షి పింగళాక్షమహాహు
మహేంద్రాయదక్త తాంచితమహాహను కరుణాధరబింబ భూషితముఖ
చంద్ర మండల అతప్తకార్తస్వరాభాస్వరకలిత చూడావిరాజిత అప్రతిమ
దివ్య మాణిక్యకుండలమండిత గండభాగః సమానమానసీయ రమాకాంతకర
కమలకలిత పాంచజన్యబంధు కంబుకంధర ఐరావత హస్తసువర్తుల
దీర్ఘభుజార్గళ అనన్యసాధారణ సంకల్పసంభవాస్థాన పీఠపరిణాహ బాహ్యాంతర
అమూల్య పీతాంబరాలంకృత కటిప్రదేశ అపహరతవినుతజనమనోరథ
సాధనపాదయుగళ ఉష్ట్రవాహన అమరగంగానదీ పరివేష్టితహాటకాచలవర్ధి
ర్తలాంగూల రంగదుత్తుంగ మంగళాంగద అంజనానందవర్ధన అమలోర్ధ్వ
పుండ్ర స్తదుపరికర్పూర సమ్మిశ్రశుభ్రవిభూతి ధారణో యజ్ఞోపవీత
తులసీభద్రాక్ష రుద్రాక్షమాలాభిరామః శ్రీరామచంద్ర చరణారవింద
సంధిత హృదయారవింద అఖిలకల్యాణగుణవాన్ శ్రీ హనూమానువాస్య
తేఽస్మాభిః ॥

ఆంజనేయుని భక్తులెల్లరు కాలనియమము లేకయే యెల్లప్పుడు ఈస్తోత్రమును పఠించిన సకలకార్యములు చేకూరును

శ్రీ గురుభ్యో నమః

## శ్రీ మద్దనుమ న్నుతిరూప శ్లోకాష్టకము

శ్లో ॥ వీక్ష్యే కదాఽహం తరుణాఽర్కసన్నిభమ్ ।
దయామృతార్ద్రా రుణపంకజేక్షణమ్ ।
ముఖం కపీంద్రస్య మృదుస్మితాంచితమ్ ।
చింత్స్వరత్నాంచితకుండలోజ్జ్వలమ్ ॥

తా॥ ఉదయించు సూర్యునితో దీటైనదియును, కరుణారూపమైన యమృతరసముచే నార్ద్రమైన నెఱ్ఱతామర పూలతో బోలిన కనులు కలదియును మృదువైన లేనగవులతో నెసఁగునదియును, పురాతనములైన రతనములతో రచితములగు స్వర్ణకుండలములచే నెంతయు విరాజిల్లు శ్రీ హనుమద్భగవానుని ముఖారవిందము నెపుడు కనుగొందునో కదా।

శ్లో॥ కదాఽహ మారా దుపయాంత మద్భుత।
ప్రభావ మీశం జగతాం కపిప్రభుమ్।
సమీక్ష్య వేగా దభిగమ్య సంస్తువన్।
జగామ హర్షా త్ప్రపత న్పదాఽబ్జయోః॥

తా॥ తననే ధ్యానించుచున్న నాచేరువకుఁ గరుణతో నరుగుదెంచుచున్న జగత్ప్రభువును నద్భుత ప్రభావుండు నగు కపిప్రభువును గాంచి వేగముగా నుతించుచు నెదుర్కొని పరమానందముతో నప్పరమపురుషుని పదాబ్జములయందెపుడు సాగిలి పడుదునోగదా।

శ్లో॥ కదాఽంజనాసూను పదాంబుజద్వయం।
కఠోర సంసార భయప్రశామకమ్।
కరద్వయేన ప్రతిగృహ్యసాదరో।
మదీయ మూర్ధ్న మలంకరో మ్యహమ్॥

తా॥ మిగుల కఠినమైన సంసారపు వదలును సమూలముగా జల్లార్చునట్టి శ్రీమదంజనాతనయుని పాదారవింద యుగళమును బరమాదరముతో రెండుచేతులతో బట్టి నా యౌదలం బెట్టుకొని యెప్పు డెసంగుదునో గదా।

శ్లో॥ కదా లుఠంతం స్వపదాబ్జయో ర్ముదా।
హఠా త్సముద్ధాప్య హరీంద్ర నాయకః।
మదీయమూర్ధ్ని స్వకరాంబుజం శుభం।
విధాయ మహీ రితి వక్ష్యతే విభుః॥

తా॥ పరమానందములో, తన పాదారవిందములయందు దొరలు చున్న నన్ను వెంటనే లేవనెత్తి 'వత్సా! వెరువకు' మని తన మంగళకరమగు కరకమలము నాశిరముపై నుంచి దయతో నెప్పుడు నుడివెడునో కదా!

శ్లో॥ ప్రదీప్త కార్తస్వర శైలభాస్వరం।
ప్రభూతరక్షోగణదర్ప శిక్షతమ్।
వపుః కదాలింగ్య వరప్రదం సతాం।
సువర్చలేశస్య సుఖీభవా మ్యహమ్।

తా॥ చెన్నునెంతయుంగను బంగరుకొండవలె ప్రకాశించునట్టి యును, విస్తారమైన రాక్షసులగుమిదగు దర్పమును శిక్షించునట్టిదియు సత్పురుషులకు వరముల నొసంగునదియును, సువర్చలా ప్రాణనాధుని మేనిఁ గౌగిలించి యెపుడు నే సుఖినగుదునో గదా!

శ్లో॥ ధన్యా వాచః కపివరగుణస్తోత్రపాతాః కవీనాం।
ధన్యో జంతు ర్జగతి హనుమత్పాదపూజా ప్రవీణః।
ధన్యాఽవాసా స్సతత హనుమత్పాదముద్రాభిరామా।
ధన్యం లోకే కపికుల మభూ దాంజనేయావతారాత్॥

తా॥ వానరశ్రేష్ఠుండగు శ్రీ హనుమంతుని గొనముల వినుతించు ...ే పవిత్రంబులైన సుకవుల పలుకులే ధన్యములు లోకమున శ్రీ యంజనాసుతుని పాదముల పత్ప్రింప నేర్చిన ప్రాణియే ధన్యమైనది

నిరంతరమును మారుతాత్మజుని పాదపద్మముల చిహ్నములచె విలసిల్లెడు భువనములే ధన్యమును, మఱియును లోకమున శ్రీ మదాంజనేయా వతారము చేతనె కపికుల మెంతయు ధన్యమైనది

శ్లో ॥ జంతూనామతి దుర్లభా మనుజతా తత్రాపి భూదేవతా ।
బ్రాహ్మణ్యేఽపి చ వేదశాస్త్రవిషయా ప్రజ్ఞా తతో దుర్లభా ।
తత్రాఽప్యుత్తమదేవతావిషయిణీ భక్తి ర్భవోచ్ఛేదినీ ।
దుర్ల భ్యా సుతరాం తథాఽపి హనుమత్పాదారవిందే రతిః ॥

తా ॥ లోకమున మానవత్వమెంతయు దుర్లభము అందునను బ్రాహ్మణత్వము పురాకృతసుకృత లభ్యము బ్రాహ్మణ్య మొదవినను వేదశాస్త్ర విషయకమగు విజ్ఞానమునంద నవశక్యము అందును జన్మ బంధముబాపెడు నుత్తమ దేవతావిషయకమగు భక్తియందుట దుర్లభము, అయినను శ్రీ హనుమాత్పాదారవిందములయందు నిరంతర రతి మిగుల దుర్లభము

శ్లో ॥ అహం హనూమత్పదవాచ్య దైవం ।
భజామి సానంద మనోవిహంగం ।
త దన్యదైవం నకదాఽపి దేవం ।
బ్రహ్మాది భూయోపి న ఫాలనేత్రం ॥

తా ॥ నేను ఆనందముతో కూడిన మనమనుపక్షి గలవాడును స్వయంజ్యోతియునగు హనుమత్పదముచే నొప్పు దైవమును తప్ప నెపుడుగాని బ్రహ్మయు శివుడు మున్నగు నితరదైవముల భజింపను

శ్లో ॥ యశ్చాత్రజ మిదం పుణ్యం ప్రాత రుద్ధాయ మానవః ।
పఠే దనన్యయా భక్త్యాసర్వా న్కా మా నవాప్నుయాత్ ॥

తా ॥ ఏమనుజుండు వేకువనే లేచి పవిత్రముగు నీ శ్లోకాష్టకము ననన్యభక్తిచే బఠించునో యతఁ డఖిలవాంఛాఫలముల బొందును.

## నమస్కారపూర్వక షోడశోపచార హనుమత్పూజ

శ్లో ॥ విప్రాదయోజనగణా స్తవనం ప్రచక్రు ।
ర్వృత్రిహ్మాప్యరూప జగతాంపరిపాలకస్య ।
రామప్రభావబలపూరిత రుద్రమూర్తే ।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే ॥

శ్రీరామదూత శరణాగత దీనబంధో ।
వజ్రాంగదేహ కరుణాకర రుద్రమూర్తే ॥
శ్రీరామ రామ ఇతి జాపకృతాత్మశక్తే ।
శ్రీరామదూత సతతం హనుమన్నమస్తే ।

సింధూరతైల రచితాతి విభూషణాత్మన్ ।
లాంగూలతాడన కృతాసుర సంఘనాశ ॥
క్రోధా ద్దశాననపురీ దహనప్రకారిన్ ।
శ్రీరామదూత సతతం హనుమన్నమస్తే ॥

రామారిణాకృత హృతౌ జనకాత్మజాయా ।
లంకాస్థితా జనక జేతి సుశోధకారిన్ ।
సీతాతిశోకహరణ ప్రబలారిహంత ।
శ్రీరామదూత సతతం హనుమన్నమస్తే ।

సమ్మూర్ఛితాంగ విభు లక్ష్మణ సౌఖ్యకారిన్ ।
రౌద్రాంగదీర్ఘ హనుమ న్నగహస్తధారిన్ ।

దుష్టాసురాహిమహిరావణ నాశకారిన్ ।
శ్రీ రామదూత సతతం హనుమ న్నమస్తే ॥
శైలీ గదాధర సమార్తిత వజ్రకచ్ఛి ।
న్యాసాంఘ్రిపీడిత మనోజ సులబ్ధకీర్తే ।
శ్రీ రామదాస దృఢబుద్ధిమతాంవరిష్ఠ ।
శ్రీ రామదూత సతతం హనుమ న్నమస్తే ॥

విప్రాదిజాతిక నికేతనకారిదాన ।
గ్రామధివాస కృతధామ విశాలకీర్తే ।
శ్రీ రామదాస దృఢబుద్ధి మతాంవరిష్ఠ ।
శ్రీ రామదూత సతతం హనుమ న్నమస్తే ॥

ఫల్గునదీతట సముద్భవ జాతివృక్షే ।
ప్రసాదమండిత మనోహరవాస ధామ్ని ।
రూపం విభాతి కపిరాజ మనోహరం తే ।
శ్రీ రామదూత సతతం హనుమ న్నమస్తే ॥

శుక్లాసుభాద్రపదమాస భవాద్వితీయా ।
భాతి త్వదీయ పావనోత్సవ జాతహర్షా ।
యాత్రాళుసంఘ దచితా జనవీధికాత్ర
శ్రీ రామదూత సతతం హనుమ న్నమస్తే ॥

జన్మాదిహీన పవనాంజనికాత్మ దేవః ।
శ్రీ జానకీపతి మనోజవ దీప్త కాంతే ।
నానా కపీంద్రచయనాయక బ్రహ్మచారిన్ ।
శ్రీ రామదూత సతతం హనుమ న్నమస్తే ॥
లాంగూలధారక జితేంద్రియ వాయుపుత్ర ।

శ్లో॥ షట్పంచహస్త రచిత ధ్వజ దీర్ఘమాన ।
శ్రీరామసేవన పరేణ పదోర్ధ్వకాయ ।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే ।

హే పావనేయ జనరక్షక రామభక్త ।
రాజీవలోచన విశాల సుబాలధారిన్ ।
దీర్ఘార్కస్రగ్ధర జటామకుటాదిధారిన్ ।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే ।

ఆవాహనాది శుభషోడశ కోపచారా ।
స్తుభ్యం నివేదనకృతా హనుమ న్మయా యే ।
అంగీకురుష్వ భగవ న్హనుమ న్మహేశ ।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే ।

రోగాన్వినాశయ రిపూనథ విఘ్నజాలం ।
తాపత్రయం యమ భయం భవపాపసంఘం ।
దుఃఖాని నాశయవినాశయ రిష్టకష్టం ।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే ।

హే భక్తవత్సల విభో భగవ న్దయాళో ।
పుత్రా న్యశాంసి ఖలు దేహి ధనాని దేహి ।
జయాసుభాగ్యక గవాది సుఖాని దేహి ।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే ।

న్యూనాతిరిక్త భవదోషభయం క్షమస్వ ।
పూజాం గృహాణ సకలాం స్తుతిపాఠయుక్తాం ।
దేవ ప్రసీద భగవ న్హనుమ న్కృపాళో ।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే ।

శ్లో॥ వాక్ప్రాజనం త్వయి సమర్పిత మేవ భక్త్యా।
దోషి న్విహాయ సకలాః ఖలు తత్రసంస్థా।
సమ్యగ్రహేణ మగుణా నీవ రాజహంసః।
శ్రీరామదూత సతతం హనుమ న్నమస్తే।

ప్రతిశ్లోకమునకు నమస్తే యనునప్పుడు భక్తియుక్తులై హనుమంతునకు చేతులు జోడించి నమస్కారము చేయవలయును యిందువలన సర్వరోగములు, సర్వ శత్రుభయములు నశించును

# సర్వ శత్రుంజయ హనుమత్ స్తోత్రం

శ్లో॥ శ్రీమంతం హనుమంత మాత్తరిపుభి ద్భూభృత్త
దుద్రాభిధం।
వగ్లద్వాలధిబద్ధవై రినిచయం చామీకరాద్రి ప్రభం।
రోషి ద్రక్తపిశంగనేత్రనలినం భ్రూభంగ మంగస్ఫుర।
త్ప్రోద్యచ్చండమయూఖమండలముఖం దుఃఖాపహం
దుఃఖినాం॥
కౌపీనం కటిసూత్ర మౌం జ్యజినయుగ్దేహం విదేహాత్మజా।
ప్రాణాధీశ పదారవింద నిహితస్వాంతం కృతాంతం
ద్విషాం॥
ధ్యాత్వైవం సమరాంగణస్థిత మథానీయ స్వహృత్పంకజే।
సంపూజ్యాఽఖిల పూజనోక్తవిధినా సంప్రార్థయే త్ప్రార్థితం।

తా॥ ఇట్లు ధ్యాన మొనర్చి యీక్రింద వ్రాయబడిన స్తోత్రము చేయవలెను

శ్లో ॥ హనుమ న్నంజనీసూనో మహాబలపరాక్రమ ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
మర్కటాధిప మార్తాండ మండల గ్రాసకారక ।
లోలల్లాంగూలపాతేన మమారాతి న్ని పాతయ ॥
అక్షక్షపణపింగాక్ష క్షితిజాశుగ్వినాశన ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
రుద్రావతార సంసార దుఃఖభారాపహారక ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
శ్రీరామచరణాంభోజ మధురాయితమానస ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
వాలికాలరదక్లాంత సుగ్రీవోన్మోచన ప్రభో ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
సీతావిరహవారీశ మగ్నసీతేశతారక ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
రక్షోరాజప్రతాపాగ్ని దహ్యమానజగద్వన ॥
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
గ్రస్తాశేషజగత్స్వాస్థ్య రక్షసాంభోధిమందర ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
పుచ్ఛగుచ్ఛ స్ఫురద్వీర దగ్ధారిపత్తన ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
జగన్మనోదురల్లంఘ్య పారావారవిలంఘన ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ

స్మృతమాత్రసమస్తేష్టపూరక ప్రణతప్రియ ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
రాత్రించరచమూరాశి కర్తనైక వికర్తన ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
జానకీ జానకీజాని ప్రేమపాత్ర పరంతప ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
భీమాదిక మహావీర వీరా వేశావతారక ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
వజ్రాంగనఖ దంష్ట్రేశ వజ్రవజ్రావగుంఠన ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
అఖర్వ గర్వ గంధర్వ పర్వతోచ్ఛేదనస్వర ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
లక్ష్మణప్రాణసంత్రాణ త్రాత తీక్ష్ణకరాన్వయ
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
సీతాశీర్వాదసంపన్న సమస్తావయవాక్షిత ॥
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
రామాది విప్రయోగార్త భరతాద్యార్తి నాశన ।
లోలల్లాంగూలపాతేన మమారాతీ న్ని పాతయ ॥
ఇ త్యేవ మశ్వత్థతలోపవిష్టః ।
శత్రూ న్జయ న్నామ పఠే త్స్వయం యః ।
సశీఘ్రమేవాస్త సమస్త శత్రుః ।
ప్రమోదతే మారుతజ ప్రభావాత్ ॥

పై విధముగా అశ్వర్థ వృక్షమూలమున గూర్చుని పై స్తోత్రము నెవడు పఠించునో వెంటనే వాని సమస్త శత్రువులు నశించుననియు, హనుమత్ప్రసాదమువలన సంతోషముతో నుండుననియు తాత్పర్యము

## సర్పా పన్నివారక హనుమత్కవచం

పరాశరమహర్షి మైత్రేయులవారికి చెప్పుచున్నారు :

శ్లో ॥ అథాపరం ప్రవక్ష్యామి మైత్రేయ మునిసత్తమ ।
వసిష్ఠమునినా ప్రోక్తం హనూమత్కవచం శుభం ॥
పుర్లా హి వాయుదేవాయ బ్రహ్మణా సముదీరితం ।
శ్రీరామాయ వసిష్ఠోక్త మిదం కవచ ముత్తమం ॥

తా॥ మైత్రేయా! మునివర్యా! వసిష్ఠునిచే చెప్పబడిన శుభప్రదమైన హనుమత్కవచమును పూర్వము వాయుదేవునకు బ్రహ్మదేవునిచే జెప్ప బడినదియును, శ్రీరామునికొరకు వసిష్ఠునిచే జెప్పబడినదియు నగు కవచమును జెప్పెదను వినుము అని చెప్పెను

వసిష్ఠఉవాచ :

శ్లో ॥ హనుమత్కవచం పుణ్యం వక్ష్యామి శృణు రాఘవ ।
ఆయురారోగ్యదం పుంసాం సర్వాభీష్టప్రదాయకం ॥
బల శ్రీకీర్తి జనకం సర్వశత్రువినాశనం ।
య త్పురా వాయుదేవాయ బ్రహ్మణా సముదీరితం ।
ఆదిత్యాదిగ్రహోన్సర్వే దుష్టస్థానస్థితాయది ।
పఠేత్తత్కవచం నిత్యం గ్రహదోషోపశాంతయే ॥

తా॥ వసిష్ఠుడు రామునితో నిట్లనెను : రామచంద్రా! ఆయురారోగ్య ప్రదమును, సర్వాభీష్టప్రదమును, బలమును, సంపదను, కీర్తిని గలుగ

జేయనదియును, శత్రుసంహారకమును, పూర్వము వాయుదేవునకు బ్రహ్మదేవునిచే జెప్పబడి నదియునగు శ్రీ హనుమత్కవచమును నీకు జెప్పెదను వినుము మఱియు ఆదిత్యాదిగ్రహములు దుష్టస్థానముల యందున్నపుడు తద్దోషనివారణార్థము నీ కవచమును బఠించినచో తద్గ్రహదోషములు నివర్తించును

శ్లో॥ దివ్యౌషధప్రదానేన కపికోటిరనేకశః ।
హనూమతే జీవయతే నమస్తస్మై మహాత్మనే ॥
ఏతచ్ఛ్లోకం పఠిత్వాతు పంచవారం నరోత్తమః ।
నమస్కృత్య హనూమంతం కవచం చ పఠేత్తతః ।

తా॥ "దివ్యౌషధప్రభావేన" అను మొదటిశ్లోకమును అయిదు పర్యాయములు పఠించి హనుమంతునకు నమస్కారముచేసి పిదప కవచమును పఠించవలయును

శ్లో॥ య త్పురా వాయుదేవాయ ప్రోక్తంవా పరమేష్ఠినా ।
పాదామారభ్యమూర్ధాంతం న్యసేత్కవచ ముత్తమం ।
నియతః ప్రాఙ్ముఖ స్తిష్ఠన్ శుచౌ దేశే దృఢవ్రతః ।
నమస్కృత్య హనూమంతం కవచం చ పఠేత్తతః ।

తా॥ శుచియగు ప్రదేశమున ప్రాఙ్ముఖుండై, స్థిరచిత్తముతో, పాదములు మొదలు శిరస్సువరకును కవచము నుంచవలయును (అనగా) ఆయా స్థానములయందు మంత్రాదిదైవత మున్నట్లుగా భావన చేయవలయును.

శ్రీ ఆంజనేయస్వామివారికి నమస్కరించి పిదప కవచమును పఠించవలయును. పై జెప్పిన విధముగా ప్రతి శనివారముగాని, లేనిచో

ఐదు శనివారములైనను, - నువ్వులనూనె, నెయ్యి, ఆముదము - ఈ మూడింటిని కలిపి రాగిప్రమిదయందు దీపారాధనజేసి శ్రీ హనుమత్కవచమును పఠనజేసినచో, ఆదిత్యాది సర్వగ్రహదోషములు నివారణమయి, శుభములు చేకూరుటనుటలో సందియము లేదు

## శ్రీ హనుమత్కవచ ప్రారంభః

అస్య శ్రీ హనుమత్కవచస్తోత్ర మహామంత్రస్య – వసిష్ఠఋషిః – అనుష్టుప్ ఛందః – శ్రీ హనుమాన్ దేవతా – మారుతాత్మజ ఇతి బీజం – అంజనాసూను రితి శక్తిః – వాయుపుత్ర ఇతి కీలకం – శ్రీ హనుమత్ప్రసాదసిధ్యర్థే జపే వినియోగః ॥

ధ్యానం :

శ్లో ॥ ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయః
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయం ॥

మను :

శ్లో ॥ పాదౌ వాయుసుతః పాతు రామదూత స్తదంగుళీః
గుల్ఫౌ హరీశ్వరః పాతు జంఘే చార్ణవలంఘనః
జానునీ మారుతిః పాతు ఊరూ పా త్వసురాంతకః
గుహ్యం వజ్రతనుః పాతు జఘనం తు జగద్ధితః
అంజనేయః కటిం పాతు నాభిం సౌమిత్రిజీవనః
ఉదరం పాతు హృద్గేహీ హృదయం చ మహాబలః

వక్షో వాలాయుధః పాతు స్తనౌ చాఽమితవిక్రమః
పార్శ్వౌ జితేంద్రియః పాతు బాహూ సుగ్రీవమంత్రకృత్
కరావక్షజయీ పాతు హనుమాం శ్చ తదంగుళీః
పృష్ఠం భవిష్యద్బ్రహ్మా చ స్కంధౌ మతిమతాం వరః
కంఠం పాతు కపిశ్రేష్ఠో ముఖం రావణదర్పహా
వక్త్రంచ వక్తృప్రవణో నేత్రే దేవగణస్తుతః
బ్రహ్మాస్త్రసన్మానకరో భ్రువౌ మే పాతు సర్వదా
కామరూపః కపోలే మే ఫాలం వజ్రనఖోఽవతు
శిరో మే పాతు సతతం జానకీశోకనాశనః
శ్రీ రామభక్త ప్రవరః పాతు సర్వ కళేబరం
మా మహ్ని పాతు సర్వజ్ఞః పాతు రాత్రౌ మహాయశాః
వివస్వదంతేవాసీచ సంధ్యయోః పాతు సర్వదా
బ్రహ్మాది దేవతాదత్తవరః పాతు నిరంతరం
య ఇదం కవచం నిత్యం పఠే చ్చ శృణుయాన్నరః
దీర్ఘమాయు రవాప్నోతి బలం దృష్టించ విందతి
పాదాక్రాంతా భవిష్యంతి పఠత స్తస్య శత్రవః
స్థిరాం సుకీర్తి మారోగ్యం లభతే శాశ్వతం సుఖం
ఇతి నిగదిత వాక్యవృత్త తుభ్యం
సకలమపి స్వయ మాంజనేయవృత్తం
అపి జని జనరక్షణైకదీక్ష
వశగతదీయ మహామను ప్రభావః ।

ఈ కవచమును పైన చెప్పినవిధిగా ప్రతి నిత్యము పఠించినచో సర్వరోగములు, సర్వ శత్రుభయములు తప్పక శమించును ఇదిపూర్వము

శ్రీరామునకు వసిష్ఠముని యుపదేశించిన అత్యద్భుత కవచము ఇది పరాశరసంహితనుండి గ్రహింపబడినది

ఓమ్ శ్రీ సీతారామాంజనేయాయ నమః

## శ్రీ ఆంజనేయస్తవము

శ్లో॥ ఉదగ్రవాల భ్రమణాఽనిలాహతా।
భవంతి యస్యాంబుధరా స్సమంతతః।
స దివ్యపంచానన వాయునందనో।
మమాస్తు కల్యాణవివృద్ధయే హరిః॥

## దండకము

శ్రీ రామదూతా ప్రసన్నాంజనేయా భవజ్జన్మవృత్తంబు బల్ చోద్యమై హృద్యమై నవ్యమై దివ్యమై జన్మ సార్థక్యమున్ గూర్చునో వాయుపుత్రా బుధస్తోత్రపాత్రా త్రినేత్రా శివా నీవు మున్నర్ధనారీశ్వరుండౌచు వేసారి విరాగచిత్తుండవై శాశ్వతంబైన నిష్కల్మష బ్రహ్మచర్యంబు గాంక్షించి శ్రీ కేసరిక్షేత్రజుండౌచు నయ్యంజనాపుత్రుడై యొంటిజందెంబుతో పీతవస్త్రంబుతో నుద్భవం బందితౌ రామకార్యప్రియా యేకపాదాహ్వయా కీశ నీశైశవంబందె క్షుద్బాధతో పన్ ఫల భ్రాంతి సర్వగ్రహాధీశు సప్తాశ్వు వీక్షించి వాలంబు సంధించి బంధించి మర్దించి స్వర్భాను బాధించి స్వర్గేశు గర్దించి వాణీశురావించి గౌరీశ దిక్పాల గీర్వాణ సంఘంబు చేతన్ వరప్రాప్తి దీర్ఘాయువున్ భానుతేజంబునున్ వజ్రకష్టాస్త్ర నిర్భీతిన్ కర్ణభూషాదులం గొంటివౌ నిష్కళంకా మహాసాహసాంకా పరాభూత శూరా త్రిలోకైకవీరా అసామాన్యశౌర్యైకరాశీ భవద్బాల్య చారిత్ర మెన్నన్ జతుర్వేద వేదాంగ వేదాంత షట్శాస్త్ర పారంగత జ్ఞానసంపత్తివిం గాంచి బల్ గాయకాచార్యుడై

గానవిర్ణేతవై వ్యాకృతి జ్ఞాన సంపన్నుడై సాహ సౌదార్య విద్యా దయా ధైర్య
దార్ఢ్యాదులున్ శాంతి దాంతి క్షమాధ్యాన వైరాగ్య ధర్మంబులున్ గాంచితౌ గాదె
శుద్ధప్రచారా చతుర్వేద సారా శుభాకార సంగీత సాహిత్య విద్యానిధి ధీనిధి
నిర్వికార నవవ్యాకృతి జ్ఞానధీరా సదాచారం సీమాయయా భానుజుంజేరి
మంత్రిత్వమున్ జేసి శ్రీరామభక్తుండవై జానకీదేవికై వార్ధి లంఘించి
వైదేహినింగాంచి శ్రీరామముద్రాంకితం బిచ్చి యాలంకనుంగాల్చి తద్వార్త
కిష్కింధకుందెచ్చి యా కైకసీ పుత్రునిన్ మిత్రునింజేసి శ్రీరామ
సౌమిత్రి సుగ్రీవులను గైకసీ నందనున్ జాంబవన్ముఖ్యులన్ గూడి దైత్యేశుపై
దండు సాగించి యా సేతుబంధంబు పౌలస్త్యనాశంబు తద్దోషమున్
ద్రోయగా రామలింగ ప్రతిష్ఠాపనంబన్న కార్యక్రమంబందు నీ శౌర్యమున్
బూర్తిగా చేసి శ్రీరామపట్టాభిషేకంబు సాగించితౌ రామభక్తా సదా స్వామి
సేవానురక్తా శతాస్యాసురుం ద్రుంపగా నేగుచో దాల్త నీ విశ్వరూపంబునుం
చూపి శ్రీ జానకీ రామ రామానుజాప్తాదులన్ సైన్యవర్గంబులన్ నీశిరంబందు
నెక్కించి యంభోదులన్ జుల్కదాటించి పాళెంబులం డించి యాయుద్ధమం
దద్భుతంబౌ నృసింహాశ్వక్రోడ్యనౌకాహనాశాస్యముల్ దోపగా పంచవక్త్రావ
తారంబునుం దాల్చి రెండైదు కేలుం బరేవైన నేత్రంబులున్ గల్గగా
ముద్గరంబున్ గదా శూల ఖట్వాంగ ధాత్రీజ సీరాద్రి పాశాంకుశంబుల్
కపాలంబునా జెల్లు శస్త్రంబులన్ బూని యాదైత్యు మర్దించుటేగాక దీవికిన్
లంకకున్ నీదు లాంగూలపున్ సేతువున్ గట్టు నీదివ్య సామర్థ్యమున్
స్వామి సేవాపరత్వంబు నల్మోము లొప్పారు వాణీశుడున్ దెల్పగా జాలునే
పావనీ సాగరోత్తారకా ఆపదుద్ధారకా శత్రువిధ్వంసకా పంచవక్త్రా పవిత్రా
భళీ కోటిసింహైకసత్వా భవన్మూర్తి టెక్కెంబునన్ దాల్చుటన్ జేసి
గాండీవి దుస్సాధ్యుడై మించి ఘోరార్భటిన్ శత్రుతండంబులన్ గుండెలన్
జీల్చి చెండాడెహో భండనోద్దండ భీముండు సౌగంధికాపేక్షచే బోవుచున్

మార్గమధ్యంబునన్నుండు నీవాల మొక్కింత యల్లార్ప లేదయ్యెగా బాపురే సోదరప్రేమచే నీవు చేసిద్ద పక్షరోమావళి సాహాయ్యమున్ గాంచిగాదే సుపర్వేశుడున్ భీతివెన్నాడు సుగ్రాటవిన్ జేరి పెల్లార్చి వెంటాడ బర్వెత్తి యొక్కొక్క రోమంబున్ వేయగా నద్ది కాసారమున్ లింగమున్ తోటలున్ గోపురాలట్టె సృష్టించుటన్ జేసి యాపురుషంబౌ మృగంబున్ మహాయాగ శాలాది శుద్ధ్యర్థమై తోడితేగల్గె నీరోమమే యింత సేయంగ నీవెంత సేయంగ శక్తుండవో నీ నామమంత్రం బెదన్ దాల్చుటన్ జేసి యాకార్తికేయుం డసాధ్యారియౌ తారకాఖ్యాసురున్ సుంతలో ద్రెళ్ళగా నేసెనౌ సీరిరి నాగారి దేవర్షులౌ గాయకద్వంద్వముం వాడు నీదౌ కృపంగాదె దోర్గత్యదోషంబునుం బాసి శుద్ధాత్ములై రిశయిప్పట్టు లితంతగా జేసి ముందింకనుం బ్రహ్మవై యెట్లు పాలింపగా నుంటివో వీరగుండ క్రియారాగసక్తా స్వయంవ్యక్త వేదోక్తమార్గానురక్తా మహాభక్తా శాండిల్యమౌనీంద్రు శాపార్తిచే నద్రియైయున్న యధాన్యమాలిన్ భళీ శాపమున్బాపి కాపాడితౌ సంగరంబందు నీముష్టి ఘాతంబులన్ ముక్తులైనట్టి యా రాక్షసశ్రేణి లెక్కింపగా శక్యమే దుష్ట పాతాళ లంకేశు మైరావణుం ద్రుంపగా నేగుచో బుత్రు మత్స్యేశు మెప్పించి యాదైత్యునిన్ బుత్రమిత్రాళితో ద్రుంచి కంకాళకర్పింపనై భద్రకాళి గృహంబందునం సుప్తులైయున్న శ్రీరామ సౌమిత్రులన్ బంధముల్ బాపితోతెచ్చితౌ సర్వ భద్రా మహాకాలరుద్రా లసన్ముద్రికోన్నిద్ర భద్రాంజలీ ముద్రికం జేతికందిచ్చుటం జానకిం డాసి తద్వార్తచే రామునిన్ సంజీవిచే లక్ష్మణున్ రాముసేనన్ సుధాసారమున్ జల్లుటం గైకయీపుత్రు శత్రుఘ్నునిం జీవమున్నిల్పుటౌగాక, యా పుష్పకం బెక్కుచో నావాహవంబందు ముంజిచ్చి స్వర్గస్థుడైయ్యున్న సద్భక్తుడౌ కీశు డొక్కండటం గానరాకున్న శ్రీరామునాజ్ఞం దలందాల్చి వే భూర్భువర్లోక ముఖ్యోర్ధ్వ లోకంబులం దాటి యవ్వాని నానత్యలోకంబునం గాంచి దోడ్తెచ్చి మోదంబునుం

కూర్చితౌ నిట్టి నీదౌ ప్రభావంబు నీశక్తి నీయుక్తి నీభక్తి వర్ణింప వేనోళ్ళ భోగీశుడుం జాలునే ఈశ ఓంకారరూపా ప్రశస్తప్రతాపా వనౌకాధిపా పింగళాక్షా సదా సాధురక్షైకదీక్షా మహాత్మా హరీ వైష్ణవారాధ్యుడున్ శంభువంశస్థుడున్ భావిహైరణ్యగర్భుండు నైయెప్పు నోవిశ్వబీజా త్రిమూర్త్యాత్మకా దివ్యమంత్రస్వరూపా హయగ్రీవ ఓంకారం హ్రీంకార శ్రీంకార బీజంబు శ్రీంకార సచ్ఛక్తి దైత్యేశువిధ్వంసనా యేతి వర్మంబు ఘూ ఘూ ఘుహూః క్కార యుక్కీలకంబొప్పు నీబ్రహ్మ మంత్రంబు ప్రొద్దుటం లేచి ఆత్మధ్యానించినన్ భక్తి వాక్రుచ్చినన్ బ్రీతి నాలించినన్ భూతభేతాళులున్ వ్యాళముల్ బ్రహ్మరక్షస్సులున్ శాకినీ ఢాకినీ త్యాది దుష్టగ్రహంబుల్ మశూచీవిషూచీ మహామారి లోనౌ విషవ్యాధులున్ శత్రుదౌష్ట్యంబులున్ దుష్ప్రయోగంబులు న్నాశముం జెందుటేగాక దీర్ఘాయురారోగ్య సంపత్తులున్ భోగభాగ్యంబులున్ గల్గు నిత్యంబునున్ బాడినన్ దివ్య సంగీత సాహిత్య విజ్ఞానమున్ సత్కవిత్వంబు దార్ఢ్యంబు ధీశక్తి యుక్త్యాదులున్ యిష్టకామ్యార్థ సంసిద్ధియున్ గల్గు సర్వార్థ సంధాయకా హో మహారిష్టవిధ్వంసకా స్వప్రకాశా చిరంజీవి మాం పాహి మాం పాహి శ్రీదా లసత్కీర్తిదా భుక్తిముక్తిప్రదా సూర్యచంద్రాగ్ని నేత్రా జగత్ప్రాణ కైవల్యరూపా సముద్ధూతపాపా నమో వాయుపుత్రా నమః పంచవక్త్రా నమో దుష్టహంతా నమో గ్రామశాంతా నమో ధర్మవేత్తా నమో రామదూతా నమస్తే నమస్తే నమస్తే నమః ।



# శనివారవ్రత ప్రాముఖ్యము

## శనివాసరమందు శ్రీ హనుమత్పూజా విశిష్టత

శ్లో॥ మందవారేతు సంప్రాప్తే హనూమంతం ప్రపూజయేత్
సర్వేష్వపిచ వారేషు మందవారః ప్రశస్యతే
హనూమజ్జ న్మనోహేతో స్తస్య ప్రాశస్త్య ముచ్యతే
తస్మిత్తస్మిన్ కృతా పూజా సర్వకామఫలప్రదా ॥

తా॥ ప్రతి శనివారమును అంజనేయమూర్తిని పూజించవలసినది శనివారము రోజున చేసిన పూజవలన హనుమంతుడు సంతోషించి, సర్వసిద్ధుల నిచ్చుననుటకు యెంతమాత్రము సందియములేదు శనివారము హనుమజ్జన్మ దినసమగుటవలన సప్తవారములలోను శనివారమంత ఖ్యాతి గణించినది

శ్లో॥ దీపంప్రజ్వాల్యపూజాదౌ గోఘృతేనప్రయత్నతః
ప్రమాదాద్యదినో కుర్యా త్పూజానిష్ఫలతామియాత్ ॥

తా ॥ పూజా ప్రారంభమునందు ఆవునేతితో దీపమునుంచిన శ్రేష్ఠము లేదా నువ్వులనూనెతోనైనను చేయవచ్చును దీపారాధనము లేని పూజవలన ఫలము నొందజాలరు

శ్లో॥ బ్రాహ్మణో, క్షత్రియోవాఽపి వైశ్యశ్శూ ద్రోధవాస్త్రియః।
పూజయేచ్ఛహనూమంతం మందవారే విశేషతః ॥

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు స్త్రీలు భక్తిగలవారెల్లరు శనివారమునందు యధాశక్తిగా, శ్రీ ఆంజనేయస్వామిని పూజింపవలెను

శ్లో ॥ బ్రాహ్మణాన్భుజయే త్పశ్చాదేకభుక్త వ్రతంచరేత్ ।
ఏవం యః కురుతే పూజాం హనుమద్వాసరే శుభే
తస్య ప్రసన్నో హనుమాన్సర్వాభీష్టం ప్రయచ్ఛతి ॥

తా॥ శనివారమునందు ఏకభుక్తముకలవారై యెవరు హనుమంతుని సేవించెదరో వారికి ఆంజనేయమూర్తిసర్వాభీష్టములనిచ్చును (గృహిణాం భోజనమ్మతమని యున్నదిగాన గృహస్థులు భోజనము చేయవచ్చును)

ఏ ఒక్క శనివారమునందైనను నియమములో భక్తిశ్రద్ధలు కలవారై ఎవరు ఈ వ్రతమునాచరించెదరో వారికి సర్వసిద్ధులు కలుగుననుటకు సంశయములేదు ఇందుకు పరాశర మైత్రేయసంవాదమునమున్న యీ క్రింది ప్రమాణమును చూడుడు

పరాశరః

శ్లో ॥ సతతం మందవారేషు భరతః క్షత్రియోత్తమః
హనుమంతం భజంస్తస్థౌ నిరంకుశ పరాక్రమః ॥

తా ॥ క్షత్రియోత్తముడైన భరతుడు ప్రతి శనివారమునందును, హనుమంతుని సేవించి, నిరంకుశమైన పరాక్రమము కలవాడాయెను అని పరాశరసంహితయందు మైత్రేయునకు పరాశరులు చెప్పెను

శ్లో ॥ అతఃపరం ప్రవక్ష్యామి హనుమత్తుష్టయేవిధిం ।
శనివారేశ్రావణేచ అభిషేకంసమాచరేత్ ।
రుద్రమంత్రేణ తైలేన హనుమత్ప్రీణనా భవేత్
తైలేమి శ్రితసింధూర లేపంతస్యచసమర్పయేత్

శ్లో ॥ శ్రావణేమందవారేతు ఏవమారాధ్య వాయుజం
వజ్రతుల్యశరీరత్వాత్ అరోగోబలవాన్నరః

